# సంస్కృత భాషా బోధిని

**_Being a treatise on the essentials of Sanskrit._**

---

యల్లంరాజు శ్రీనివాసరావు, B.A., (Hons)
ప్రభుత్వ కళాశాల — అనంతపురము.

ప్రకాశకుల్
లభ్యత
కృష్ణా బుక్ స్టాల్,
అనంతపురము.

# ప్రస్తావన.

సంస్కృతము చాల ప్రాచీనమైనభాష. నేటి భారతీయ భాషలకు పెక్కింటికిది జీవనాధారము. అందు ముఖ్యముగా మన తెనుఁగునకు దీనికిని ఆదినుండియు నవినాభావరూపమగు సంబంధము గలదు. సంస్కృతమునందు పరిజ్ఞానము సంపాదింపక ఆంధ్రమునందెంతటి పాండిత్యము నార్జించినను దానికొక ప్రామాణికత్వముగాని పరిపూర్ణతగాని సంభవింపదు. సంస్కృతాంధ్రముల కట్టి గాఢమైన పొత్తుగలదని గ్రహించినవారు గావుననే మన ప్రాచీనులు మాతృభాష నభ్యసించుటకు ముందు దానికి మూలమైన సంస్కృతభాషయందు తగినంత పరిశ్రమము కావించుచు వచ్చిరి. అట్టి సంప్రదాయము కాలక్రమమున విచ్ఛిన్నమయి ప్రస్తుత మాంధ్రవాఙ్మయమునం దపండితుల రచనలు ప్రచురములు కాఁజొచ్చినవి. తన్మూలమున క్రొత్తగా భాష నభ్యసించి చక్కని పరిజ్ఞానమును బడయనెంచిన విద్యార్థులకును మిక్కిలి యనర్థమొనఁగూడుచున్నది. కాబట్టి ఆధునిక కాలమున స్వభాషా సంప్రదాయమును రక్షింపఁదలచిన ప్రతి ఆంధ్ర విద్యార్థియు తదాధారభూతమైన సంస్కృతమునఁ దగినంత శిక్షణ పొందవలసియున్నది.

కాని సంస్కృతము నాధునికు లభ్యసించుటకు తగిన సాధనములు కావలయును. ప్రస్తుతము అన్నిభాషలును అచిరకాలమం దనాయాసముగ నేర్చుకొనుట కవకాశము లేర్పడు

చున్నవి. అట్టి సుగమములైన మార్గములు సంస్కృతమున కింకను సువ్యవస్థితములు కాలేదు. ప్రాచీనులు రచించిన లక్షణ గ్రంథములు సంస్కృతమున కనేకములు గలవు. వాస్తవమున కింతటి లక్షణ శాస్త్రసంపత్తి మఱియొక భాషకు దేనికిని గాన రాదనుట నిర్వివాదము. అయిన నవి యాధునిక విద్యార్థుల కెంతమాత్రము నుపకరింపవు. అది యెట్లనిన నా గ్రంథములు శబ్దలక్షణాత్మకములెగాని వాక్యలక్షణ నిరూపకములుంగావు. ఆ శబ్దముల స్వరూపముగూడ వాని వ్యాపార క్రమమును (Function) బట్టి కాక వ్యుత్పత్తి ప్రకారమును బట్టియే (Formation) ప్రదర్శింపఁబడినది. అట్లు ప్రదర్శించునప్పు డారంభకులగువారి కవశ్యకమైనదియు ననావశ్యకమైనదియు నగు సామగ్రి యంతయును సాధించి చూపఁబడినది. అదియును పద్మ వ్యూహములవలె దురవగాహములైన సూత్రవార్తిక భాష్యాదు లగు బహువిధములైన శాస్త్ర పరిభాషల నాధారము చేసికొని ప్రపంచించుటచేత నెట్టి సూక్ష్మబుద్ధులకుగాని ప్రారంభదశయందు బహు కాలము గురుముఖమున నభ్యసించినఁగాని ప్రవేశము కలుగదు. మఱియును వానియందు ప్రతిపాదించిన విషయ జాతముకంటె దాని నావరించియుండు పరిభాషయే అధికతరమై యుండుటవలన విద్యార్థులు గ్రంథమునెల్ల వల్లించిననేగాని అందలి అర్థములు కంఠస్థములు కానేరవు. ఇట్టి వల్లించు విధా నము సమంజసముగాదని ఆధునికులైన భాషాశాస్త్ర పరిశోధకు లెల్లరు నుద్ఘోషించుచున్నారు. కాదని పట్టుఁబట్టి వల్లించితి మేపో, దానివలనఁగలుగు ప్రయోజనమేమి. వెనుకఁజెప్పిన

హేతువులచేత విద్యార్థులకు సంస్కృతమున నిర్దుష్టముగా వాక్య నిర్మాణముచేయుటకుఁగాని అందులకు దోహదముచేయు నావశ్యకమైన శబ్దసామగ్రియంతయు నాయా ప్రకరణములందు సుకరముగా నచిరకాలమునందే గ్రహించుటకుఁగాని అవకాశము లేదుగద. అందుచేత ప్రాచీన లక్షణగ్రంథము లెన్నియున్నను ఆధునికుల కవి యెంతమాత్రమును తోడ్పడఁజాలకున్నవి.

ఇఁక నర్వాచీనులైన పండితులును సంస్కృతము నేర్పుటకయి పలువురు పలువిధములైన గ్రంథములను రచించియున్నవారు. వీరికందఱకును సంస్కృత భాష నాధునికులైన విద్యార్థులకు అతి సుకరముగా బోధింపవలెనను అభిప్రాయమే గలదు. కాని వీరి రచనాధోరణి మాత్రమాయాశయమునకు దూరదూరముగ నుండిపోయింది. అది యెట్లనిన వీరు రచించిన గ్రంథములు రెండువిధముల వర్తించుచుండును. కొన్ని వ్యాకరణగ్రంథములు. కొన్ని పాఠ్య పుస్తకములు. ఉభయములును భాషాబోధనమున కుపయుక్తము లగునవియే. రెంటియందును ప్రాచీనములైన పరిభాషా సంప్రదాయమును, ఎల్లించు విధానమును చాలవఱకు వదలివేయఁబడినవి. అందులకుఁదోడు శబ్దలక్షణమాత్ర పర్యవసాయులు గాక యివి భాషకత్యంత ప్రధానమైన వాక్యనిర్మాణమునే బహుముఖముగా ప్రపంచింపఁజొచ్చినవి. ఇంతవఱకు నివి మంచి పాకముననే పడినవని చెప్పవచ్చును గాని వీనిని మించిన గొప్ప ప్రతిబంధకములు కొన్ని యీ గ్రంథములందును ఏర్పడుటచేత నివియును ప్రస్తుతము విద్యార్థిజనులకంత ఉపకారములుగా

పరిణమించుటలేదు. వీరు వల్లించుమార్గమును తొలఁగించిరిగాని దానికి మాఱుగా ననువాద విధానమును బ్రవేశపెట్టిరి. మఱియును వీరు వాక్యనిర్మాణమునకుఁగల ప్రాధాన్యమును గుర్తించినారేగాని దాని తత్త్వమును సమగ్రముగను సమన్వయపూర్వకముగను బోధించినవారుగారు. కేవలము తమకు దోఁచినట్లు నేకవాక్యముల నుదాహరించుచుఁ బోవ నారంభించిరి. ఇందుమూలమున విద్యార్థులు వారిచ్చిన శబ్దజాలమునకును దాని నుపయోగించి వారు గావించెడు వాక్యసందర్భమునకును అక్కడికక్కడ నర్థము చెప్పుకొనవలయునేగాని మరల తను యభిప్రాయముల కనుగుణములైన క్రొత్త వాక్యములను స్వతంత్రముగా రచించు సామర్థ్యమును పడయనేరకున్నారు. అదియునుగాక వీరు తమ గ్రంథములయందు వాక్యనిర్మాణము చేయుటకు నుపయోగించు శబ్దసామగ్రి నందులకు కావలసినంత వఱకు మాత్రమె యొసంగక అనావశ్యకములైన శబ్దరూపముల నన్నిటిని ప్రోగుచేసి చూపుచున్నారు. ఇట్లు చూపునప్పుడును ఆ యా ప్రకరణములందా యా శబ్దరూపములనెల్ల నొక్కచోట సంగ్రహించి చూపక అక్కడక్కడ నసంగతముగా నొసంగుచున్నారు. మఱియును సిద్ధములైన శబ్దరూపముల నుదాహరింపక ప్రాచీనులవలెనే వాని రూపములను బహువిధములుగా సాధించి చూపుటకు ప్రయత్నములు చేయుచున్నారు. ఇన్ని ప్రతిబంధకము లేర్పడుటఁజేసి కొన్ని క్రొత్తమార్పులనుగొని తెచ్చినవయ్యు నర్వాచీనములైన గ్రంథములు సైతము

ప్రాచీన గ్రంథములవలెనే సంస్కృతాభిలాషులకు చక్కనిభాషాధి కారమును గలిగింపజాలకున్నవి.

భాషాధికారమును సంపాదించుటయనిన భాషయందు సవిశేషమైన సామర్థ్యమును బడయుట. అట్టి సామర్థ్యము రెండువిధములు. ఒకటి శబ్దవిషయము. మఱియొకటి వాక్య విషయము. ఇవి రెండును పరస్పరము నిరపేక్షములుగావు. శబ్దములు భాషకుఁ గావలసిన సామగ్రిని సమకూర్చును. వాక్య ములు తన్నిర్మాణకార్యమును నిర్వర్తించును. సామగ్రిలేని నిర్మాణము సంభవింపదు. నిర్మాణమునకుఁగాని సామగ్రి నిరుప యోగము. ఇట్లివిరెండును ఇతరేతరాశ్రియములయియున్నవి ఐన నిచ్చట నొక విశేషముగలదు. నిర్మాణాత్మకమైన వాక్యవే భాషకు పరిపూర్ణత నిచ్చుటవలన ప్రధానాంశమగుచున్నది. మఱి ఉపకరణాత్మకములైన శబ్దము లందులకు దోహదము చేయు నవయవములే యగుటచేత నానుషంగికములగుచున్నవి. అందుచేత భాషాలక్షణమునందు వాక్య స్వరూపమునే ప్రధాన ముగా నిరూపించుచు అందులకు సర్వవిధముల ననుకూలమగు మార్గమున శబ్దముల సామగ్రిని ప్రతిపాదించుట అపేక్షణీయము. శబ్దరూపములు వాక్య నిర్మాణమున కావశ్యకములగు నంత వఱకు నుదాహరింపఁ బడవలయును. అవి ప్రక్రియారూపము నఁగాక ప్రయోగానురూపముగనే వ్యవస్థితమైయుండవలయును. రూపనిర్దేశ పద్ధతియందొక సమన్వయమును పౌర్వాపర్యాయ మును బాటింపవలయును. మఱి వాక్యనిర్మాణమునందు

సామాన్య లక్షణములెల్ల ముందు ప్రదర్శింపవలెను. అనంతరము ఆయా శబ్దములను క్రమక్రమముగా నుపయోగించి వాక్యములను నిర్మించు విధానమును బోధింపవలెను. తరువాత రచనావిషయమందుఁగల విశేషాంశముల నన్నిటిని సంగ్రహించి చూపవలయును. ఈరీతిగా పదవాక్యస్వరూపమును చక్కఁగా పరిష్కరించి వకాణించుటవలన విద్యార్థులు తమ కపేక్షితమైన శబ్దసామగ్రినంతటి నాయాప్రకరణములం దనాయాసముగా గ్రహించుటయేగాక దానినంతటిని సమయోచితముగ నుపయోగించుచు స్వతంత్రముగా చిత్రవిచిత్రములైన వాక్యనిర్మాణములను గావించు సామర్థ్యము గడింపనేర్తురు. ఇట్టి సామర్థ్యము నొసఁగుటకు సమర్థములుగాకుండుటచేతనే ప్రాచ్య నాధునికములైన సంప్రదాయములు రెండును సప్రయోజనములు గాకపోయినవి. తత్కారణముగా తక్కిన అన్ని భాషలవలెఁగాక సంస్కృతము నభ్యసించుట మిక్కిలి కష్టసాధ్యమని విద్యార్థులు పెక్కువిధముల భ్రాంతిపడుచున్నారు. మఱియును కొంతవఱకు నభిమానముగలిగి నేర్చుకొన నుత్సహించినవారు సైతము నిరుత్సాహులయి తమ ప్రయత్నములనుండి విరమించుచున్నారు. కాని చక్కనిమార్గమున బోధించినపక్షమునమాత్రము సంస్కృతముకంటె మిక్కిలి సులభసాధ్యమగు భాష లేదని యాధునికులకుఁ జూపవచ్చును.

ఇట్టి అభిప్రాయములను మనసునందుఁబెట్టుకొనియే నేను కొన్నిదినములనుండి దీనికొక పరిష్కారమార్గమును సాధింపవలె

నని గట్టిప్రయత్నములు చేయఁదొడఁగితిని. ఆ ప్రయత్నములే నేటికి గ్రంథరూపమునఁ బరిణమించినవి. ఈ గ్రంథమును నేను రెండుభాగములుగా గావించితిని. అందు మొదటిది శబ్దపరిచ్ఛేదము- రెండవది వాక్యపరిచ్ఛేదము. వీనిరెంటియందును నేనవలంబించిన విధానమంతయును పూర్వోక్తములైన నా సిద్ధాంతముల కను రూపముగానే వర్తించును. ఇది కేవలము వ్యాకరణశాస్త్రము గాదు. కేవల పాఠ్యపుస్తకమునుగాదు. లక్ష్య లక్షణమార్గము లను రెండిటిని జీర్ణించుకొన్న యొక విలక్షణ సంప్రదాయము. వీనియందు నేను ప్రాచ్యపాశ్చాత్యమార్గములకు రెండిటికి సాధ్య మగునంతవఱకును సమన్వయము నాపాదించి ఆధునికుల చిత్త ముల కెక్కునట్లు అచిరకాలమునందే సంస్కృతము ననాయాస ముగా బోధించు నుపాయమును సాధింపఁజూచితిని. కాని యేకార్యమును సాధించుటకేని ఒక అధికారమనునది యుండ వలయును. అది యొక గ్రంథమును రచించువాని కెంత యపేక్ష ణీయమో దానిఁబఠించు విద్యార్థులకు నంత యభిలషణీయమే. ప్రకృత గ్రంథమును బరిశీలించి యందు నేను బ్రతిపాదించిన యథాతత్త్వమును బాగుగానాకళింతకుఁ దెచ్చుకొనఁగోరు విద్యార్థులెల్ల వారును మున్ముందు తమ మాతృభాషయందుఁ గాని అథమపక్షమాంగ్లాది వైదేశిక భాషలందుఁగాని కొంత భాషా సామాన్య లక్షణములనైన పరీక్షించి వానిం దమ యనుభవములోనికిఁ దెచ్చుకొనియుండవలయును. అట్టివారలకు దీనివలన నపేక్షితమైన ఫలము లభించుననుట కాక్షేపములేదు. మఱియు నీ పుస్తకము చదువునప్పు డారంభకులైన విద్యార్థుల

కనుసరణీయములైన విధులు కొన్ని గలవు. వానినీ దిగువ నుదాహరించెదను – పరిశీలించునది.

1) శబ్దపరిచ్ఛేదమందు అవ్యయములనుండి సంధులవఱకును గల నాలుగు ప్రకరణములును స్థూలముగానే పరిశీలించునది.

2) నామ సర్వనామములందు ప్రసిద్ధములైన సామాన్య రూపములనే తొలుత పఠింపవలయును.

నామములు:– రామ – హరి – గురు–ధాతృ–రమా–నదీ
  ఫల – జలముచ్ – ధీమత్ – వేధస్ – మనస్ మొ॥
సర్వనామములు:– అస్మద్ – యుష్మద్ – భవత్ –
  ఆత్మన్ – తద్ – ఏతద్.
సంఖ్యావాచకములను చదువ నవసరములేదు.

3) క్రియలయందు సమాపకాసమాపక రూపములును, వాని కర్తృకర్మార్థక రూపములను చక్కగా నవగాహనము చేసికొనవలె.

4) విశేషణములను, ముఖ్యముగా ధాతుజ విశేషణములను కంఠస్థము చేయవలెను.

5) వాక్యపరిచ్ఛేదమున సామాన్యలక్షణమునంతం పరిశీలింపం బనిలేదు.

6) తక్కిన ప్రకరణములందు శబ్దములకుఁగల ప్రయోగ లక్షణమును వానికిచ్చిన యుదాహరణములు సావధానముగా పరీక్షింపవలసియున్నది.

7) మిగిలిన విశేషాంశములను విస్మరింపను వచ్చును.

8) కడపటిదైన సింహావలోకనమును నిపుణముగా గమనింపవలయును.

ఇట్లు కొన్ని సూచనలు కావింపఁబడినవి. వీనినిబట్టి విద్యార్థు లీ గ్రంథమును పఠించునది. అట్లు పఠించునపుడు వారికిందు ప్రతిపాదింపఁబడిన విషయములు న్యూనముగఁగాని అధికముగఁగాని అనపేక్షితముగఁగాని తోఁచినయెడల వారు తమ అనుభవములను వెంటనే నాకు తెలుపఁగోరెదను. మఱియును ఇది నాకు ప్రథమ ప్రయత్నమగుటచేతను దీనిని రచించుటయందు నాకు సామర్థ్యముకంటెను సాహసికత్వమే యెక్కువగ తోడ్పడుటచేతను అక్కడక్కడ పెక్కు స్ఖాలిత్యములు దొరలియుండవచ్చును. అందు కొన్ని ముద్రారాక్షసములు నయియుండవచ్చును. పండితులైనవారు వానింబరిశీలించి యందలి సాధకబాధకములను దెలుపుచు నాకుఁ దమ యమూల్యములైన సందేశముల నందఁజేసిరేని వారికి నేనా

జన్మాంతము కృతజ్ఞుడనయ్యెదనని విజ్ఞాపనము చేసికొనుచున్నాఁడను.

"నహిజ్ఞానేన సదృశమ్ పవిత్ర మిహవిద్యతే"

అనంతపురము }
1—5—1958 }

ఇట్లు,
గ్రంథకర్త.

ఈ గ్రంథమునందు నేను ప్రయోగించినది సలక్షణమైన తెనుఁగుభాష. సంధివిషయమునను, అర్ధానుస్వార విషయమందును కొంత శైథిల్యముండవచ్చును. అది బుద్ధిపూర్వకమెగాని ప్రామాదికముగాదని గ్రహించునది.

---

# ప్రమేయ సంగ్రహము.

## I శబ్దపరిచ్ఛేదము.



## II వాక్య పరిచ్ఛేదము.

---

# 1. నామములు.

## ( Nouns )

సంస్కృతమున శబ్దములన్ని ఐదు విధములు.

1 నామములు *(Nouns)*
2 సర్వనామములు *(Pronouns)*
3 విశేషణములు *(Adjectives)*
4 క్రియలు *(Verbs)*
5 అవ్యయములు *(Adverbs, etc)*

అందు నామములను అజంతము లని హలంతములని రెండు వర్గములుగా విభజింపవచ్చును. అచ్చులు అంతమందు కలిగినవి అజంతములు.

ఉ॥ రామ – (మ్ + అ)

హల్లులు అంతమున కలిగినవి హలంతములు.

ఉ॥ మరుత్

అజంతములను మరల అకారాద్యంతములుగను హలంతములను చకారాద్యంతములుగను కొన్ని సూక్ష్మభాగములు కావింప వచ్చును. అన్నిటి యందును పుంలింగములు, స్త్రీలింగములు, నపుంసక లింగము లని నామములు వేర్వేఱుగ నుండును.

ఒక్కొక్క [1]లింగమునకు ఏకవచనము, [2]ద్వివచనము బహువచన మని మూడు వచనములు గలవు. ఒక్కొక్క వచనమునందును ప్రథమ - ద్వితీయ - తృతీయ - చతుర్థి - పంచమి - షష్ఠి - సప్తమి - అని ఏడు విభక్తులు గలవు. ప్రథమయందే సంబోధనప్రథమ అని ఒక అవాంతరభేదము కూడ గలదు. ఈ విధముగా మూడు వచనములందును ఎనిమిది విభక్తులందును (సంబోధనము కలుపుకొని) పుంలింగాది నామములకు ఒక్కొక్కదానికి ఇరువదినాలుగు విభక్త్యంతరూపములు ఏర్పడుచున్నవి. ఇవి నామములకు మూలరూపములైన ప్రాతిపదికములకు విభక్తి ప్రత్యయములు చేరుటవలన ప్రాప్తించుచున్నవి. కాని సంస్కృతమం దీ ప్రత్యయములు ప్రాతిపదికములకు చేరునప్పుడు అడుగడుగునకును అనేకములైన మార్పులు కలుగుచుండును. కాబట్టి సిద్ధములైన విభక్త్యంత రూపములను ఉదాహరించుటయే లాఘవము. అందు ఒక్కొక్క జాతికి ఒక్కొక్క నామమును ప్రతినిధిగా గ్రహించి ఉదాహరింతును. దానినిబట్టి దాని సజాతీయ నామములకెల్ల రూపములను ఊహింపవలసియున్నది.

---

1. సంస్కృతమున లింగము అనునది నామములకు గల అర్థమును బట్టి వర్తింపదు. యాదృచ్ఛికముగా వ్యవస్థితమైయుండును.

ఉ॥ పరిగ్రహః (పుం) - భార్యా (స్త్రీ) - కళత్రమ్ (నపుం.)

2. ద్వివచనము సంస్కృతమున విశేషముగ ఏర్పడినది. ఇది పదార్థముల ద్విత్వసంఖ్యను బోధించును.

ఉ॥ వృక్షౌ - లతే - ఫలే.

# అజంతములు — పుంలింగములు.

## అకారాంతము — 'రామ' శబ్దము — రాముఁడు.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | రామః | రామౌ | రామాః |
| సం. ప్ర. | రామ | ,, | ,, |
| ద్వి. | రామమ్ | ,, | రామాన్ |
| తృ. | రామేణ | రామాభ్యామ్ | రామైః |
| చ. | రామాయ | ,, | రామేభ్యః |
| పం. | రామాత్ | ,, | ,, |
| ష. | రామస్య | రామయోః | రామాణామ్ |
| స. | రామే | ,, | రామేషు |

ఇట్లు శివ, కేశవ, లోక, వృక్ష, వివేక, పరాక్రమ, మొ॥

రామశబ్దమునకు తెలుఁగునందుకూడ విభక్త్యంతరూపములనుదాహరించెదను. దానినిబట్టి తక్కిన అన్నిశబ్దములకును వానివాని అర్థములను అనుసరించి తెలుఁగురూపములను ఊహించుకొనవలెను.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | రాముఁడు | ఇద్దఱు రాములు | రాములు |
| సం. ప్ర. | రామ | ,, రాములార | రాములార |
| ద్వి. | రాముని | ,, రాములను | రాములను |

| | ఏక. | | ద్వి. | బహు. |
|---|---|---|---|---|
| తృ. | రామునిచేత | ,, | రాములచేత | రాములచేత |
| చ. | రామునికొఱకు | ,, | రాములకొఱకు | రాములకొఱకు |
| పం. | రామునివలన | ,, | రాములవలన | రాములవలన |
| ష. | రాముని యొక్క | ,, | రాముల యొక్క | రాముల యొక్క |
| స. | రామునియందు | ,, | రాములయందు | రాములయందు |

పయి రూపములందు ఒక్కొక్క విభక్తికిని ఒక్కొక్క ప్రత్యయమునే ఉదాహరించితిని. ఇవిగాక విభక్తులకు ఇంకను ప్రత్యయము లనేకములు కలవు. కావున తెలుఁగు విభక్తి ప్రత్యయముల నన్నిటిని ప్రతిపత్తి సౌకర్యార్థము ఇచట వ్రాయుదును.

ప్ర. — డు, ము, వు, లు,
సం. — అ, ఆ, అర, ఆరా,
ద్వి. — ని, ను, ల, కూర్చి, గురించి,
తృ. — చేత, చే, తోడ, తో,
చ. — కొఱకు, కయి,
పం. — వలన, కంటె, పట్టి, ఉండి,
ష, — కి, కు, యొక్క,
స. — అందు, న, లోపల, లో,

ఇకారాంతము – 'హరి' శబ్దము – విష్ణువు.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | హరిః | హరీ | హరయః |
| సం. ప్ర. | హరే | ,, | ,, |

| | | | |
|---|---|---|---|
| ద్వి. | హరిమ్ | హరీ | హరీన్ |
| తృ. | హరిణా | హరిభ్యామ్ | హరిభిః |
| చ. | హరయే | ,, | హరిభ్యః |
| పం. | హరేః | ,, | ,, |
| ష. | ,, | హర్యోః | హరీణామ్ |
| స. | హరౌ | ,, | హరిషు. |

ఇట్లు రవి, కవి, అసి, మణి, మొ॥

---

## ఇకారాంత విశేషము – 'పతి' శబ్దము – భర్త.

---

| | ఏక | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | పతిః | పతీ | పతయః |
| సం. ప్ర. | పతే | ,, | ,, |
| ద్వి. | పతిమ్ | ,, | పతీన్ |
| తృ. | పత్యా | పతిభ్యామ్ | పతిభిః |
| చ. | పత్యే | ,, | పతిభ్యః |
| పం. | పత్యుః | ,, | ,, |
| ష. | ,, | పత్యోః | పతీనామ్ |
| స. | పత్యౌ | ,, | పతిషు |

---

ఇది కొన్ని సమాసముల కడపట ప్రయోగింపఁబడినపుడు మాత్రము హరిశబ్దమువలెనే వర్తించును.

ఉ॥ తృ — భూపతినా
చ. — భూపతయే
పం. — భూపతేః – ఇత్యాదులు.

---

### విశేషము — సఖి శబ్దము — స్నేహితుఁడు.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | సఖా | సఖాయౌ | సఖాయః |
| సం. ప్ర. | సఖే | ,, | ,, |
| ద్వి. | సఖాయమ్ | ,, | సఖీన్ |
| తృ. | సఖ్యా | సఖిభ్యామ్ | సఖిభిః |
| చ. | సఖ్యే | ,, | సఖిభ్యః |
| పం. | సఖ్యుః | ,, | ,, |
| ష. | ,, | సఖ్యోః | సఖీనామ్ |
| స. | సఖ్యౌ | ,, | సఖిషు |

ఇదియును తఱుచుగా సమాసాంతములందు అకారాంతముగ మాఱుచుండును. అప్పుడిది అకారాంతపుంలింగ మగు 'రామ' శబ్దమునే అనుకరించును.

ఉ॥ ప్రియసఖః ప్రియసఖౌ ప్రియసఖాః ఇత్యాదులు.

### ఈకారాంతము — 'సేనానీ' శబ్దము — సేనాధిపతి.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | సేనానీః | సేనాన్యౌ | సేనాన్యః |
| సం. ప్ర. | ,, | ,, | ,, |
| ద్వి. | సేనాన్యమ్ | ,, | ,, |

| | | | |
|---|---|---|---|
| తృ. | సేనాన్యా | సేనానీభ్యామ్ | సేనానీభిః |
| చ. | సేనాన్యే | ,, | సేనానీభ్యః |
| పం. | సేనాన్యః | ,, | ,, |
| ష. | సేనాన్యః | సేనాన్యోః | సేనాన్యామ్ |
| స. | సేనాన్యామ్ | ,, | సేనానీషు |

ఇట్లు అగ్రణీ, గ్రామణీ, మొ॥

---

### ఉకారాంతము — గురుశబ్దము — గురువు.

---

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | గురుః | గురూ | గురవః |
| సం. ప్ర. | గురో | ,, | ,, |
| ద్వి. | గురుమ్ | ,, | గురూన్ |
| తృ. | గురుణా | గురుభ్యామ్ | గురుభిః |
| చ. | గురవే | ,, | గురుభ్యః |
| పం. | గురోః | ,, | ,, |
| ష. | ,, | గుర్వోః | గురూణామ్ |
| స. | గురౌ | ,, | గురుషు |

ఇట్లు తరు, భాను, మొ॥

---

### ఉకారాంతము — స్వయంభూ శబ్దము — బ్రహ్మ.

---

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | స్వయంభూః | స్వయంభువౌ | స్వయంభువః |
| సం. ప్ర. | ,, | ,, | ,, |
| ద్వి. | స్వయంభువమ్ | ,, | ,, |

| | | | |
|---|---|---|---|
| తృ. | స్వయంభువా | స్వయంభూభ్యామ్ | స్వయంభూభిః |
| చ. | స్వయంభువే | ,, | స్వయంభూభ్యః |
| పం. | స్వయంభువః | ,, | ,, |
| ష. | ,, | స్వయంభువోః | స్వయంభువామ్ |
| స. | స్వయంభువి | ,, | స్వయంభూషు |

ఇట్లు ఆత్మ భూ, స్వభూ మొ॥

---

ఋకారాంతము — 'ధాతృ' శబ్దము — బ్రహ్మ.

---

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | ధాతా | ధాతారౌ | ధాతారః |
| సం. ప్ర | ధాతః | ,, | ,, |
| ద్వి | ధాతారమ్ | ,, | ధాతౄన్ |
| తృ. | ధాత్రా | ధాతృభ్యామ్ | ధాతృభిః |
| చ. | ధాత్రే | ,, | ధాతృభ్యః |
| పం. | ధాతుః | ,, | ,, |
| ష. | ,, | ధాత్రోః | ధాతౄణామ్ |
| స. | ధాతరి | ,, | ధాతృషు |

ఇట్లు సవితృ, భర్తృ, నేతృ, మొ॥

---

విశేషము — 'పితృ' శబ్దము — తండ్రి.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | పితా | పితరౌ | పితరః |
| సం. ప్ర. | పితః | ,, | ,, |
| ద్వి. | పితరమ్ | ,, | పితౄన్ |

తక్కినది 'ధాతృ' శబ్దము వలెనే.

ఇట్లు భ్రాతృ, జామాతృ మొదలగునవి.

## విశేషము — 'నృ' శబ్దము — నరుఁడు.

ఇది అన్ని విభక్తులందును పితృ శబ్దమునే అనుసరించును. షష్ఠీ బహువచనమునందు మాత్రము కొంత మార్పుగలదు.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ష. | నరః | న్రోః | నృాణామ్ / నృణామ్ |

## ఓకారాంతము — 'గో' శబ్దము — వృషభము.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | గౌః | గావౌ | గావః |
| సం. ప్ర. | " | " | " |
| ద్వి. | గామ్ | " | గాః |
| తృ. | గవా | గోభ్యామ్ | గోభిః |
| చ. | గవే | " | గోభ్యః |
| పం. | గోః | " | " |
| ష. | " | గవోః | గవామ్ |
| స. | గవి | " | గోషు |

## ఔకారాంతము — 'గ్లౌ' శబ్దము — చంద్రుడు.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | గ్లౌః | గ్లావౌ | గ్లావః |
| సం. ప్ర. | ,, | ,, | ,, |
| ద్వి. | గ్లావమ్ | ,, | ,, |
| తృ. | గ్లావా | గ్లౌభ్యామ్ | గ్లౌభిః |
| చ. | గ్లావే | ,, | గ్లౌభ్యః |
| పం. | గ్లావః | ,, | ,, |
| ష. | ,, | గ్లావోః | గ్లావామ్ |
| స. | గ్లావి | ,, | గ్లౌషు |

## అజంతములు — స్త్రీ లింగములు

### ఆకారాంతము — 'రమా' శబ్దము — లక్ష్మి

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | రమా | రమే | రమాః |
| సం. ప్ర. | రమే | ,, | ,, |
| ద్వి. | రమామ్ | ,, | ,, |
| తృ. | రమయా | రమాభ్యామ్ | రమాభిః |
| చ. | రమాయై | ,, | రమాభ్యః |
| పం. | రమాయాః | ,, | ,, |
| ష. | ,, | రమయోః | రమాణామ్ |
| స. | రమాయామ్ | ,, | రమాసు |

ఇట్లు సీతా, భామా, లతా, విద్యా మొ॥

### విశేషము — 'అంబా' శబ్దము — తల్లి

దీనికి సంబోధన ప్రథమైక వచనమున మాత్రము రూప భేద మేర్పడును.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| సం. ప్ర. | అంబ | అంబే | అంబాః |

ఇట్లు అక్కా, అల్లా మొ॥

### విశేషము — 'జరా' శబ్దము — ముదిమి

దీనికి రమా శబ్దమునకు గల రూపములును మఱి కొన్ని విశేష రూపములును ప్రాప్తించును. అందు విశేషముగ ప్రాప్తించు రూపములను మాత్రము ప్రదర్శింతుము.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | జరా | జరసౌ | జరసః |
| సం. ప్ర. | జరే | ,, | ,, |
| ద్వి. | జరసమ్ | ,, | ,, |
| తృ. | జరసా | జరాభ్యామ్ | జరాభిః |
| చ. | జరసే | ,, | జరాభ్యః |
| పం. | జరసః | ,, | ,, |
| ష. | ,, | జరసోః | జరసామ్ |
| స. | జరసి | ,, | జరాసు |

## ఇకారాంతము – 'మతి' శబ్దము – బుద్ధి

| | ఏక | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | మతిః | మతీ | మతయః |
| సం. ప్ర. | మతే | ,, | ,, |
| ద్వి. | మతిమ్ | ,, | మతీః |
| తృ. | మత్యా | మతిభ్యామ్ | మతిభిః |
| చ. | మత్యై<br>మతయే | ,, | మతిభ్యః |
| పం. | మత్యాః<br>మతేః | ,, | ,, |
| ష. | ,, | మత్యోః | మతీనామ్ |
| స. | మత్యామ్<br>మతౌ | ,, | మతిషు |

ఇట్లు గతి – స్థితి – బుద్ధి – సిద్ధి మొ॥

## ఈ కారాంతము – 'నదీ' శబ్దము – నది

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | నదీ | నద్యౌ | నద్యః |
| సం. ప్ర. | నది | ,, | ,, |
| ద్వి. | నదీమ్ | ,, | నదీః |
| తృ. | నద్యా | నదీభ్యామ్ | నదీభిః |
| చ. | నద్యై | ,, | నదీభ్యః |
| పం. | నద్యాః | ,, | ,, |
| ష. | ,, | నద్యోః | నదీనామ్ |
| స. | నద్యామ్ | ,, | నదీషు |

ఇట్లు గౌరీ, వాణీ, సఖీ, సతీ, మొ॥

---

## విశేషము — 'లక్ష్మీ' శబ్దము — లక్ష్మి

---

దీనికి ప్రథమైక వచనము నందె రూపభేదము.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | లక్ష్మీః | లక్ష్మ్యౌ | లక్ష్మ్యః |

తక్కినది నదీ శబ్దము ననుసరించును.

---

## విశేషము — 'స్త్రీ' శబ్దము — ఆడుది

---

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | స్త్రీ | స్త్రియౌ | స్త్రియః |
| సం. ప్ర. | స్త్రి | ,, | ,, |
| ద్వి. | స్త్రియమ్ / స్త్రీమ్ | ,, | స్త్రియః / స్త్రీః |
| తృ. | స్త్రియా | స్త్రీభ్యామ్ | స్త్రీభిః |
| చ. | స్త్రియై | ,, | స్త్రీభ్యః |
| పం. | స్త్రియాః | ,, | ,, |
| ష. | ,, | స్త్రియోః | స్త్రీణామ్ |
| స. | స్త్రియామ్ | ,, | స్త్రీషు |

---

## విశేషము — 'శ్రీ' శబ్దము — లక్ష్మి

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | శ్రీః | శ్రియౌ | శ్రియః |
| సం. ప్ర. | ,, | ,, | ,, |
| ద్వి. | శ్రియమ్ | ,, | ,, |
| తృ. | శ్రియా | శ్రీభ్యామ్ | శ్రీభిః |
| చ. | శ్రియై / శ్రియే | ,, | శ్రీభ్యః |
| పం. | శ్రియాః / శ్రియః | ,, | ,, |
| ష. | ,, | శ్రియోః | శ్రియామ్ / శ్రీణామ్ |
| స. | శ్రియామ్ / శ్రియి | ,, | శ్రీషు |

ఇట్లు ధీ, భీ, హ్రీ మొ॥

## ఉకారాంతము — 'ధేను' శబ్దము — ఆవు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | ధేనుః | ధేనూ | ధేనవః |
| సం. ప్ర. | ధేనో | ,, | ,, |
| ద్వి. | ధేనుమ్ | ,, | ధేనూః |

| | | | |
|---|---|---|---|
| తృ. | ధేన్వా | ధేనుభ్యామ్ | ధేనుభిః |
| చ. | ధేన్వై<br>ధేనవే | ,, | ధేనుభ్యః |
| ప. | ధేన్వాః<br>ధేనోః | ,, | ,, |
| ష. | ,, | ధేన్వోః | ధేనూనామ్ |
| స. | ధేన్వామ్<br>ధేనౌ | ,, | ధేనుషు |

## ఊకారాంతము — 'వధూ' శబ్దము — వధువు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | వధూః | వధ్వౌ | వధ్వః |
| సం. ప్ర. | వధు | ,, | ,, |
| ద్వి. | వధూమ్ | ,, | వధూః |
| తృ. | వధ్వా | వధూభ్యామ్ | వధూభిః |
| చ. | వధ్వై | ,, | వధూభ్యః |
| పం. | వధ్వాః | ,, | ,, |
| ష. | ,, | వధ్వోః | వధూనామ్ |
| స. | వధ్వామ్ | ,, | వధూషు |

ఇట్లు తనూ, చమూ మొ॥

## విశేషము — 'భూ' శబ్దము — భూమి

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | భూః | భువౌ | భువః |
| సం. ప్ర. | ,, | ,, | ,, |

| | | | |
|---|---|---|---|
| ద్వి. | భువమ్ | భువౌ | భువః |
| తృ. | భువా | భూభ్యామ్ | భూభిః |
| చ. | భువే<br>భువై | ,, | భూభ్యః |
| పం. | భువః<br>భువాః | ,, | ,, |
| ష. | ,, | భువోః | భువామ్<br>భూనామ్ |
| స. | భువామ్<br>భువి | ,, | భూషు |

ఇట్లు భ్రూ మొ॥

---

## ఋకారాంతము — 'మాతృ' శబ్దము — తల్లి

---

ఇది పితృ శబ్దము వలెనే వర్తించును. ద్వితీయా బహు వచనమున మాత్రము మార్పుగలదు.

| | | | |
|---|---|---|---|
| ద్వి. | మాతరమ్ | మాతరౌ | మాతౄః |

---

ఇట్లు యాతృ, ననాందృ, దుహితృ మొ॥

## విశేషము — 'స్వసృ' శబ్దము — చెల్లెలు

---

దీనికి ద్వితీయా బహు వచనమందు తప్ప తక్కిన అన్ని విభక్తులందును రూపములు 'ధాతృ' శబ్దమును పోలియుండును.

| | | | |
|---|---|---|---|
| ద్వి. | స్వసారమ్ | స్వసారౌ | స్వసౄః |

---

ఓకారాంతము — 'గో' శబ్దము — ఆవు

ఇది పుంలింగము నందలి ఓకారాంత శబ్దమునే పోలియుండును.

ఉ॥ గౌః గావౌ గావః

ఇట్లు 'ద్యో' మొ॥ నవి

ఔకారాంతము — 'నౌ' శబ్దము — నావ

ఇది పుంలింగమైన ఔకారాంత శబ్దమును పోలియుండును

ఉ॥ నౌః నావౌ నావః ఇత్యాదులు

## అజంతములు — నపుంసకములు.

### అకారాంతము — 'ఫల' శబ్దము — ఫలము

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | ఫలమ్ | ఫలే | ఫలాని |
| సం. ప్ర. | ఫల | ,, | ,, |
| ద్వి. | ఫలమ్ | ,, | ,, |

తృతీయనుండి ఇది అకారాంత పుంలింగమునే అనుసరించును.

ఇట్లు జ్ఞాన ధన మిత్ర కళత్ర సౌజన్యాదులు

## ఇకారాంతము — 'వారి' శబ్దము — నీరు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | వారి | వారిణీ | వారీణి |
| సం. ప్ర. | వారే / వారి | ,, | ,, |
| ద్వి. | వారి | ,, | ,, |
| తృ. | వారిణా | వారిభ్యామ్ | వారిభిః |
| చ. | వారిణే | ,, | వారిభ్యః |
| పం. | వారిణః | ,, | ,, |
| ష. | ,, | వారిణోః | వారీణామ్ |
| స. | వారిణి | ,, | వారిషు |

## విశేషము — 'దధి' శబ్దము — పెరుగు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | దధి | దధినీ | దధీని |
| సం. ప్ర. | దధే / దధి | ,, | ,, |
| ద్వి. | దధి | దధినీ | దధీని |
| తృ. | దధ్నా | దధిభ్యామ్ | దధిభిః |
| చ. | దధ్నే | ,, | దధిభ్యః |
| పం. | దధ్నః | ,, | ,, |
| ష. | ,, | దధ్నోః | దధ్నామ్ |
| స. | దధ్ని / దధని | ,, | దధిషు |

ఇట్లు సక్థి అక్షి అస్థి మొ॥

ఉకారాంతము — 'మధు' శబ్దము — తేనె

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | మధు | మధునీ | మధూని |
| సం. ప్ర. | మధో<br>మధు | ,, | ,, |
| ద్వి. | మధు | ,, | ,, |
| తృ. | మధునా | మధుభ్యామ్ | మధుభిః |

తక్కిన రూపములు వారి శబ్దమునుబట్టి ఊహించునది.

ఇట్లు అంబు, జతు, శ్మశ్రు మొ॥

ఋకారాంతము – 'కర్తృ' – చేయునది

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | కర్తృ | కర్తృణీ | కర్తౄణి |
| సం. ప్ర. | కర్తృ<br>కర్తః | ,, | ,, |
| ద్వి. | కర్తృ | ,, | ,, |
| తృ. | కర్తృణా<br>కర్త్రా | కర్తృభ్యామ్ | కర్తృభిః |

ఇట్లు దీనికి పుంనపుంసకముల రూపములు రెండును ప్రాప్తించు చుండును.

## హలంతములు—పుంలింగములు

### చకారాంతము — 'జలముచ్' శబ్దము — మేఘము

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం. ప్ర. | జలముక్ | జలముచౌ | జలముచః |
| ద్వి. | జలముచమ్ | ,, | ,, |
| తృ. | జలముచా | జలముగ్భ్యామ్ | జలముగ్భిః |
| చ. | జలముచే | ,, | జలముగ్భ్యః |
| పం. | జలముచః | ,, | ,, |
| ష. | ,, | జలముచోః | జలముచామ్ |
| స. | జలముచి | ,, | జలముక్షు |

### విశేషము — 'ప్రాంచ్' శబ్దము — పూర్వుఁడు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం. ప్ర. | ప్రాఙ్ | ప్రాంచౌ | ప్రాంచః |
| ద్వి. | ప్రాంచమ్ | ,, | ప్రాచః |

తృతీయనుండి పై శబ్దము వలెనే.

ఇట్లు పరాంచ్, అర్వాంచ్, అవాంచ్ మొ।

---

### విశేషము — 'తిర్యంచ్' శబ్దము — తిర్యక్కు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం. ప్ర. | తిర్యఙ్ | తిర్యంచౌ | తిర్యంచః |
| ద్వి. | తిర్యంచమ్ | ,, | తిరశ్చః |
| తృ. | తిరశ్చా | తిర్యగ్భ్యామ్ | తిర్యగ్భిః |
| స. | తిరశ్చి | తిరశ్చోః | తిర్యక్షు |

తక్కిన విభక్త్యంత రూపముల నూహింప వచ్చును.

### జకారాంతము — 'భిషజ్' శబ్దము — వైద్యుఁడు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం. ప్ర. | భిషక్ | భిషజౌ | భిషజః |
| ద్వి. | భిషజమ్ | ,, | ,, |
| తృ. | భిషజా | భిషగ్భ్యామ్ | భిషగ్భిః |
| స. | భిషజి | భిషజోః | భిషక్షు |

తక్కినవాని నూహించునది.

### విశేషము — "రాజ్" శబ్దము — రాజు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం. ప్ర. | రాట్ / రాడ్ | రాజౌ | రాజః |
| ద్వి. | రాజమ్ | ,, | ,, |
| తృ. | రాజా | రాడ్భ్యామ్ | రాడ్భిః |
| స. | రాజి | రాజోః | రాట్సు |

ఇట్లు పరివ్రాజ్ మొ॥

### తకారాంతము — "మరుత్" శబ్దము — గాలి

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం. ప్ర. | మరుత్ | మరుతౌ | మరుతః |
| ద్వి. | మరుతమ్ | | |
| తృ. | మరుతా | మరుద్భ్యామ్ | మరుద్భిః |
| స. | మరుతి | మరుతోః | మరుత్సు |



### విశేషము — మహత్ శబ్దము — గొప్పవాఁడు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | మహాన్ | మహాంతౌ | మహాంతః |
| సం. ప్ర. | మహాన్ | ,, | ,, |
| ద్వి. | మహాంతమ్ | ,, | మహతః |

తక్కినది "మరుత్" శబ్దము వలెనే

---

### విశేషము — 'ధీమత్' శబ్దము — ధీమంతుఁడు

---

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | ధీమాన్ | ధీమంతౌ | ధీమంతః |
| సం. ప్ర. | ధీమన్ | ,, | ,, |
| ద్వి. | ధీమంతమ్ | ,, | ధీమతః |

ఇచ్చటినుండి ఇది మరుత్ శబ్దము ననుసరించును. ఇట్లే మతుబంత, వతుబంత, శబ్దము లన్ని వర్తించును.

---

### దకారాంతము — 'దివిషద్' — దేవత

---

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం.ప్ర. | దివిషత్ | దివిషదౌ | దివిషదః |
| ద్వి. | దివిషదమ్ | ,, | ,, |
| తృ. | దివిషదా | దివిషద్భ్యామ్ | దివిషద్భిః |
| స. | దివిషది | దివిషదోః | దివిషత్సు |

నకారాంతము — 'ఆత్మన్' శబ్దము — ఆత్మ

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | ఆత్మా | ఆత్మానౌ | ఆత్మానః |
| సం. ప్ర. | ఆత్మన్ | ,, | ,, |
| ద్వి. | ఆత్మానమ్ | ,, | ఆత్మనః |
| తృ. | ఆత్మనా | ఆత్మభ్యామ్ | ఆత్మభిః |
| స. | ఆత్మని | ఆత్మనోః | ఆత్మసు |

ఇట్లు, బ్రహ్మన్, యజ్వన్, పాప్మన్, మొ॥

విశేషము — 'గుణిన్' శబ్దము - గుణవంతుఁడు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | గుణీ | గుణినౌ | గుణినః |
| సం. ప్ర. | గుణిన్ | ,, | ,, |
| ద్వి. | గుణినమ్ | ,, | ,, |
| తృ. | గుణినా | గుణిభ్యామ్ | గుణిభిః |
| స. | గుణిని | గుణినోః | గుణిషు |

ఇట్లు ధనిన్ దోషిన్ మొ॥ ఇన్నంత శబ్దములకును, యశస్విన్, తేజస్విన్ మొ॥ విన్నంత శబ్దములకును విభక్త్యంత రూపములు ఏర్పడు చుండును.

### విశేషము — 'రాజన్' శబ్దము — రాజు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | రాజా | రాజానౌ | రాజానః |
| సం. ప్ర. | రాజన్ | ,, | ,, |
| ద్వి. | రాజానమ్ | ,, | రాజ్ఞః |
| తృ. | రాజ్ఞా | రాజభ్యామ్ | రాజభిః |
| స. | రాజ్ఞి<br>రాజని | రాజ్ఞోః | రాజసు |

ఇట్లు లఘిమన్, గరిమన్, మొ॥ ఇమనిజంతములకును, మూర్ధన్ మొ॥ వానికిని రూపములేర్పడును. మఱియును 'రాజన్' శబ్దము సమాసాంతములందు సాధారణముగా అకారాంతమగు చుండును. అప్పుడిది రామ శబ్దము ననుసరించును.

ఉ॥ ఖగరాజః — యువరాజః ఇత్యాదులు.

### విశేషము — 'పూషన్' శబ్దము — సూర్యుడు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | పూషా | పూషణౌ | పూషణః |
| సం. ప్ర. | పూషన్ | ,, | ,, |
| ద్వి. | పూషణమ్ | ,, | పూష్ణః |
| తృ. | పూష్ణా | పూషభ్యామ్ | పూషభిః |
| స. | పూష్ణి<br>పూషణి | పూష్ణోః | పూషసు |

### విశేషము — 'అర్వన్' శబ్దము — గుఱ్ఱము

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | అర్వా | అర్వంతౌ | అర్వంతః |
| సం. ప్ర. | అర్వన్ | ,, | ,, |
| ద్వి. | అర్వంతమ్ | ,, | అర్వతః |

ఇచ్చటినుండి 'మరుత్' శబ్దము ననుసరించును

### విశేషము — 'పథిన్' శబ్దము — దారి

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం. ప్రం. | పంథాః | పంథానౌ | పంథానః |
| ద్వి. | పంథానమ్ | పంథానౌ | పథః |
| తృ. | పథా | పథిభ్యామ్ | పథిభిః |
| స. | పథి | పథోః | పథిషు |

ఇదియును 'రాజన్' శబ్దమువలె తఱుచుగా సమాసాంతమందు అకారాంతముగ పరిణమించును.

ఉ। రాజపథః — ఘంటాపథః. ఇత్యాది.

### విశేషము — 'మఘవన్' శబ్దము — ఇంద్రుఁడు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | మఘవా | మఘవానౌ | మఘవానః |
| సం. ప్ర. | మఘవన్ | ,, | ,, |
| ద్వి. | మఘవానమ్ | ,, | మఘోనః |
| తృ. | మఘోనా | మఘవభ్యామ్ | మఘవభిః |
| స. | మఘోని | మఘోనోః | మఘవసు |

ఇట్లు "శ్వన్" 'యువన్' శబ్దములకు రూపము లేర్పడును. 'మఘోన' అను తావులందు 'శ్వన్' అనుదానికి 'శున' అనియు యువన్ శబ్దమునకు 'యూన' అనియు మార్పులు వచ్చును.

---

### శకారాంతము — 'స్పృశ్' శబ్దము — స్పృశించువాఁడు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం.ప్ర. | స్పృక్ | స్పృశౌ | స్పృశః |
| ద్వి. | స్పృశమ్ | ,, | ,, |
| తృ. | స్పృశా | స్పృగ్భ్యామ్ | స్పృగ్భిః |
| స. | స్పృశి | స్పృశోః | స్పృక్షు |

### విశేషము — 'విశ్' శబ్దము — మనుష్యుఁడు

పై శబ్దము వలెనే. కకార గకారములకు మాఱుగా టకార డకారములు వచ్చుటయే మార్పు. అది ఒకటి గుర్తుంచుకొనిన చాలును.

ఉ॥ విట్ విశౌ విశః ఇత్యాది.

---

### షకారాంతము — 'ముష్' శబ్దము — దొంగ

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం.ప్ర. | ముట్ | ముషౌ | ముషః |
| ద్వి. | ముషమ్ | ,, | ,, |
| తృ. | ముషా | ముడ్భ్యామ్ | ముడ్భిః |
| సం. | ముషి | ముషోః | ముట్సు |

## విశేషము — 'దోష్' శబ్దము — బాహువు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర,సం.ప్ర, | దోః | దోషౌ | దోషః |
| ద్వి | దోషమ్ | ,, | దోషః<br>దోష్ణః |
| తృ. | దోషా<br>దోష్ణా | దోర్భ్యామ్<br>దోషభ్యామ్ | దోర్భిః<br>దోషభిః |
| స. | దోషి<br>దోష్ణి<br>దోషణి | దోషోః<br>దోష్ణోః | దోష్షు<br>దోషసు |

## సకారాంతము — "వేధస్" శబ్దము — బ్రహ్మ

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | వేధాః | వేధసౌ | వేధసః |
| సం. ప్ర. | వేధః | ,, | ,, |
| ద్వి. | వేధసమ్ | ,, | ,, |
| తృ | వేధసా | వేధోభ్యామ్ | వేధోభిః |
| స, | వేధసి | వేధసోః | వేధస్సు |

## విశేషము — 'విద్వస్' శబ్దము — విద్వాంసుడు

| | ఏక | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | విద్వాన్ | విద్వాంసౌ | విద్వాంసః |
| సం. ప్ర. | విద్వన్ | ,, | ,, |
| ద్వి. | విద్వాంసమ్ | ,, | విదుషః |

| | | | |
|---|---|---|---|
| తృ | విదుషా | విద్వద్భ్యామ్ | విద్వద్భిః |
| స. | విదుషి | విదుషోః | విద్వత్సు |

జగ్మివస్, జగ్మివస్, మొ॥ వస్వంత శబ్దములెల్ల ఇట్లే వర్తించును.

విశేషము — 'పుంస్' శబ్దము — పురుషుడు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం.ప్ర. | పుమాన్ | పుమాంసౌ | పుమాంసః |
| ద్వి. | పుమాంసమ్ | ,, | పుంసః |
| తృ. | పుంసా | పుంభ్యామ్ | పుంభిః |
| స. | పుంసి | పుంసోః | పుంస్సు |

హకారాంతము — 'రుహ్' శబ్దము మొలచునది

| | ఏక. | ద్వి. | బహు |
|---|---|---|---|
| ప్ర.సం.ప్ర. | రుట్ | రుహౌ | రుహః |
| ద్వి. | రుహమ్ | ,, | ,, |
| తృ. | రుహా | రుడ్భ్యామ్ | రుడ్భిః |
| స. | రుహి | రుహోః | రుట్సు |

విశేషము — 'అనడుహ్' శబ్దము — ఎద్దు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | అనడ్వాన్ | అనడ్వాహౌ | అనడ్వాహః |
| సం. ప్ర. | అనడ్వన్ | ,, | ,, |
| ద్వి. | అనడ్వాహమ్ | ,, | అనడుహః |
| తృ. | అనడుహా | అనడుద్భ్యామ్ | అనడుద్భిః |
| స | అనడుహి | అనడుహోః | అనడుత్సు |

## హలంతములు — స్త్రీలింగములు

| | | | |
|---|---|---|---|
| చకారాంతము | — వాచ్ | — వాక్కు | — 'జలముచ్' శబ్దమువలె, |
| జకారాంతము | — స్రజ్ | — దండ | — 'భిషజ్' ,, ,, |
| తకారాంతము | — సరిత్ | — నది | — 'మరుత్' ,, ,, |
| దకారాంతము | — దృషద్ | — బండ | — 'దివిషద్' ,, ,, |
| శకారాంతము | — దిశ్ | — దిక్కు | — 'స్పృశ్' ,, ,, |
| షకారాంతము | — త్విష్ | — కాంతి | — 'ముష్' ,, ,, |
| హకారాంతము | — రుహ్ | — మొలచునది | — 'రుహ్' ,, ,, |

వర్తించును.

వీని నన్నిటిని విశేషశబ్దముల నెఱిగించెదను.

### ధకారాంతము — 'సమిధ్' శబ్దము — కట్టె.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర.,సం. ప్ర. | సమిత్ | సమిధౌ | సమిధః |
| ద్వి. | సమిధమ్ | ,, | ,, |
| తృ. | సమిధా | సమిద్భ్యామ్ | సమిద్భిః |
| స | సమిధి | సమిధోః | సమిత్సు |

### భకారాంతము — 'కకుభ్' శబ్దము — దిక్కు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర.,సం.ప్ర. | కకుప్ | కకుభౌ | కకుభః |
| ద్వి. | కకుభమ్ | ,, | ,, |
| తృ. | కకుభా | కకుభ్భ్యామ్ | కకుబ్భిః |
| స, | కకుభి | కకుభోః | కకుప్సు |

### రేఫాంతము – 'ద్వార్' – శబ్దము – వాకిలి.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం. ప్ర. | ద్వాః | ద్వారౌ | ద్వారః |
| ద్వి. | ద్వారమ్ | ,, | ,, |
| తృ. | ద్వారా | ద్వార్భ్యామ్ | ద్వార్భిః |
| స. | ద్వారి | ద్వారోః | ద్వార్షు |

### విశేషము – "గిర్" శబ్దము – వాక్కు.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం. ప్ర. | గీః | గిరౌ | గిరః |
| ద్వి. | గిరమ్ | ,, | ,, |
| తృ. | గిరా | గీర్భ్యామ్ | గీర్భిః |
| స. | గిరి | గిరోః | గీర్షు |

ఇట్లు పుర్, ధుర్ మొ॥

---

### వకారాంతము – "దివ్" శబ్దము – ఆకాశము.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం. ప్ర. | ద్యౌః | దివౌ | దివః |
| ద్వి. | దివమ్ | ,, | ,, |
| తృ. | దివా | ద్యుభ్యామ్ | ద్యుభిః |
| స. | దివి | దివోః | ద్యుషు |

---

### సకారాంతము – 'ఆశిస్' శబ్దము – దీవన.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర., సం. ప్ర. | ఆశీః | ఆశిషౌ | ఆశిషః |

| | | | |
|---|---|---|---|
| ద్వి. | ఆశిషమ్ | ఆశిషౌ | ఆశిషః |
| తృ. | ఆశిషా | ఆశీర్భ్యామ్ | ఆశీర్భిః |
| స. | ఆశిషి | ఆశిషోః | ఆశీష్షు |

---

### పకారాంతము — 'అప్' శబ్దము — నీరు

ఇది నిత్య బహువచనాంత శబ్దము కనుక దీనికి ఏకద్వివచనాంత రూపము లుండ నేరవు.

| | బహు |
|---|---|
| ప్ర., సం. ప్ర. | ఆపః |
| ద్వి. | అపః |
| తృ. | అద్భిః |
| చ. | అద్భ్యః |
| పం. | ,, |
| ష. | అపామ్ |
| స. | అప్సు |

### హలంతములు — నపుంసకములు

చకారాంతము — ముచ్ — విడుచునది
ప్ర. సం. ద్వి. — ముక్ — ముచీ — ముంచి
జకారాంతము — అసృజ్ — రక్తము
ప్ర. సం. ద్వి. — అసృక్ — అసృజీ — అసృంజి
తకారాంతము — జగత్ — జగత్తు
ప్ర. సం. ద్వి. — జగత్ — జగతీ — జగంతి
దకారాంతము — హృద్ — ఎద
ప్ర. సం ద్వి. — హృత్ — హృదీ — హృంది
నకారాంతము — వర్మన్ — కవచము
ప్ర. సం. ద్వి. — వర్మ — వర్మణీ — వర్మాణి
శకారాంతము — స్పృశ్ — తాకునది
ప్ర., సం. ద్వి. — స్పృక్ — స్పృశీ — స్పృంశి
షకారాంతము — ముష్ — దొంగిలించునది
ప్ర. సం. ద్వి. — ముట్ — ముషీ — ముంషి

సకారాంతము — మనస్ — మనస్సు
ప్ర. సం. ద్వి. — మనః — మనసీ — మనాంసి

తక్కిన విభక్తులందు వీనిరూపములు తత్తత్పుంలింగముల రూపములనె పోలియుండును.

ఇఁక వీనియందలి విశేష శబ్దములను నిర్దేశించెదను.

సకారాంతము — "ఆయుస్" శబ్దము — ఆయుస్సు

| | | | |
|---|---|---|---|
| ప్ర., సం. ద్వి. | ఆయుః | ఆయుషీ | ఆయూంషి |
| తృ. | ఆయుషా | ఆయుర్భ్యామ్ | ఆయుర్భిః |
| స. | ఆయుషి | ఆయుషోః | ఆయుష్షు |

రేఫాంతము — "వార్" శబ్దము — నీరు

| | | | |
|---|---|---|---|
| ప్ర., సం. ద్వి. | వాః | వారీ | వారి |
| తృ. | వారా | వార్భ్యామ్ | వార్భిః |
| స. | వారి | వారోః | వార్షు |

నకారాంతము — "నామన్" శబ్దము — పేరు

| | | | |
|---|---|---|---|
| ప్ర., సం. ద్వి. | నామ | నామనీ / నామ్నీ | నామాని |
| తృ. | నామ్నా | నామభ్యామ్ | నామభిః |
| స. | నామ్ని / నామని | నామ్నోః | నామసు |

నకారాంతము — 'అహన్' శబ్దము — పగలు

| | | | |
|---|---|---|---|
| ప్ర., సం. ద్వి. | అహః | అహనీ / అహ్నీ | అహాని |
| తృ. | అహ్నా | అహోభ్యామ్ | అహోభిః |
| స. | అహ్ని / అహని | అహ్నోః | అహస్సు |

ఇది నామ ప్రకరణము

## 2. సర్వనామములు.

### Pronouns.

సర్వనామముల నన్నిటిని రెండు జాతులుగా విభజింప వచ్చును.

1 వస్తువాచకములు (*Substantives*)

2 సంఖ్యావాచకములు (*Numerals*)

### 1. వస్తువాచకములు.

1 అస్మద్ - నేను

2 యుష్మద్ - నీవు

3 భవత్ - ,,
(గౌరవార్థకము)

4 తద్ - ఆ

5 ఏతద్ - ఈ

6 ఇదమ్ - ,,

7 అదస్ ,,

8 యద్ - ఏ
(సంబంధార్థకము)

9 కిమ్ - ఏ
(ప్రశ్నార్థకము)

10 తావత్ - అంత

11 ఏతావత్ - ఇంత

12 ఇయత్ - ,,

13 యావత్ - ఎంత
(సంబంధార్థకము)

14 కియత్ - ఎంత
(ప్రశ్నార్థము)

15 తాదృశ్ - అట్టి

16 ఏతాదృశ్ - ఇట్టి

17 ఈదృశ్ - ,,

18 యాదృశ్ - ఎట్టి
(సంబంధార్థము)

19 కీదృశ్ - ఎట్టి (ప్రశ్నార్థము)
20 సర్వ - ప్రతి ఒక
21 విశ్వ - ,,
22 అన్య - వేఱొక
23 ఇతర - ,,
24 ఏక - ,,
25 పూర్వ - వెనుకటి
26 పర - తరువాతి
27 అపర - ,,
28 ఉత్తర - ,,
29 స్వ - తాను
30 ఆత్మన్ - ,,

పయిని పేర్కొన్న ప్రాతిపదికములకెల్ల విభక్త్యంతరూపములను వరుసగా నుదాహరించెదను. సర్వనామములందు సంబోధన ప్రథమా విభక్తి సాధారణముగా నుండదు. కావున తక్కిన యేడు విభక్తులందు మాత్రమే రూపములు చూపఁబడును. వీనియందు అస్మద్, యుష్మద్, ఆత్మన్ అను మూఁడు శబ్దములు మాత్రము అన్ని లింగములందును సమానరూపములై యుండును. తక్కినవి రూపభేదము కలిగియుండును.

---

## అస్మద్ — నేను.

---

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | అహమ్ | ఆవామ్ | వయమ్ |
| ద్వి. | మామ్. మా | ,, . నౌ | అస్మాన్. నః |
| తృ. | మయా | ఆవాభ్యామ్ | అస్మాభిః |
| చ. | మహ్యమ్. మే. | ,, . నౌ | అస్మభ్యమ్. నః |
| పం. | మత్ (మత్తః) | ,, | అస్మత్ (అస్మత్తః) |

| | | | |
|---|---|---|---|
| ష. | మమ. మే. | ఆవయోః. నౌ | అస్మాకమ్. నః |
| స. | మయి | ,, | అస్మాసు |

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | నేను | మేమిద్దఱము } మనమిద్దఱము } | మేము } మనము } |
| ద్వి. | నన్ను | మమ్మిద్దఱను } మనలనిద్దఱను } | మమ్ము } మనలను } |

అని ఇట్లు అన్ని విభక్తులందును దీనికి తెలుఁగున విభక్త్యంత రూపములను గ్రహింపవలెను. రాఁబోవు సర్వనామములకును అట్లే కానివాని ప్రాతిపదికార్థములనుబట్టి ఊహించుకొనవలెను.

## యుష్మద్ — నీవు.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | త్వమ్ | యువామ్ | యూయమ్ |
| ద్వి. | త్వామ్. త్వా | ,, .వామ్ | యుష్మాన్. వః |
| తృ. | త్వయా | యువాభ్యామ్ | యుష్మాభిః |
| చ. | తుభ్యమ్. తే | ,, .వామ్ | యుష్మభ్యమ్. వః |
| పం. | త్వత్ (త్వత్తః) | ,, | యుష్మత్ (యుష్మత్తః) |
| ష. | తవ. తే | యువయోః.వామ్ | యుష్మాకమ్. వః |
| స. | త్వయి | ,, | యుష్మాసు |

## భవత్ — నీవు.
(గౌరవార్థము.)

దీనికి:— పుంలింగమున — 'ధీమత్' శబ్దమువలె (భవాన్)
స్త్రీలింగమున — 'నదీ' శబ్దమువలె (భవతీ)
రూపము లేర్పడును.

## తద్ — పుం — వాఁడు. — స్త్రీ - ఆమె - అది.

| | ఏక. | ద్వి. | బహు. | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|---|---|---|
| ప్ర. | సః | తౌ | తే | సా | తే | తాః |
| ద్వి. | తమ్ | ,, | తాన్ | తామ్ | ,, | ,, |
| తృ. | తేన | తాభ్యామ్ | తైః | తయా | తాభ్యామ్ | తాభిః |
| చ. | తస్మై | ,, | తేభ్యః | తస్యై | ,, | తాభ్యః |
| పం. | తస్మాత్ | ,, | ,, | తస్యాః | ,, | ,, |
| ష. | తస్య | తయోః | తేషామ్ | ,, | తయోః | తాసామ్ |
| స. | తస్మిన్ | ,, | తేషు | తస్యామ్ | ,, | తాసు |

## తద్ - నపుం - అది.

| | | | |
|---|---|---|---|
| ప్ర., ద్వి. | తత్ | తే | తాని |

తక్కినది పుంలింగము వలె.

## ఏతద్ — పుం - ఏీఁడు.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | ఏషః | ఏతౌ | ఏతే |

| | | | |
|---|---|---|---|
| ద్వి. | ఏతమ్<br>ఏనమ్ | ఏతౌ<br>ఏనౌ | ఏతాన్<br>ఏనాన్ |
| తృ. | ఏతేన<br>ఏనేన | ఏతాభ్యామ్ | ఏతైః |
| చ. | ఏతస్మై | ,, | ఏతేభ్యః |
| పం. | ఏతస్మాత్ | ,, | ,, |
| ష. | ఏతస్య | ఏతయోః<br>ఏనయోః | ఏతేషామ్ |
| స. | ఏతస్మిన్ | ,, | ఏతేషు |

ఏతద్ - స్త్రీ - ఈమె. ఇది.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | ఏషా | ఏతే | ఏతాః |
| ద్వి. | ఏతామ్<br>ఏనామ్ | ఏతే<br>ఏనే | ఏతాః<br>ఏనాః |
| తృ. | ఏతయా<br>ఏనయా | ఏతాభ్యామ్ | ఏతాభిః |
| చ. | ఏతస్యై | ,, | ఏతాభ్యః |
| పం. | ఏతస్యాః | ,, | ,, |
| ష. | ,, | ఏతయోః<br>ఏనయోః | ఏతాసామ్ |
| స. | ఏతస్యామ్ | ,, | ఏతాసు |

నపుం — ఇది.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | ఏతత్ | ఏతే | ఏతాని |

| | | | |
|---|---|---|---|
| ద్వి. | ఏతత్ / ఏనత్ | ఏతే / ఏనే | ఏతాని / ఏనాని |

తక్కినది పుంలింగమువలెనే.

---

## ఇదం - పుం- వీడు.

---

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | అయమ్ | ఇమౌ | ఇమే |
| ద్వి. | ఇమమ్ / ఏనమ్ | ఇమౌ / ఏనౌ | ఇమాన్ / ఏనాన్ |
| తృ. | అనేన / ఏనేన | ఆభ్యామ్ | ఏభిః |
| చ. | అస్మై | ,, | ఏభ్యః |
| పం. | అస్మాత్ | ,, | ,, |
| ష. | అస్య | అనయోః / ఏనయోః | ఏషామ్ |
| స. | అస్మిన్ | ,, | ఏషు |

---

## ఇదమ్ - స్త్రీ - ఈమె - ఇది.

---

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | ఇయమ్ | ఇమే | ఇమాః |
| ద్వి. | ఇమామ్ / ఏనామ్ | ఇమే / ఏనే | ఇమాః / ఏనాః |
| తృ. | అనయా / ఏనయా | ఆభ్యామ్ | ఆభిః |

| | | | |
|---|---|---|---|
| చ. | అస్యై | ఆభ్యామ్ | ఆభ్యః |
| పం. | అస్యాః | ,, | ,, |
| ష. | ,, | అనయోః<br>ఏనయోః | ఆసామ్ |
| స. | అస్యామ్ | ,, | ఆసు |

---

నపుం — ఇది.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | ఇదమ్ | ఇమే | ఇమాని |
| ద్వి. | ఇదమ్<br>ఏనత్ | ఇమే<br>ఏనే | ఇమాని<br>ఏనాని |

తక్కినది పుంలింగమువలె.

---

అదస్ — పుం — వీఁడు.

| | ఏక. | ద్వి. | బహు |
|---|---|---|---|
| ప్ర. | అసౌ | అమూ | అమీ |
| ద్వి. | అముమ్ | ,, | అమూన్ |
| తృ. | అమునా | అమూభ్యామ్ | అమీభిః |
| చ. | అముష్మై | ,, | అమీభ్యః |
| పం. | అముష్మాత్ | ,, | ,, |
| ష. | అముష్య | అముయోః | అమీషామ్ |
| స. | అముష్మిన్ | ,, | అమీషు |

స్త్రీ - ఈమె - ఇది.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | అసౌ | అమూ | అమూః |
| ద్వి. | అమూమ్ | ,, | ,, |
| తృ. | అముయా | అమూభ్యామ్ | అమూభిః |
| చ. | అముష్యై | ,, | అమూభ్యః |
| పం. | అముష్యాః | అమూభ్యామ్ | అమూభ్యః |
| ష. | ,, | అముయోః | అమూషామ్ |
| స. | అముష్యామ్ | ,, | అమూషు |

నపుం - ఇది.

| | | | |
|---|---|---|---|
| ప్ర., ద్వి. | అదః | అమూ | అమూని |

తక్కినది పుంలింగము వలె.

యద్ — ఏ } సంబంధ
కిమ్ — ఏ } ప్రశ్నార్థకములు

ఇవి రెండును పుం స్త్రీ నపుంసకములు మూఁడింటి యందును 'తద్' శబ్దముయొక్క పుం స్త్రీ నపుంసకములను క్రమముగా ననుసరించును.

ఉదా:—

పుం — ఎవఁడు — స్త్రీ — ఎవతె — నపుం — ఏది

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | యః | యౌ | యే | యా | యే | యాః | యత్ | యే | యాని |
| | కః | కౌ | కే | కా | కే | కాః | కిమ్ | కే | కాని |

తావత్ - ఏతావత్ - ఇయత్ - యావత్ - కియత్.
(అంత - ఇంత - ఎంత.)

ఇవి ఐదును — పుంలింగమున — 'ధీమత్' వలెను — (తావాన్)
స్త్రీలింగమున — 'నదీ' ,, — (తావతీ)
నపుంసకమున — 'జగత్' ,, — (తావత్)
వర్తించును.

తాదృశ్ - ఏతాదృశ్ - ఈదృశ్ - యాదృశ్ - కీదృశ్ -
(అట్టి - ఇట్టి - ఎట్టి.)

ఇవి ఐదును:— పుంలింగ, స్త్రీ లింగములందు — 'దిశ్' వలెను (తాదృక్)
నపుంసకమందు — 'స్పృశ్' ,, (తాదృక్)
వర్తించును.

ఇవిగాక ఈ ఐదు శబ్దములకు మఱి రెండు రూపాంతరములును గలవు. 1. తాదృశ 2. తాదృక్ష.

ఇట్లే తక్కిన నాల్గింటికిని ఊహింపవలెను.

వీనికి పుంలింగమున 1. తాదృశః 2. తాదృక్షః } అని 'రామ' శబ్దమువలె

స్త్రీలింగమున 1. తాదృశా 2. తాదృక్ 3. తాదృక్షా 4. తాదృక్షీ } అని 'రమా' 'నదీ' } శబ్దములవలె

నపుంసకమున 1. తాదృశమ్ 2. తాదృక్షమ్ అని, ఫల, శబ్దమువలె

రూపములు ఏర్పడును.

‘సర్వ’ – ప్రతి ఒక.

ఇది అన్ని లింగములందును ‘తద్’ శబ్దము ననుసరించును.

పుం – ప్రతివాడు     స్త్రీ – ప్రతిఒకటి     నపుం – ప్రతిఒకటి

ప్ర. సర్వః సర్వౌ సర్వే   సర్వా సర్వే సర్వాః   సర్వమ్ సర్వే సర్వాణి

ఇట్లు విశ్వ, అన్య, ఇతర, ఏక, అను నాల్గును వర్తించును.

పూర్వ – వెనుకటి.

పుంలింగము – వెనుకటివాఁడు.

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్ర. | పూర్వః | పూర్వౌ | పూర్వే / పూర్వాః |
| ద్వి. | పూర్వమ్ | ” | పూర్వాన్ |
| తృ. | పూర్వేణ | పూర్వాభ్యామ్ | పూర్వైః |
| చ. | పూర్వస్మై | ” | పూర్వేభ్యః |
| పం. | పూర్వస్మాత్ / పూర్వాత్ | ” | ” |
| ష. | పూర్వస్య | పూర్వయోః | పూర్వేషామ్ |
| స. | పూర్వస్మిన్ / పూర్వే | ” | పూర్వేషు |

1. ఇది సంఖ్యానార్థకమైన యెడల నిత్యైకవచనాంతముగా యుండును.

దీని స్త్రీనపుంసక రూపములుమాత్రము సర్వ శబ్ద, స్త్రీ నపుంసక రూపములను పోలియుండును.

ఇట్లు పర—అపర—ఉత్తర—స్వ—అను నాల్గు శబ్దములకును త్రిలింగము లందును రూపముల నూహించునది.

## ఆత్మన్ .— తాను

'అస్మద్' 'యుష్మద్' శబ్దములకువలె దీనికిని అన్నిలింగ ములందును రూప భేదములేదు. ఇట్టి శబ్ద మొకటి నామ ప్రకర ణము నందుఁగలదు. దాని విభక్త్యంత రూపములే దీనికిని అను సంధించు కొనవలెను.

ఉ। ఆత్మా ఆత్మానౌ ఆత్మానః ఇత్యాది.

ఇట్లు నామ సర్వనామములైన రెండు ఆత్మ శబ్దములకును అర్థభేదము తప్ప రూపభేదము లేదు.

---

# 2. సంఖ్యా వాచకములు.

ఇవి మూఁడు భాగములు:—

1. సంఖ్యానార్థకములు, 2. పూరణార్థకములు, 3. సముదాయార్థకములు.

Cardinals Ordinals Collectives

## 1. సంఖ్యానార్థకములు.

| | | | |
|---|---|---|---|
| ఏక | ఒకటి | నవదశన్ / ఏకోనవింశతి | పందొమ్మిది |
| ద్వి., ఉభ | రెండు | | |
| త్రి. | మూఁడు | వింశతి | ఇరువది |
| చతుర్ | నాలుగు | త్రింశత్ | ముప్పది |
| పంచన్ | ఐదు | చత్వారింశత్ | నలువది |
| షష్ | ఆఱు | పంచాశత్ | ఏఁబది |
| సప్తన్ | ఏడు | షష్టి | అఱువది |
| అష్టన్ | ఎనిమిది | సప్తతి | డెబ్బది |
| నవన్ | తొమ్మిది | అశీతి | ఎనుబది |
| దశన్ | పది | నవతి | తొంబది |
| ఏకాదశన్ | పదునొకటి | శత | నూఱు |
| ద్వాదశన్ | పండ్రెండు | సహస్ర | వేయి |
| త్రయోదశన్ | పదుమూఁడు | అయుత | పదివేలు |
| చతుర్దశన్ | పదునాలుగు | లక్ష, నియుత | లక్ష |
| పంచదశన్ | పదునైదు | ప్రయుత | పదిలక్షలు |
| షోడశన్ | పదునాఱు | కోటి | కోటి |
| సప్తదశన్ | పదునేడు | కతి | ఎన్ని |
| అష్టాదశన్ | పదునెనిమిది | కతిపయ | కొన్ని |

---

ఇంకను, ఏకవింశతి, ద్వావింశతి మొదలగువానిని, ఏకోత్తరశత ఏకాధికశత, మున్నగు వానిని, సార్ధశత, సపాదశత లోనగు వానిని సైతము ప్రయోగములనుబట్టి పాఠకులూహింప వలెను.

---

## 2 పూరణార్థకములు.

| | | | |
|---|---|---|---|
| ప్రథమ | మొదటి | వింశ, వింశతితమ | ఇరువదవ |
| ద్వితీయ | రెండవ | త్రింశ, త్రింశత్తమ | ముప్పదవ |
| తృతీయ | మూఁడవ | చత్వారింశ, చత్వారింశత్తమ | నలువదవ |
| చతుర్థ - తురీయ, తుర్య | నాల్గవ | పంచాశ, పంచాశత్తమ | ఏఁబదవ |
| పంచమ | ఐదవ | | |
| షష్ఠ | ఆఱవ | షష్ట - షష్టితమ | అఱువదవ |
| సప్తమ | ఏడవ | సప్తత - సప్తతితమ | డెబ్బదవ |
| అష్టమ | ఎనిమిదవ | అశీత - అశీతితమ | ఎనుబదవ |
| నవమ | తొమ్మిదవ | నవత - నవతితమ | తొంబదవ |
| దశమ | పదియవ | శతతమ | నూఱవ |
| ఏకాదశ | పదునొకటవ | సహస్రతమ | వేయవ |
| ద్వాదశ | పంద్రెండవ | | |
| త్రయోదశ | పదుమూఁడవ | అయుతతమ | పదివేల |
| చతుర్దశ | పదునాల్గవ | లక్షతమ, నియుతతమ | లక్షవంతు |
| పంచదశ | పదునైదవ | | |
| షోడశ | పదునాఱవ | ప్రయుతతమ | పదిలక్షల |
| సప్తదశ | పదునేడవ | కోటితమ | కోటివంతు |
| అష్టాదశ | పదునెనిమిదవ | కతితమ, కతిథ | ఎన్నవ |
| నవదశ, ఏకోనవింశ, ఏకోనవింశతితమ | పందొమ్మిదవ | కతిపయథ | కొన్నిటి |

## 3 సముదాయార్థకములు.

ద్వయ, ద్వితయ - ఉభయ

త్రయ, త్రితయ

చతుష్టయ, చతుష్క

పంచతయ, పంచక

| | | |
|---|---|---|
| షట్క | సప్తదశ(క) | పంచాశత్, పంచాశీ |
| సప్తక | సప్తదశీ | పంచాశికా |
| అష్టక | అష్టాదశ(క) | షష్టి |
| నవక | అష్టాదశీ | సప్తతి |
| దశక | నవదశ(క) | అశీతి |
| ఏకాదశ(క) | నవదశీ | నవతి |
| ఏకాదశీ | ఏకోనవింశతి | శత, శతక - శతీ |
| ద్వాదశ(క) | ఏకోనవింశీ | సహస్ర, సహస్రీ |
| ద్వాదశీ | ఏకోనవింశికా | సహస్రక |
| త్రయోదశ(క) | వింశతి - వింశీ | అయుత |
| త్రయోదశీ | వింశికా | అడ - నియుత |
| చర్దతుశ(క) | త్రింశత్, త్రింశీ | ప్రయుత |
| చతుర్దశీ | -త్రింశికా | కోటి |
| పంచదశ(క) | చత్వారింశత్, | కతి |
| పంచదశీ | చత్వారింశీ | కతిపయ |
| షోడశ(క) షోడశీ | చత్వారింశికా | |

పై నుదాహరించిన వన్నియును మూడు జాతుల శబ్దములకును గల మూలరూపములు లేదా ప్రాతిపదికములు. ఇక వీని విభక్త్యంత రూపముల నుదాహరించెదను.

---

## 1 సంఖ్యానార్థకములు.

---

వీనియందు:— 'ఏక' శబ్దమునుండి 'చతుర్' శబ్దము వఱకు మూడు లింగములందును రూపములు భేదించును.

'పంచన్' శబ్దమునుండి 'కతి' శబ్దముదనుక అన్ని లింగములందు రూపములు సమానములు. కతిపయ శబ్దము మరల రూపభేదము కలిగియుండును.

మఱియును:—

| | | |
|---|---|---|
| మఱియును:— | 'ఏక' శబ్దము | నిత్యైకవచనాంతము. |
| | 'ద్వి', 'ఉభ' | నిత్యద్వివచనాంతములు. |
| | 'త్రి' నుండి నవదశ | నిత్య బహువచనాంతములు |
| | 'వింశతి' నుండి 'కోటి' | నిత్యైకవచనాంతములు. |
| | 'కతి' | నిత్య బహువచనాంతము |

ఇంతియకాక:— వింశతి, త్రింశత్, చత్వారింశత్, పంచాశత్, షష్టి, సప్తతి, అశీతి, నవతి, కోటి } నిత్య స్త్రీలింగములు.

శత, సహస్ర, నియుత, అయుత, ప్రయుత } నిత్య నపుంసకములు.

---

'ఏక' — ఒక

ఇది అన్నిలింగములందును 'సర్వ' శబ్దమును పోలియుండును.

---

## 'ద్వి' — రెండు.

పుం — ఇద్దఱు స్త్రీ, నపుం — ఇద్దఱు, రెండు

| | ద్వి. | ద్వి. |
|---|---|---|
| ప్ర. | ద్వౌ | ద్వే |
| ద్వి. | ,, | ,, |
| తృ. | ద్వాభ్యామ్ | ద్వాభ్యామ్ |
| చ. | ,, | ,, |
| పం. | ,, | ,, |
| ష. | ద్వయోః | ద్వయోః |
| స. | ,, | ,, |

'ఉభ' శబ్దమునకును రూపము లిట్లేయుండును.

ఉభౌ — ఉభే ఇత్యాదులు.

## 'త్రి' — మూఁడు.

పుం - ముగ్గురు. స్త్రీ - ముగ్గురు. నపుం - మూఁడు.

| | బహు. | బహు. | బహు |
|---|---|---|---|
| ప్ర. | త్రయః | తిస్రః | త్రీణి |
| ద్వి. | త్రీన్ | ,, | ,, |
| తృ. | త్రిభిః | తిసృభిః | తక్కిన రూపములు పులింగమునకు వలెనే. |
| చ. | త్రిభ్యః | తిసృభ్యః | |
| పం. | ,, | ,, | |
| ష. | త్రయాణామ్ | తిసృణామ్ | |
| స. | త్రిషు | తిసృషు | |

## 'చతుర్' — నాలుగు.

| | పుం — నలుగురు. బహు | స్త్రీ నలుగురు. బహు | నపుం — నాలుగు. బహు. |
|---|---|---|---|
| ప్ర. | చత్వారః | చతస్రః | చత్వారి |
| ద్వి | చతురః | ,, | ,, |
| తృ. | చతుర్భిః | చతసృభిః | తక్కినరూపములు |
| చ. | చతుర్భ్యః | చతసృభ్యః | పుంలింగ తుల్యములు. |
| పం. | ,, | ,, | |
| ష. | చతుర్ణామ్ | చతసృణామ్ | |
| స. | చతుర్షు | చతసృషు | |

## స్త్రీ. పుం. నపుంసకములు.

| | పంచన్. | షష్. | సప్తన్. |
|---|---|---|---|
| ప్ర. | పంచ | షట్ | సప్త |
| ద్వి. | ,, | ,, | ,, |
| తృ. | పంచభిః | షడ్భిః | సప్తభిః |
| చ. | పంచభ్యః | షడ్భ్యః | సప్తభ్యః |
| పం. | ,, | ,, | ,, |
| ష. | పంచానామ్ | షణ్ణామ్ | సప్తానామ్ |
| స. | పంచసు | షట్సు | సప్తసు |

| | అష్టన్. | నవన్. | దశన్. |
|---|---|---|---|
| ప్ర. | అష్ట - అష్టౌ | నవ | దశ |
| ద్వి. | ,, ,, | ,, | ,, |
| తృ. | అష్టభిః - అష్టాభిః | నవభిః | దశభిః |
| చ. | అష్టభ్యః - అష్టాభ్యః | నవభ్యః | దశభ్యః |
| పం. | ,, ,, | ,, | ,, |
| ష. | అష్టానామ్ | నవానామ్ | దశానామ్ |
| స. | అష్టసు - అష్టాసు | నవసు | దశసు |

---

'ఏకాదశన్' నుండి 'నవదశన్' వఱకును గల శబ్దముల కన్నిటికిని 'దశన్' శబ్ద రూపములె ప్రాప్తించును.

వింశతి, షష్టి, సప్తతి, అశీతి, నవతి, కోటి - అనునవి ఆఱును 'మతి' శబ్దము రూపముల ననుసరించును.

'త్రింశత్', చత్వారింశత్, "పంచాశత్" - ఇవి మూఁడును "మరుత్" శబ్దమును పోలియుండును.

శత, సహస్ర, అయుత, లక్ష, నియుత, ప్రయుత - ఇవి ఆఱును "ఫల" శబ్దమును అనుకరించును.

'కతి' శబ్దము ప్రథమా ద్వితీయలందు తప్ప తక్కినది 'మతి' శబ్దమునే అనుసరించును.

---

ప్ర, ద్వి - కతి.

♦ కతిపయ శబ్దము మూఁడు లింగములందును రామ, రమా, ఫలశబ్దములను పోలియుండును.

---

## 2. పూరణార్థకములు.

---

♦ ఇవి అన్నియును అకారాంతములే కావున

పుంలింగమున:— 'రామ' శబ్దమువలెను

నపుంసకమున:— 'ఫల' శబ్దమువలెను

స్త్రీలింగమున:— 'రమా' శబ్దమువలెను వర్తించును.

ఉ॥ ప్రథమః — ప్రథమమ్ — ప్రథమా

కాని "వింశ, వింశతి తమ" మొదలుకొని స్త్రీలింగములు నదీ శబ్దమునుకూడ పోలియుండును.

వింశీ — వింశతి తమీ
వింశా — వింశతి తమా } ఇత్యాదులు.

---

1. కతిపయ శబ్దమునకును, ప్రథమ, ద్వితీయ, తృతీయ శబ్దములకును కొన్ని విశేషరూపములుగూడ [illegible] ముల వలన గ్రహింపవలెను.

## 3. సముదాయార్థకములు.

* ఇందు:— అకారాంతములన్నియును — 'ఫల' శబ్దమును
ఆకారాంతము ,, — 'రమా' ,,
ఈకారాంతము ,, — 'నదీ' ,,
అనుసరించును.

కాని సంఖ్యావాచక శబ్దములు కొన్ని అట్లే సముదాయార్థకములందు చేరియున్నవి. వానికి మాత్రము పూర్వ ముదాహరించిన రూపములే ప్రాప్తించును. వింశత్యాదులకు నిత్యైకవచనాంతత్వ నియమము మాత్రమిచట ప్రాప్తింపదు. అన్ని వచనములందును రూపములు నిష్పన్నము లగుచుండును.

ఉ। వింశతిః — వింశతీ — వింశతయః — (మనుష్యాణామ్).

ఇది
సర్వనామ ప్రకరణము.

---

* "ద్వయ" మొదలు 'పంచతయ' వఱకును గల శబ్దములకు కొన్ని విశేషరూపములును గలవు. వానినన్నిటిని ప్రయోగములవలననే గ్రహింపవలసియున్నవి.

# 3. విశేషణములు.

## Adjectives.

సంస్కృతమున నామ సర్వనామములకు వలె వాని విశేషణములకును లింగ విభక్తివచనములు కలవు. కావున వాని రెండింటిని పరిగణించిన అనంతరము వాని విశేషణములను కూడ నిర్దేశింప వలసి యున్నది. విశేషణ శబ్దములన్నియు మూఁడు విభాగములు గావింపవచ్చును.

1. సామాన్యములు. 2. సార్వనామికములు 3. ధాతుజములు.
Qualitative. etc Pronominal Participial.

### 1 సామాన్యములు. Qualitative etc.

నామములకుగల రూప వర్ణ చేష్టాదులైన లక్షణములను అన్నింటిని బోధించు విశేషణములు సామాన్యములు.

ఉ గురు - లఘు - స్థూల - సూక్ష్మ - మధుర - కటుక - ఉత్తమ.
అధమ - రక్త - శ్వేత - ఉష్ణ - శీత - పాలక - లోలక - ఇత్యాదులు

### 2 సార్వనామికములు, (*Pronominal*)

వస్తువాచకములును, సంఖ్యావాచకములును అను రెండువిధములైన సర్వనామ శబ్దములను విశేషణములుగా

సైతము పరిగణింపఁబడుచున్నవి. ఆ యా సందర్భములను బట్టి వీనికి సర్వనామార్థమును గాని విశేషణార్థమును గాని చెప్పవలసియున్నది.

ఉ॥ సః రామః — అతఁడు రాముఁడు (సర్వనామము.)
సః రామః — ఆ రాముఁడు (సార్వ. విశే.)

ఇందులకు కొన్ని అపవాదములు గలవు. 'అస్మద్' — 'యుష్మద్', 'భవత్'—'ఆత్మన్' అను వస్తువాచకములు నాల్గును, సంఖ్యావాచకములందు సముదాయార్థక శబ్దములును, ఎల్లప్పుడు సర్వనామములుగనే తప్ప సార్వనామిక విశేషణములుగా ప్రయుక్తములు కానేరవు.

## 3 ధాతుజములు (*Participial*)

క్రియలకు మూలరూపములు ధాతువులు. అట్టి ధాతువులనుండి జనించు విశేషణములు ధాతుజ విశేషణములు. ఇవి • పరస్మైపదాత్మనేపదములను రెండువిధములగు ధాతువుల నుండియు ఏర్పడుచుండును. రెంటియందును వర్తమాన-భూత-భవిష్య - విధ్యర్థకములని విశేషణములు నాల్గుతెఱఁగుల వర్తించును. ఆనాల్గింటి యందును, ఒక్కొక్కదానికి కర్తృ కర్మ (భావ), ప్రేరణ కర్తృ, ప్రేరణ కర్మార్థములని మరల నాలుగర్థములందు వీనికి రూపములు సిద్ధించును. అందు విధ్యర్థమునకు మాత్రము కర్మ - ప్రే. కర్మార్థములు రెండింట మాత్రమే ప్రాప్తించును. వీనికన్నిటికిని వరుసగా నుదాహరణము లొసంగెదను - పరిశీలించునది.

• వీని వివరణము క్రియాప్రకరణమునందు గావింపఁబడినది.

(పరస్మై - పఠ్ - చదువుట)

## 1 వర్తమానము.

| | | |
|---|---|---|
| 1. కర్త్రర్థము | పఠత్ | చదువుచున్న |
| 2. కర్మార్థము | పఠ్యమాన | చదువఁబడుచున్న |
| 3. ప్రే. కర్త్రర్థము | పాఠయత్ | చదివించుచున్న |
| 4 ప్రే. కర్మార్థము | పాఠ్యమాన | చదివింపఁబడుచున్న |

## 2 భూతము *

| | | |
|---|---|---|
| 1. కర్త్రర్థము | పఠితవత్ | చదివిన |
| 2. కర్మార్థము | పఠిత | చదువఁబడిన |
| 3. ప్రే. కర్త్రర్థము | పాఠితవత్ | చదివించిన |
| 4. ప్రే. కర్మార్థము | పాఠిత | చదివింపఁబడిన |

## 3 భవిష్యత్తు

| | | |
|---|---|---|
| 1. కర్త్రర్థము | పఠిష్యత్ | చదువఁగల |
| 2. కర్మార్థము | పఠిష్యమాణ | చదువఁబడఁగల |
| 3. ప్రే. కర్త్రర్థము | పాఠయిష్యత్ | చదివింపఁగల |
| 4. ప్రే. కర్మార్థము | పాఠయిష్యమాణ | చదివింపఁబడఁగల |

## 4 విధి

| | | |
|---|---|---|
| 1. కర్మార్థము | పఠితవ్య<br>పఠనీయ<br>పాఠ్య - పఠ్య | } చదువఁబడవలసిన<br>చదువఁబడదగిన |

* ఇచ్చట తకారము కొన్నిచోట్ల న్న, ణ్ణ, ధ, ష్ట, క్త, గ్ధ మొ వర్ణముల రూపమున పరిణమించును. ఉ భిన్న - దీర్ణ - రుద్ధ - దృష్ట - త్యక్త - దగ్ధ - మొ

| | | |
|---|---|---|
| 2. ప్రే. కర్మార్థము | పారయితవ్య<br>పారనీయ | చదివింపఁబడ<br>వలసిన - తగిన |

(ఆత్మనే - 'క్షమ్' - క్షమించుట.)

## 1 వర్తమానము

| | | |
|---|---|---|
| 1. కర్త్రర్థము | క్షమమాణ | క్షమించుచున్న |
| 2. కర్మార్థము | క్షమ్యమాణ | క్షమింపఁబడుచున్న |
| 3. ప్రే. కర్త్రర్థము | క్షామయత్ | క్షమింపఁజేయుచున్న |
| 4. ప్రే. కర్మార్థము | క్షామ్యమాణ | క్షమింపఁజేయఁబడుచున్న |

## 2 భూతము

| | | |
|---|---|---|
| 1. కర్త్రర్థము | క్షాంతవత్ | క్షమించిన |
| 2. కర్మార్థము | క్షాంత | క్షమింపఁబడిన |
| 3. ప్రే. కర్త్రర్థము | క్షామితవత్ | క్షమింపఁజేసిన |
| 4. ప్రే. కర్మార్థము | క్షామిత | క్షమింపఁజేయఁబడిన |

## 3 భవిష్యత్తు

| | | |
|---|---|---|
| 1. కర్త్రర్థము | క్షమిష్యమాణ | క్షమింపఁగల |
| 2. కర్మార్థము | ,, | క్షమింపఁబడఁగల |
| 3. ప్రే. కర్త్రర్థము | క్షామయిష్యత్ | క్షమింపఁజేయఁగల |
| 4 ప్రే. కర్మార్థము | క్షామయిష్యమాణ | క్షమింపఁబడఁజేయఁగల |

* వీనికి ఆత్మనే పదమును కలదు. క్షామయమాణ, క్షమిష్యమాణ, కాని అవి యంత ప్రసిద్ధములుగావు.

4 విధి

---

1. కర్మార్థము:- క్షంతవ్య, క్షమణీయ, క్షమ్య-క్షామ్య } క్షమింపఁబడఁదగిన-వలసిన

2. ప్రే. కర్మార్థము క్షామయితవ్య, క్షామణీయ } క్షమింపఁజేయఁబడఁదగిన—వలసిన

## విశేషణములు – అపేక్షాభావము.

## (Degrees of comparison)

---

విశేషణములకు (తఱుచుగా మొదటి జాతి విశేషణములకు) మూఁడు అవస్థలు గలవు.

ప్రథమము – మధ్యమము – ఉత్తమము.

(Positive) (Comparative) (Superlative)

ప్రథమావస్థయందు విశేషణరూపములకు మార్పులేదు. మధ్యమమునందు వీనికి 'తర' అను ప్రత్యయమును, ఉత్తమమునందు 'తమ' అను ప్రత్యయమును కడపట చేరును.

ఉ॥ ప్ర. గురు మ గురుతర ఉ. గురుతమ

ఒకానొకప్పుడు 'తర' ప్రత్యయమునకు మాఱుగా 'ఈయస్' అనునదియు, 'తమ' ప్రత్యయమునకు బదులు 'ఇష్ఠ' అనునదియు ప్రాప్తించుచుండును.

| ఉ॥ గురు | గరీయస్ | గరిష్ఠ | |
|---|---|---|---|
| మృదు | మ్రదీయస్ | మ్రదిష్ఠ | |
| ఉరు | వరీయస్ | వరిష్ఠ | |
| అల్ప | కనీయస్ | కనిష్ఠ | ఇత్యాదులు |

## విశేషణములు - లింగవిభక్తి వచనములు

లింగవిభక్తి వచనములు విశేషణములకు స్వాభావికముగా లేవు. కాని విశేష్యములతోడి సాహచర్యమువలన అవి వీనికిని సంక్రమించును. కాబట్టి నామ సర్వనామములకువలె విశేషణములకును ఆయా లింగవచనములందు విభక్త్యంతరూపములను గ్రహింపవలసియున్నది.

1) సామాన్యములు:- అంత్యాక్షరములనుబట్టి వీనిని అజంత హలంతాది జాతులందు చేర్చుకొని తదనుగుణముగా రూపములను నిర్ణయింపవలెను.

ఉ॥ మధురః - పుం మధురా - స్త్రీ మధురమ్ - నపుం మొ॥

ఉకారాంతములందు మాత్ర మొక విశేషముగలదు. అవి స్త్రీ పుంస సాధారణములై యుండును. గురుః-(పుం-స్త్రీ) ఇది పై కల్పికమగుటచేత స్త్రీత్వమందు 'గురుః-గుర్వీ' అను రెండు రూపములును గ్రాహ్యములగుచున్నవి. పుంలింగమున గురుః' అని ఒక్క రూపమే.

**2)** సార్వనామికములు:— వీని విభక్త్యంత రూపములు సర్వనామ ప్రకరణమునందే నిరూపితములైనవి. వానినెల్ల నిచ్చట ననుసంధించుకొననచ్చును.

**3)** ధాతుజములు:— ధాతుజ విశేషణములెల్ల మూడు పాళ్ళు అకారాంతములు. తక్కినవి తకారాంతములు.

అందు; అకారాంతములు:—

పుంలింగమున—'రామ' శబ్దమువలె
స్త్రీలింగమున—'రమా' ,, ,,
నపుంసకమున— 'ఫల' ,, ,,
వర్తించును.

ఇఁక తకారాంతములు భూతకాలమందు:—

| | | | |
|---|---|---|---|
| పుంలింగమున:— | 'ధీమత్' | శబ్దమువలెను | (పఠితవాన్) |
| స్త్రీలింగమున — | 'నదీ' | ,, ,, | (పఠితవతీ) |
| నపుంసకమున:— | 'జగత్' | ,, ,, | (పఠితవత్) |

ఉండును.

మఱి వర్తమాన భవిష్యదర్థములందు:—

| | | |
|---|---|---|
| పఠత్ | పఠంతీ | } అని కొంత మార్పు |
| పఠిష్యత్ | పఠిష్యంతీ | |

చెంది తక్కిన రూపములు భూతకాలమునందువలెనే వర్తించును. కాని కొన్ని వర్తమానార్థకములందు మాత్రము పుంలింగమున 'న' కారమును స్త్రీలింగమున బిందువును కానఁబడవు.

ఉ దధత్ (పుం) దధతీ (స్త్రీ)
జహత్ (,,) జహతీ (స్త్రీ)

ఇది కొన్నిటియందు వైకల్పికముగా వర్తించును.

ఉ విశత్ / విశన్ } పుం } విశతీ / విశంతీ } స్త్రీ.

ఇట్టి తకారాంతములు పుంలింగమున 'మరుత్' శబ్దము వలె వర్తించును.

దధత్ — దధతౌ — దధతః.

## అపేక్షాభావ విశేషణములు - వాని విభక్త్యంతములు.

ఇవికొన్ని అకారాంతములు. కొన్ని సకారాంతములు. అందు మొదటివి పుం స్త్రీ నపుంసకములందు వరుసగా 'రామ' 'రమా' 'ఫల' శబ్దములను పోలియుండును.

ఉ గురుతరః — గురుతరా — గురుతరమ్.
గురుతమః — గురుతమా — గురుతమమ్.
గరిష్ఠః — గరిష్ఠా — గరిష్ఠమ్.

ఇక రెండవ జాతికి చెందినవి:—

పుంలింగమున ద్వితీయా ద్వివచనమునకును "విద్వస్" శబ్దమువలెను — (శ్రేయాన్) అచ్చటినుండి వేధస్ శబ్దము వలెను (శ్రేయసః) స్త్రీ లింగమున "నదీ" శబ్దమువలెను (శ్రేయసీ.) నపుంసకమున "మనస్" శబ్దమువలెను (శ్రేయః) వర్తించును.

ఇది

విశేషణ ప్రకరణము.

# 4. క్రియలు.

## ( Verbs. )

క్రియలు ధాతువుల (Root Verbs) నుండి నిష్పన్నము లగుచున్నవి. ధాతువులు సంస్కృతమున వానివాని స్వభావ పరిణామములనుబట్టి పది జాతులుగ విభజింపఁబడినవి.

1) భ్వాదులు 2) అదాదులు 3) జుహోత్యాదులు 4) దివాదులు 5) స్వాదులు 6) తుదాదులు 7) రుధాదులు 8) తనాదులు 9) క్ర్యాదులు 10 చురాదులు.

ఒక్కొక్క జాతియందు ఆత్మనే పదములని పరస్మై పదములని రెండు వర్గములు గలవు. వీనికి రూపభేదమేకాని అర్థభేద మేమాత్రమును కానఁరాదు. ఆత్మనే పద పరస్మైపదము లకు మరల - ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉత్, అభి, ప్రతి, పరి, ఉప - అను ఇరువది రెండు ఉపసర్గలును, తిరస్, అంతర్ సాక్షాత్, ఊరీ, అంగీ, ఉరరీ మొదలగు గతి సంజ్ఞి తములైన కొన్ని శబ్దములును, యథాసంభవముగా వచ్చి ముందు చేరుటవలన అనేకములగు క్రొత్తధాతువు లుత్పన్నములగు చున్నవి. ఇట్లు శాఖోపశాఖలయి వర్తించు ధాతువుల కన్నింటికిని ప్రత్యయములు (Terminations) కడపట చేరుట వలన క్రియాపదములు (Verbal forms) నిష్పన్నము లగ

చున్నవి. ధాతువులనుండి ఇట్లు నిష్పన్నములగు క్రియాపదము లెల్ల రెండువిధములు.

1. సమాపకములు (Finite.) వాక్యార్థమును సమాప్తము చేయునవి.

2. అసమాపకములు (Infinite) ,, ,, చేయనివి.

## 1. సమాపకములు. *(Finite Verbs)*

ప్రతి సమాపక క్రియాపదమునకును:—

| ఆఱుకాల విశేషములును: (Tenses) | | | |
|---|---|---|---|
| | వర్తమానము | 1 | |
| | భూతము | 3 | 6 |
| | భవిష్యత్తు | 2 | |

| నాలుగు అర్థ విశేషములును: (Moods) | | | |
|---|---|---|---|
| | విధి | 2 | |
| | ఆశీస్సు | 1 | 4 |
| | హేతుహేతుమంతము | 1 | |

కలవు.

వీనికే దశవిధ లకారములని వ్యవహారము. ఒక్కొక్క లకారమునకును, ఉత్తమ — మధ్యమ — ప్రథమ. అని మూఁడు పురుషములును, ఏక — ద్వి — బహుత్వములని మూఁడు వచనములును, కలవు. కావున తొమ్మిదేసి క్రియారూపము లొక్కొక్క దానికి ప్రాప్తించును. ప్రస్తుతము ఒక పరస్మైపద ధాతువునకును, ఒక ఆత్మనేపద ధాతువునకును వర్తమానాదులైన పది లకారములందును అట్టి క్రియారూపములు నిర్దేశింప బడును. పరిశీలించునది.

## పరస్మై — లిఖ్ — వ్రాయుట.

### 1. వర్తమానము.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ఉ॥ | లిఖామి | లిఖావః | లిఖామః |
| మ॥ | లిఖసి | లిఖథః | లిఖథ |
| ప్ర | లిఖతి | లిఖతః | లిఖంతి * |

### 2. భూతము (1)

| | | | |
|---|---|---|---|
| ఉ | అలిఖమ్ | అలిఖావ | అలిఖామ |
| మ | అలిఖః | అలిఖతమ్ | అలిఖత |
| ప్ర॥ | అలిఖత్ | అలిఖతామ్ | అలిఖన్ |

### 3. భూతము (2)

| | | | |
|---|---|---|---|
| ఉ | అలేఖిషమ్ | అలేఖిష్వ | అలేఖిష్మ |
| మ | అలేఖీః | అలేఖిష్టమ్ | అలేఖిష్ట |
| ప్ర | అలేఖీత్ | అలేఖిష్టామ్ | అలేఖిషుః |

### 4. భూతము (3)

| | | | |
|---|---|---|---|
| ఉ | లిలేఖ | లిలిఖివ | లిలిఖిమ |
| మ | లిలేఖిథ | లిలిఖథుః | లిలిఖ |
| ప్ర॥ | లిలేఖ | లిలిఖతుః | లిలిఖుః |

---

* ఇచ్చట కొన్ని క్రియాపదములకు పూర్ణబిందువు కానఁబడదు.

ప్ర. జుహోతి — జుహుతః — జుహ్వతి<br>బిభేతి — బిభ్యతః — బిభ్యతి } ఇత్యాదులు.

### 5. భవిష్యత్తు (1)

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ఉ॥ | లిఖిష్యామి | లిఖిష్యావః | లిఖిష్యామః |
| మ॥ | లిఖిష్యసి | లిఖిష్యథః | లిఖిష్యథ |
| ప్ర | లిఖిష్యతి | లిఖిష్యతః | లిఖిష్యంతి |

### 6. భవిష్యత్తు (2)

| | | | |
|---|---|---|---|
| ఉ | లిఖితాస్మి | లిఖితాస్వః | లిఖితాస్మః |
| మ | లిఖితాసి | లిఖితాస్థః | లిఖితాస్థ |
| ప్ర॥ | లిఖితా | లిఖితారౌ | లిఖితారః |

### 7. విధి (1)

| | | | |
|---|---|---|---|
| ఉ॥ | లిఖేయమ్ | లిఖేవ | లిఖేమ |
| మ॥ | లిఖేః | లిఖేతమ్ | లిఖేత |
| ప్ర॥ | లిఖేత్ | లిఖేతామ్ | లిఖేయుః |

### 8. విధి (2)

| | | | |
|---|---|---|---|
| ఉ॥ | లిఖాని | లిఖావ | లిఖామ |
| మ | లిఖ | లిఖతమ్ | లిఖత |
| ప్ర | లిఖతు | లిఖతామ్ | లిఖంతు • |

### 9. ఆశీస్సు

| | | | |
|---|---|---|---|
| ఉ | లిఖ్యాసమ్ | లిఖ్యాస్వ | లిఖ్యాస్మ |
| మ | లిఖ్యాః | లిఖ్యాస్తమ్ | లిఖ్యాస్త |
| ప్ర॥ | లిఖ్యాత్ | లిఖ్యాస్తామ్ | లిఖ్యాసుః |

• ఇట్టి తావులందుగూడ కొన్నిటికి పూర్ణబిందువు రాదు.

## 10 హేతుహేతుమంతము.

| | | | |
|---|---|---|---|
| ఉ॥ | అలిఖష్యమ్ | అలిఖష్యావ | అలిఖష్యామః |
| మ | అలిఖష్యః | అలిఖష్యతమ్ | అలిఖష్యత. |
| ప్ర॥ | అలిఖష్యత్ | అలిఖష్యతామ్ | అలిఖష్యన్. |

## ఆత్మనే — భాష్ — మాటాడుట.

---

### 1. వర్తమానము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ఉ। | భాషే | భాషావహే | భాషామహే |
| మ॥ | భాషసే | భాషేథే | భాషధ్వే |
| ప్ర | భాషతే | భాషేతే | భాషంతే • |

### 2. భూతము (1)

| | | | |
|---|---|---|---|
| ఉ। | అభాషే | అభాషావహి | అభాషామహి |
| మ | అభాషథాః | అభాషేథామ్ | అభాషధ్వమ్ |
| ప్ర | అభాషత | అభాషేతామ్ | అభాషంత |

### 3. భూతము (2)

| | | | |
|---|---|---|---|
| ఉ॥ | అభాషిషి | అభాషిష్వహి | అభాషిష్మహి. |
| మ॥ | అభాషిష్ఠాః | అభాషిషాథామ్ | అభాషిధ్వమ్. |
| ప్ర॥ | అభాషిష్ట | అభాషిషాతామ్ | అభాషిషత. |

---

• పరస్మైపదములకువలె వీనికిని బిందు లోపమును గ్రహింపవలెను.

ధత్తే — దధాతే — దధతే —
తనుతే — తన్వాతే — తన్వతే } ఇత్యాదులు.

### 4. భూతము (3)

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ఉ॥ | బభాషే | బభాషివహే | బభాషిమహే |
| మ॥ | బభాషిషే | బభాషిషాథే | బభాషిధ్వే |
| ప్ర॥ | బభాషే | బభాషిషాతే | బభాషిరే |

### 5. భవిష్యత్తు (1)

| | | | |
|---|---|---|---|
| ఉ॥ | భాషిష్యే | భాషిష్యావహే | భాషిష్యామహే |
| మ॥ | భాషిష్యసే | భాషిష్యేథే | భాషిష్యధ్వే |
| ప్ర॥ | భాషిష్యతే | భాషిష్యేతే | భాషిష్యంతే |

### 6. భవిష్యత్తు (2)

| | | | |
|---|---|---|---|
| ఉ॥ | భాషితాహే | భాషితాస్వహే | భాషితాస్మహే |
| మ॥ | భాషితాసే | భాషితాసాథే | భాషితాధ్వే |
| ప్ర॥ | భాషితా | భాషితారౌ | భాషితారః |

### 7. విధి (1)

| | | | |
|---|---|---|---|
| ఉ॥ | భాషేయ | భాషేవహి | భాషేమహి |
| మ॥ | భాషేథాః | భాషేయాథామ్ | భాషేధ్వమ్ |
| ప్ర॥ | భాషేత | భాషేయాతామ్ | భాషేరన్ |

### 8. విధి (2)

| | | | |
|---|---|---|---|
| ఉ॥ | భాషై | భాషావహై | భాషామహై |
| మ॥ | భాషస్వ | భాషేథామ్ | భాషధ్వమ్ |
| ప్ర॥ | భాషతామ్ | భాషేతామ్ | భాషంతామ్ |

## 9. ఆశీస్సు

| | | | |
|---|---|---|---|
| ఉ॥ | భాషిషీయ | భాషిషీవహి | భాషిషీమహి |
| మ। | భాషిషీష్ఠాః | భాషిషీయాథామ్ | భాషిషీధ్వమ్ |
| ప్ర। | భాషిషీత | భాషిషీయాస్తామ్ | భాషిషీరన్ |

## 10. హేతు హేతుమంతము.

| | | | |
|---|---|---|---|
| ఉ। | అభాషిష్యే | అభాషిష్యావహి | అభాషిష్యామహి |
| మ। | అభాషిష్యథాః | అభాషిష్యేథామ్ | అభాషిష్యధ్వమ్ |
| ప్ర॥ | అభాషిష్యత | అభాషిష్యేతామ్ | అభాషిష్యంత |

ఇట్లు తత్తత్కాల విశేషములందును, అర్థ విశేషములందును పరస్మైపదాత్మనే పదములకు క్రియారూపము లుదాహరింపఁబడినవి. వీని కన్నిటికిని ఉత్తమ పురుషైకవచనమున మాత్రము తెలుఁగునం దర్థములు వ్రాయుదును. తక్కినవాని నూహించునది.

తెలుఁగున పరస్మై పదాత్మనేపద విభాగము లేదు కావున వానిరెంటికిని రూపభేదమును లేదు.

| | | |
|---|---|---|
| 1. వర్తమానము:– | – వ్రాయుచున్నాను | – మాటాడుచున్నాను. |
| 2. భూతము (3) | – వ్రాసితిని | – మాటాడితిని. |
| 3. భవిష్యత్తు (2) | – వ్రాయుదును<br>వ్రాసెదను | – మాటాడుదును<br>మాటాడెదను |
| 4. విధి (1) | – వ్రాయవలెను | – మాటాడవలెను. |
| 5. విధి (2) | – వ్రాయనిమ్ము<br>వ్రాయవచ్చును | – మాటాడనిమ్ము<br>మాటాడవచ్చును |
| 6. ఆశీస్సు | – వ్రాయుదునుగాక | – మాటాడుదునుగాక |
| 7. హేతుహేతుమంతము | – వ్రాసియుందును | – మాటాడియుందును. |

ఇట్లు అన్నింటికిని తెలుఁగునందర్థములను గ్రహించునది. ఇంతవఱకును ఉదాహృతములైన పరస్మైపదాత్మనేపదరూపములు ఒకానొక గణమునకుమాత్రము చెందినవి. తక్కిన ధాతుజాతుల కన్నింటికిని ఇట్లే రూపమును గ్రహించుచు పోవలెను. అచ్చటచ్చట క్రియారూపములం దనేకములైన మార్పులు కనుపట్టవచ్చును. కాని వానినన్నిటిని ప్రపంచించుటకు ఇది యదను గాదు. ప్రయోగములను బట్టి స్వయముగా అవగాహనము నకు తెచ్చుకొనుట శ్రేయము.

మఱియును పయి నుదాహరింపఁబడిన పరస్మైపదాత్మనేపదములేకాక ధాతువులందు మఱియొక విభాగముకూడ గలదు. వాని కుభయపదములని పేరు. అట్టివానికి పరస్మైపదక్రియారూపములు ఆత్మనేపదక్రియారూపములు రెండును రావచ్చును.

| | పరస్మై | ఆత్మనే |
|---|---|---|
| ఉ. | కరోతి | కురుతే |
| | దధాతి | ధత్తే |
| | భజతి | భజతే |
| | శృణోతి | శృణుతే ఇత్యాది. |

ఒకొక్కప్పుడు ఉపసర్గలు చేరుటవలన సయితము కొన్ని పరస్మైపదము లాత్మనేపదములుగను, ఆత్మనేపదములు పరస్మైపదములుగను మాఱుట సంభవించును.

| పరస్మై | ఆత్మనే |
|---|---|
| ఉ॥ తిష్ఠతి | ఉపతిష్ఠతే |
| ఆత్మనే | పరస్మై |
| రమతే | విరమతి ఇత్యాదులు |

మఱియును ఉపసర్గలు చేరుటవలన క్రొత్త ధాతువులు జన్మించుటయేగాక అవి క్రొత్త అర్థములందును రూఢములగుచుండును.

ఉ భవతి — అనుభవతి — సంభవతి — అభిభవతి మొ

ఇట్లు ఉపసర్గలు చేరిన ధాతువునకు మొదటి రెండు భూతకాలములందును క్రియారూపము లేర్పడునపుడు ఒక్క యంశమును బాగుగా గుర్తుంచుకొనవలెను. భూతకాలికమైన అకారమునకు ముందే ఆ ఉపసర్గను చేర్పవలెనుగాని తరువాత చేర్పరాదు

ఉ అభవత్:— అను + అభవత్ — అన్వభవత్ మొ,

## క్రియలు — కర్తృకర్మాద్యర్థములు.

క్రియలు మరల రెండు విధములు.

1. సకర్మకములు (Transitive)
2. అకర్మకములు (Intransitive)

ఇవి రెండును ఒక్కొక్కటి నాలుగేసి అర్థములందు వర్తించును.

అందు సకర్మమునకు గల నాలు గర్థములును:—

1. కర్త్రర్థము (Active) 2. కర్మార్థము (Passive)

3. ప్రేరణ కర్త్రర్థము (Causative) 4. ప్రే. కర్మార్థము (cas-passive.)

అకర్మకమునకు:- 1. కర్త్రర్థము 2. భావార్థము (Impersonal 'pass')

3. ప్రేరణ కర్త్రర్థము 4 ప్రేరణ కర్మార్థము.

కర్మార్థమునకు బదులు భావార్థ మొకటితప్ప రెంటికిని వేఱుభేదము కానరాదు.

వెనుక నుదాహరింపఁబడిన దశవిధలకార రూపములును కర్త్రకర్మాదులగు ఈ నాలుగర్థములందును ప్రాప్తించును. అందు మొదటిదైన కర్త్రర్థమునకు మాత్రమే ఇంతవఱకును అన్ని లకారములందును క్రియారూపము లుదాహృతములైనవి. ఇఁక కర్మాదులకును అట్లే చూపవలసియున్నది. కాని వానికి వచ్చు రూపములనెల్ల విస్తరించి చూపఁబనిలేదు. వర్తమాన ప్రథమ పురుషైక వచనమునందు మాత్ర మన్నిటికి రూపములు నిర్దేశించెదను. తక్కి వాని నూహించునది.

| పరస్మై - వర్తమాన. | ఆత్మనే - వర్తమాన. |
|---|---|
| 1. కర్తృ: పఠతి | క్షమతే |
| 2. కర్మ: పఠ్యతే (భావ) | క్షమ్యతే (భావ) |
| 3. ప్రే. కర్తృ: పాఠయతి | క్షామయతి—క్షామయతే |
| 4. ప్రే. కర్మ: పాఠ్యతే | క్షామ్యతే |

వీనియందు పరస్మైపదమున కర్తృ ప్రేరణకర్త్రర్థ రూపము లొకటిగానే నడచుచుండును. (పఠతి - పాఠయతి) కర్మ, ప్రేరణ కర్మార్థములందు మాత్రము యకార మొకటి అధికముగా చేరుటయు అవి ఆత్మనేపదములుగ మారుటయు జరుగుచున్నది. (పఠ్యతే - పాఠ్యతే.) ఇతర ఆత్మనే పదములందు మాత్రము 'య' కారము చేరుట యొకటియే మార్పు. క్షమ్యతే, క్షామయతే, క్షామ్యతే మఱియును ఇందలి ప్రేరణ కర్త్రర్థరూపము పరస్మైపదముగాకూడ మారుచున్నది. (క్షామయతి) ఇట్లు వీని లక్షణములనుబట్టి అన్ని లకారము లందును వీనికి రూపముల నూహించునది. విశేషాంశములన్నియు ప్రయోగములవలననే గ్రహించునది.

## 2. అసమాపకములు (*Infinitives*)

ఇవి రెండు విధములు: 1. భూతార్థకము (క్త్వా) (Past, Inf.)
2. భావ్యర్థకము (తుమ్) (Future Inf.)

ఇవి రెండును భావ వ్యతిరేకార్థములందు (Positive and negative) రెండింటను వర్తించును. వీనికిని ఉపసర్గములు చేరును. కర్తృకర్మాద్యర్థరూపములును గలవు. కాని సమాపకములవలె పరస్మైపదాత్మనేపదముల క్రిందు రూపభేదములేదు. క్రింది ఉదాహరణములను పరిశీలించునది.

లిఖ్ — వ్రాయుట.

1 భూతార్థకము

(భావము)

* కర్తృ. కర్మ.

అనుపసర్గ — లిఖిత్వా } వ్రాసి
సోపసర్గ — విలిఖ్య } వ్రాయఁబడి

ప్రే. కర్తృ. ప్రే. కర్మ.

అనుపసర్గ — లేఖయిత్వా } వ్రాయించి
సోపసర్గ — విలేఖ్య } వ్రాయింపఁబడి

(వ్యతిరేకము)

కర్తృ. కర్మ.

అనుపసర్గ — అలిఖిత్వా } వ్రాయక
సోపసర్గ — అవిలిఖ్య } వ్రాయఁబడక

---

* 'త్వా-తుమ్' అనువానికి కొన్నిచోట్ల 'ష్ట్వా, క్త్వా, ధ్వా, ఢ్వా' మొ॥ వాని రూపమున పరిణామము కలుగుచుండును—దృష్ట్వా, భుక్త్వా, రుద్ధ్వా, దగ్ధ్వా, మొ॥

(వ్యతిరేకము)

ప్రే కర్తృ. ప్రే కర్మ.

| | | | |
|---|---|---|---|
| అనుపసర్గ | — | అలేఖయిత్వా | వ్రాయింపక |
| సోపసర్గ | — | అవిలేఖ్య | వ్రాయింపఁబడక |

మఱియును ఇది అతిశయార్థమున "లిఖిత్వా-లిఖిత్వా" అనికాని ♦ "లేఖమ్-లేఖమ్" అనికాని రెండు రకములగు రూపములను కలిగియుండును.

## 2. భావ్యర్థము

(భావము)

కర్తృ. కర్మ.

| | | | |
|---|---|---|---|
| అనుపసర్గ | — | * లిఖితుమ్ | వ్రాయఁగా |
| సోపసర్గ | — | విలిఖితుమ్ | వ్రాయఁబడఁగా |

ప్రే. కర్తృ. ప్రే. కర్మ.

| | | | |
|---|---|---|---|
| అనుపసర్గ | — | లేఖయితుమ్ | వ్రాయింపఁగా |
| సోపసర్గ | — | విలేఖయితుమ్ | వ్రాయింపఁబడఁగా |

---

* 'త్వా తుమ్' అనువానికి కొన్నిచోట్ల 'ష్ట్వా. క్త్వా. ఢ్వా. గ్ధ్వా మొ॥ వాని రూపమున పరిణామము కలుగుచుండును—దృష్ట్వా, భుక్త్వా, రుద్ధ్వా దగ్ధ్వా. మొ।

♦ వీనికి 'ణముళంత' ములనిపేరు. ఇవి అన్ని ధాతువులకును ఏర్పడక పోవచ్చును. ప్రసిద్ధములైన వానిని పరిగ్రహించునది.

(వ్యతిరేకము)

కర్తృ. కర్మ.

అనుపసర్గ — అలిఖితుమ్ } వ్రాయకుండగా
సోపసర్గ — అవిలిఖితుమ్ } వ్రాయఁబడకుండగా

ప్రే. కర్తృ. ప్రే. కర్మ

అనుపసర్గ — అలేఖయితుమ్ } వ్రాయింపకుండగా
సోపసర్గ — అవిలేఖయితుమ్ } వ్రాయింపబడకుండగా

భావ్యర్థ రూపములందు ఉపసర్గానుపసర్గ భేదములేదు.

ఇది

క్రియా ప్రకరణము.

---

# 5. అ వ్య య ము లు.

## Adverbs Etc.

---

అవ్యయములకు తక్కిన అన్ని శబ్దములకువలె రూప భేదము కానరాదు. వీని నన్నిటిని సంస్కృతమున రెండు విభాగములు గావింపవచ్చును.

**1.** లాక్షణికములు *(Derived)*

**2.** ప్రతిపదోక్తములు *(Non - Derived)*

అందు ప్రసిద్ధములైన శబ్దములనెల్ల వరుసగా ప్రదర్శింతును. పరిశీలించునది.

### 1. లా క్ష ణి క ము లు (*Derived*)

| | | | | |
|---|---|---|---|---|
| 1. | వత్ | — | రామవత్<br>కృష్ణవత్ | రామునివలె<br>కృష్ణునివలె |
| 2. | తసిల్ | — | గ్రామతః<br>వనతః | ఊరినుండి<br>అడవినుండి |
| 8. | సాత్ | — | అగ్నిసాత్<br>భస్మసాత్ | నిప్పుగా<br>నీఱుగా |
| 4. | శస్ | — | అల్పశః<br>బహుశః | తక్కువగా<br>ఎక్కువగా |
| 5. | సుచ్ | — | ద్విః<br>త్రిః | రెండుసార్లు<br>మూఁడుసార్లు |

| | | | | |
|---|---|---|---|---|
| 6. | కృత్వసుచ్ | — | చతుఃకృత్వః<br>పంచకృత్వః | నాలుగు సార్లు<br>అయిదు ,, |
| 7. | ధాచ్ | — | ద్విధా<br>త్రిధా | రెండుగా<br>మూఁడుగా |
| 8. | అవ్యయీభావ సమాసములు | సహ | — | సకుటుంబమ్ |
| | | యథా | — | యథాశక్తి |
| | | యావత్ | — | యావజ్జీవమ్ |
| | | ప్రతి | — | ప్రతిగృహమ్ |
| | | ఆఙ్ | — | ఆబాలగోపాలమ్ |

## సంబంధార్థకములు.

| 1. యదర్థకములు | 2. తదర్థకములు |
|---|---|
| యత్ | తత్ |
| యావత్ | తావత్ |
| యథా | తథా |
| యదా | తదా<br>తదానీమ్ |
| యత్ర | తత్ర |
| యతః | తతః |
| యది (చేత్) | తర్హి |
| యద్యపి | తథాపి<br>ఏవమపి<br>అథాపి |
| * నకేవలమ్ | కింతు. అపితు<br>పరంతు |

* ఇది యత్తదర్థకములందు చేరకున్నను నిత్య సంబంధార్థకమగు మాట మఱవరాదు.

| 3. ఏతదర్థకములు | 4. కిమర్థకములు |
| --- | --- |
| ఏతత్ | కిమ్ |
| ఏతావత్, ఇయత్ | కియత్ |
| ఇత్థమ్, ఏవమ్ | కథమ్ |
| ఇదానీమ్, అధునా, సంప్రతి | కదా |
| అత్ర, ఇహ | కుత్ర, క్వ |
| ఇతః, అతః | కుతః |
| ఏతర్హి | కర్హి |

| 5. సర్వార్థములు | 6. అన్యార్థములు | 7. ఏకార్థములు |
| --- | --- | --- |
| సర్వమ్ | అన్యత్ | ఏకమ్ |
| సర్వధా, సర్వథా | అన్యధా, అన్యథా | ఏకధా |
| సర్వదా, సదా | అన్యదా | ఏకధా |
| సర్వత్ర | అన్యత్ర | ఏకత్ర |
| సర్వతః | అన్యతః | ఏకతః |

ఇందు "యత్, యావత్, ఏతత్, కిమ్, సర్వ, అన్య, ఏక" – శబ్దములు అవ్యయములేకాక కొన్ని సర్వనామములును అయి ఉండుట గమనింపవలయును. వీని కన్నిటికి రూపసామ్యమును, పరస్పరసంబంధమును, ఉండుటవలన విద్యార్థులసౌకర్యార్థము అవ్యయములును అవ్యయేతరములును అన్నియును జేర్చి ఒకచోట నుదాహరించితిని — ఇవి లాక్షణికావ్యయములు.

1. లాక్షణికావ్యయముల కన్నిటికిని సముచ్చయార్థమున "అపి" అను అవ్యయమును కడపట చేర్పవలెను.

ఉ॥ అనేకశోఽపి — చాలవిధములుగా కూడ
కుత్రాపి — ఎక్కడఁ గూడ — ఇత్యాది

2. ఆధిక్యార్థమున అన్నిటికిని ద్విత్వము వచ్చును.

ఉ॥ ద్విధాద్విధా — తథాతథా — కథమ్ కథమ్ — ఇత్యాది.

3. అనిశ్చయార్థమున "కిమర్థక" శబ్దములకు మాత్రము "చిత్" "చన" 'అపి' అను మూఁడింటిలోపల ఒకదానిని కడపట చేర్పవలెను.

ఉ॥ కిమపి — కదాచిత్ — కథంచన, ఇత్యాది —

4. అత్యంతానిశ్చయార్థమున పై మూఁడిటిని యత్కిమర్థకములకు రెండిటికిని చేర్పవలెను.

యత్కించిత్ – యత్రకుత్రాపి – యదాకదాచన ఇత్యాది –

## 2. ప్రతిపదోక్తములు.

1. చ — కూడ, మఱియు
2. అపి — కూడ, మఱియు
3. తు. — కాని, మాత్రము
4. వా — లేదాకాని., ఏమో
5. ను. — ఏమో, ఏమి
6. ఉత, ఉతాహో, ఆహోస్విత్ — లేదా
7. హి — ఎందుల, కనఁగా

| | | |
|---|---|---|
| 8. | కిల | అంట |
| 9. | ఖలు | కదా |
| 10. | నను | మరి కదా |
| 11. | చేత్, తర్హి | అయినచో |
| 12. | కింస్విత్ | ఆఁ ఏమి |
| 13. | కచ్చిత్ | ఏమి |
| 14. | కిమ్ | ఏమి |
| 15. | మా | వద్దు |
| 16. | న, నో | వద్దు, లేదు, కాదు |
| 17. | ఇతి, నామ | అని, అను |
| 18. | ఇవ | వలె |
| 19. | అవశ్యమ్, నియతమ్, నూనమ్ | తప్పక |
| 20. | నితాంతమ్, అత్యంతమ్, భృశమ్, కామమ్, ప్రకామమ్, అభీక్ష్ణమ్, భూయిష్ఠమ్, అతీవ | ఎక్కువ, మిక్కిలి, తఱుచు |
| 21. | సాధమ్, సుష్ఠు, సమ్యక్ | బాగుగా, చక్కగా |
| 22. | మృషా, మిథ్యా, వృథా, ముధా, వ్యర్థమ్, నిరర్థమ్, వితథమ్ | అసత్యముగా, వ్యర్థముగా |
| 23. | అద్ధా, అంజసా, సత్యమ్, తథ్యమ్, అవితథమ్ | నిజముగా |
| 24. | పురా, పూర్వమ్, ప్రాక్, అర్వాక్ | ముందు, క్రిందట |
| 25 | పరమ్, పరతః, పశ్చాత్, అను, అథ, అథో, అనంతరమ్, తదను, తతః | తరువాత, వెనుక, తరువాత, పిమ్మట |

26. అనుపదమ్, సద్యః, సపది, సహసా — వెంటనే

27. ద్రాక్, అహ్నాయ, ఝుటితి, ఝుడితి, ఝుగితి, శీఘ్రమ్, తూర్ణమ్, తరసా, సత్వరమ్, మంక్షు, ద్రుతమ్ — శీఘ్రముగా, వేగముగా

28. శనైః, శనకైః, మందమ్, ధీరమ్, అలసమ్ — మెల్లగా.

29. అకస్మాత్, అకాండే, అతర్కితమ్ — అకస్మికముగా

30. హఠాత్, బలాత్, ప్రసహ్య, ప్రసహ్య, ప్రసభమ్ — హఠాత్తుగా, బలవంతముగా

31. ఏకపదమ్, ఏకవారమ్, యుగపత్, సమమ్ — ఒక్కసారిగా

32. సహ, సాకమ్, సార్ధమ్, సమమ్ — తోడ, కూడ

33. వినా, అంతరేణ, ఋతే, అపహాయ, విహాయ, ముక్త్వా — తప్ప, విడిచి

34. ఉచ్చైః, ఊర్ధ్వమ్, ఉపరి, ఉపరిష్టాత్ — మీఁద, పైన

35. నీచైః, అధః, అధస్తాత్ — క్రింద, దిగువ

36. తారమ్ — బిగ్గఱగా

37. మంద్రమ్ — నెమ్మదిగా

38. పురః, పురతః — ఎదుట

అగ్రే
అగ్రతః
సమక్షమ్
సమ్ముఖమ్
అభిముఖమ్ } ఎదుట ముందట

39. పృష్ఠతః
పృష్ఠే } వెనుక

40. పార్శ్వతః
పార్శ్వే } ప్రక్కన

41. అంతః — లోపల

42. బహిః — వెలుపల

43. అంతరా
అంతరే } నడుమ

44. పరితః
అభితః
సమంతతః
సమంతాత్ } అంతట

45. ఆరాత్
అభ్యాశమ్
అభ్యర్ణమ్
నికటమ్ } దగ్గర

సకాశమ్. నికషా — సమీపము.

46. దూరమ్
దూరే
ఆరాత్ } దూరముగా.

47. భూయః
ముహుః
పునః } మరల

48. ప్రతి
ఉద్దిశ్య
అంతరా } కూర్చి గురించి

అధికృత్య - అభిప్రేత్య

49. మిథః
మిథో
పరస్పరమ్
అన్యోన్యమ్ } పరస్పరముగా

50. ఉపాంశు
మిథః
మిథో
రహసి
ఏకాంతే
రహః
ప్రచ్ఛన్నమ్ } చాటుగా

51. ప్రకాశమ్ — పైకి

52, పృథక్ — వేఱుగా

53. సాక్షాత్ — సాక్షాత్తు

54 స్వయమ్
స్వతః } తనంతట

55. కేవలమ్
ఏవ } కేవలము ఏ

56. చిరమ్
చిరాయ
చిరస్య } చాల కాలము
చిరాత్
శశ్వత్
అనిశమ్ } ఎప్పుడు

అజస్రమ్ / నిత్యమ్ } ఎప్పుడు

57. జాతు / ఏకదా } ఒక ప్పుడు

58. సకృత్ ఒకసారి

59. అసకృత్ పలుమాఱు

60. ప్రాతః / ఉషసి / ప్రత్యుషసి / ప్రత్యూషసి / కల్యమ్ / ప్రభాతే / ప్రగే } వఱువాత తెల్లవాఱి

61. దిష్ట్యా అదృష్టవశమున

62. హంత / బత } అక్కటా / అయ్యో

63. అరే / రే / అయి / హే } ఓరి / ఓయీ

64. అయి / హంజే } ఓసీ

65. ధిక్ ఛీ

66. ఓమ్ / ఆమ్ } అవును

67. హ్యః నిన్న

68. ప్రహ్యః మొన్న

69. శ్వః రేపు

70. పరశ్వః ఎల్లుండి

71. ప్రపరశ్వః } అవతె ల్లుండి

72. అద్య నేఁడు

73. పూర్వేద్యుః / అధరేద్యుః } ముందు దినము

74. అపరేద్యుః / అన్యేద్యుః / ఉత్తరేద్యుః / పరేద్యుః } మఱు నాఁడు

75 దివా ... పగలు

76. నక్తమ్ / దోషా } రాత్రి

77. సాయమ్ సాయం కాలము

78. సంవత్ - సంవత్సరము

79. ఐషమః — ఈ యేఁడు

80. పరుత్ .... నిరుడు

81. పరారి .... మునేడు

82 ప్రాయః / ప్రాయేణ / ప్రాయశః } తఱుచు గా

83 నితరామ్ .... మిక్కిలి

84. సుతరామ్ / నికామమ్ } బొత్తిగా

85 మనాక్ / ఈషత్ / కించిత్ } కొంచెము

86. తూష్ణీమ్, జోషమ్ — ఊరక

87. సామి, అర్ధమ్ — సగము

88. అలమ్, కృతమ్ — చాలు, వద్దు

89. తిరః, తిర్యక్, సాచి — అడ్డముగా

90. క్రమేణ, క్రమాత్, క్రమశః — వరుసగా

91. ఆరభ్య, ఆదాయ, ప్రభృతి — మొదలు కొని

92. అపేక్ష్య, అపేక్షయా — కంటె, ఎంచి, చూచి

93. ఆహృత్య, సంహృత్య — కలుపు కొని, వెరసి

94. సుఖమ్, లఘు — సులువుగా

95. దుఃఖమ్, కష్టమ్, కృచ్ఛ్రమ్ — కష్టముగా

96. స్థానే — యుక్తము

97. వరమ్ — మేలు

98. స్వస్తి — మంచిది

99. అపూర్వమ్, అభినవమ్ — క్రొత్తగా

100. విస్పష్టమ్, స్పష్టమ్, స్ఫుటమ్, ప్రస్ఫుటమ్ — స్పష్టముగా

101. సమగ్రమ్, సాగ్రమ్, అశేషమ్, నిశ్శేషమ్, నిరవశేషమ్, సంపూర్ణమ్, పూర్ణమ్, అఖిలమ్, నిఖిలమ్, సకలమ్, సర్వమ్, ఏకాంతతః — సంపూర్ణముగా

102. అర్థే, అర్థమ్, కృతే, హేతోః, కారణాత్ — కొఱకు, నిమిత్తముగా

అవ్యయములు రెండు మూడు చేరి సంశ్లిష్టములగును.

అవి విశేషార్థములందు వర్తించు చుండును.

1. నహి — కానేకాదు
   నైవ — కాదుగదా
2. నచేత్ — } కానిచో
   నోచేత్ — } లేనిచో
3. పరంతు } కాని
   అపితు }
   కింతు } అయినను
4. ప్రత్యుత — మీదుమిక్కిలి
   పైగా
   దానికితోడు
5. కిముత } ఏమనిచెప్పవలె
   కింపునః }
6. అపిచ } మఱియును
   కించ } అంతేకాక
7. యథాహి — ఎట్లనగా
8. తథాహి — అదిఅట్లే
9. కిమితి — ఎందుకని
   ఏమిటని
10. అపిచేత్ — అయినప్పటికిని
11. అపినామ - జరిగినబాగుండును
12. మానామ — జరుగకున్న బాగుండును.
13. అథకిమ్ — మరేమి, అవును
14. ఇతస్తతః — ఇటు అటు
15. కింవా — లేదా
16. అద్యాపి } అయినను
    యద్యపి }
17. నకేవలమ్ — అంతమాత్రమే కాదు.
18. కథమ్నామ } ఎట్లని
    కథమివ }

ఇత్యాదులను ఊహించుకొనవలెను.

ప్రతిపదోక్తములందును, అవ్యయములే కాక అవ్యయములుగా ప్రయుక్తములగుచున్న కొన్ని నామములు, విశేషణములును కూడ చేర్పబడియున్నవి. వానిని గుర్తించునది.

ఇది

అవ్యయ ప్రకరణము

---

# 6. సాధ్య శబ్దములు

## Derivatives

శబ్దములన్ని సిద్ధములని సాధ్యములని రెండు విధములు, ఇతర శబ్దములనుండి జన్మింపక సహజముగా నేర్పడి యుండునవి సిద్ధములు.

ఉ॥ వృక్షః — లతా — ఫలమ్. మొ॥

నామ విశేషణ ధాత్వాదులనుండి జనించునవి సాధ్యములు.

ఉ॥ దశరథ — దాశరథిః
మధుర — మాధుర్యమ్
కృ — కరణమ్ — ఇత్యాదులు.

ఇట్టి సాధ్య శబ్దములను సాధించు ప్రకారములను కొంతవఱకు ప్రతిపాదించెదను — పరిశీలించునది___.

### 1. ధాతు జన్యములు.

(భావార్థము.)

**(Gerund.)**

| | | | | |
|---|---|---|---|---|
| కృ | + | అన ........... | కరణ | చేయుట |
| ,, | + | క్తిన్ ............ | కృతి | చేఁత. |
| ,, | + | ఘఞ్ ............ | కర, కార | (Doing or Deed) |
| ,, | + | అ ............ | క్రియా | అని అర్థము. |
| ,, | + | క్త ......... | కృత | |
| ,, | + | త్యా ........... | కృత్యా | |
| ,, | + | అనా ......... | కారణా | |
| ,, | + | ఇకా .... ....... | కారికా | |

క్త — వాస్తవమునకు ఇది భూతకాలిక కర్మార్థ ధాతుజ విశేషణము. కాని ఇది విశేషణార్థమందేకాక కొన్ని యెడల భావార్థమందును వాడబడు చున్నది—.

### ఇచ్ఛారూప భావార్థము

కృ + సన్ – చికీర్షా. (కర్తుమ్ ఇచ్ఛా)

‘ చేయవలెనను కోరిక ’ అని దీని కర్థము.

ఇట్లు భోక్తు మిచ్ఛా (బుభుక్షా) - గంతుమిచ్ఛా (జిగమిషా) - పాతుమిచ్ఛా (పిపాసా) రంతుమిచ్ఛా (రిరంసా) అని అన్ని ధాతువులకును ఇచ్ఛాద్యోతక భావార్థమందు రూపము లేర్పడును. ఇదిగాక ధాతువులనుండి ఇచ్ఛాద్యోతక కర్తృరూప మొకటియు క్రియారూప మొకటియు, ఏర్పడఁగలవు. వానిని తరువాత ప్రదర్శించెదను.

### (కర్త్రర్థము.)
### *(Subjective)*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృ | + | తృచ్ | .... | కర్తృ | చేయునట్టి |
| ,, | + | అక | .... | కారక | |
| ,, | + | ఇన్ | .... | కారిన్ | |
| ,, | + | ఘఞ్ | ... | కర—కార | |
| ,, | + | క్విప్ | ... | కృత్ | |
| ,, | + | క్వనిప్ | .... | కృత్వన్ | |
| ,, | + | తుకామ | ... | కర్తుకామ | చేయఁగోరునట్టి |
| ,, | + | తుమనస్ | .... | కర్తుమనస్ | |
| ,, | + | వస్ | .... | చక్రివస్* | చేసినట్టి |

* ఇట్టి వస్వంత శబ్దములు అన్ని ధాతువులనుండియు ఏర్పడుచుండును. ఇవి క్తవదంతముల అర్థమునందు వాడఁబడును. ఉ కృతవత్ - చక్రివస్.

కృ + ఇష్ణుచ్ ... కరిష్ణు — చేయుస్వభావముగల అని అర్థములు

ఇచ్ఛారూప కర్త్రర్థము

కృ + స .... చికీర్షు (కర్తుమ్ ఇచ్ఛు)

'చేయఁగోరు నట్టి' అని అర్థము.

ఇట్లు బుభుక్షు, పిపాసు మొ॥ గ్రాహ్యములు.

(కర్మార్థము) (**Objective**)

| | | | | |
|---|---|---|---|---|
| కృ | + | య ........ | కార్య | చేయఁదగిన |
| ,, | + | త్య ...... | కృత్య | చేయవలసిన |
| ,, | + | తవ్య ........ | కర్తవ్య | |
| ,, | + | నీయ .... .. | కరణీయ | |

కృ + ఖల్ ........ { సుకర ...... చేయశక్యము. దుష్కర ...... చేయనశక్యము.

(సమాపక క్రియార్థము) (**Finite**)

ఇచ్ఛాద్యోతకము

పఠ్ ....... పిపఠిషతి ....... 'చదువఁగోరు చున్నాడు' అని అర్థము.

పఠ్ + యఙ్ — పాపఠ్యతే / పాపఠీతి } ఇందొకట ఆత్మనేపద రూపము. ఒకటి పరస్మైపదరూపము, ఇవి రెండును పౌనః పున్యార్థమునను అతిశయార్థము నను వచ్చును.

'చికీర్షా – చికీర్షు – చికీర్షతి' – వీని మూటికిని సన్నంత రూపములని పేరు. వీని నన్ని ధాతువుల నుండి పూర్వోక్త ప్రకారమున సాధించు కొననగును.

## 2. నామ ధాతు జన్యములు

క్రియలు ధాతువులనుండియె కాక నామధాతువుల నుండియు నిష్పన్నములగును.

తిలక — తిలకతి — (పరస్మైపద)
తిలకాయతే - (ఆత్మనే)
మకుట — మకుటతి ,,
మకుటాయతే ,, ఇత్యాదులు.

## 3. నామ విశేషణ జన్యములు

(భావార్థము)

త్వ ... రామత్వ
,, .... మధురత్వ
తల్ .... రామతా
,, .... మధురతా
య .. మాధుర్య
ఇమనిచ్ ... మధురిమన్
ష్యఞ్ .... మాధురీ

రాముని తనము తీయదనము అని అర్థములు.

(కర్త్రర్థము)

మానిన్ ... పండిత మానిన్
మన్య ... పండితమ్మన్య

బ్రువ .... పండితబ్రువ
భరి .... ఆత్మంభరి, కుటుంభరి
భవిష్ణు ... ఆఢ్యంభవిష్ణు
భావుక .... సుభగంభావుక.

## అపత్యాది సంబంధార్థము

అ ... శైవ – వైష్ణవ – పౌత్ర – దౌహిత్ర
ఇ ... దాశరథి — వాల్మీకి, ద్రౌణి
ఏయ .... కౌంతేయ – వైనతేయ
ఆయన ... కాత్యాయన – దాక్షాయణ
య ... గార్గ్య – పాండ్య – దైత్య
ఇక .... రైవతిక – ఇత్యాదులు.

## కేవల సంబంధార్థము.

అ .... చాక్షుష – వైణవ - శారీర క్షౌమ.
ఈయ ... శాస్త్రీయ, భారతీయ స్వకీయ
మదీయ - తదీయ పరకీయ
ఏయ ... నాదేయ – పార్వతేయ
అక .... శారీరక, నాగరక
ఇక .... వాసంతిక, ప్రాసంగిక
ఆధ్యాత్మిక, ఆధిభౌతిక
య ... కంఠ్య. దంత్య పథ్య. ధర్మ్య
క .... శిక్షక, మీమాంసక
మామక, తావక
ఈన .... ప్రాచీన, నవీన
మామకీన. తావకీన
తన .... సాయంతన – చిరంతన
చరట్ .... శ్రుతచర – దృష్టచర
చణప్ .... యాత్రాచణ – విద్యాచణ
చుంచుప్ ... యాత్రాచుంచు – విద్యాచుంచు.

## పరిమాణార్థము

| | | |
|---|---|---|
| మాత్రచ్ | .... | కటిమాత్ర, జానుమాత్ర |
| ద్వయసచ్ | ... | ఊరుద్వయస, కటిద్వయస |
| దఘ్నచ్ | ... | కంఠదఘ్న, జానుదఘ్న |

## సమూహార్థము.

| | | |
|---|---|---|
| అ | .... | కౌక, బాక, గార్భిణ<br>యౌవత, యౌవన, సైన్య, పౌంస్న |
| ఈయ | .... | అశ్వీయ |
| ఏయ | ... | కాపేయ - జ్ఞాతేయ |
| కప్ | .... | వాత్సక, రాజన్యక<br>మానుష్యక |
| ఇక | ... | హాస్తిక |
| య | .... | బ్రాహ్మణ్య, కైశ్య<br>కైదార్య, గాణిక్య |
| తల్ | ... | జనతా, గ్రామతా<br>గజతా, బంధుతా |
| త్రల్ | ... | గోత్రా |
| కట్యా | .... | రథ కట్యా |
| య | .... | ధూమ్యా, వాత్యా. |

## సామ్యార్థము

| | | |
|---|---|---|
| కప్ | .... | అశ్వక, భ్రమరక |
| ప్రాయ | ... | జలప్రాయ, జనప్రాయ |
| కల్పప్ | ... | గతకల్ప, మృతకల్ప |
| భూత | .... | రామభూత - భస్మీభూత |
| రూపప్ | ... | యుక్తరూప - పండిత రూప |

| | | |
|---|---|---|
| దేశ్య | .... | పంచవర్గ దేశ్య |
| ...శీయర్ | .... | ,, ,, దేశీయ |
| ...తీయర్ | .... | ,, ,, జాతీయ |

## మతుబాద్యర్థములు

| | | |
|---|---|---|
| మత్ | ... | ధీమత్ - బుద్ధిమత్ |
| వత్ | ... | గుణవత్ - ధనవత్ |
| ...ని | ... | ధనిన్, మానిన్ |
| ...విన్ | ... | మేధావిన్, తేజస్విన్ |
| ...క | ... | నావిక, ధనిక, మాయిక |
| ...లిన్ | ... | గోశాలిన్, అశ్వశాలిన్, గుణశాలిన్ ధనశాలిన్. |
| ...లచ్ | ... | పంకిల, సుగంధిల |
| ...లచ్ | ... | జంఘాల, జటాల |
| ...లచ్ | .... | శిఖావల, కృషీవల |
| ...లుచ్ | .... | శీతాలు, దయాలు |
| ...తచ్ | .... | తారకిత, కోరకిత |
| ...మయట్ | ... | తృణమయ, గుణమయ |

ఇట్లు ప్రసిద్ధములైన వానిని కొన్నింటిని మాత్రమునాహరిం ...చితిని. తక్కిన వానిని సైతము పాఠకులు ప్రయోగముల వలన గ్రహించుచు పోవలెను.

## సాధ్య శబ్దములు — లింగ నిర్దేశము.

ఇంత వఱకును సాధ్యములకెల్ల ప్రాతిపదిక రూపములను మాత్రమే నిర్దేశించితిని. ఇఁక వాని కన్ని లింగములందును వచ్చు విభక్త్యంత రూపములను నిర్దేశింప వలసియున్నది.

అందు భావార్థములను, సమూహార్థకములును నియత లింగములై యుండును.

భావార్థకములు

కరణమ్ — నపుం (ఫల)
కృతిః — స్త్రీ (మతి)
కరః — కారః — పుం (రామ)
కృతమ్ — నపుం (ఫల)
క్రియా, కృత్యా, కారణా, కారికా, చికీర్షా — స్త్రీ (రమా)
మధురత్వమ్, మాధుర్యమ్, పాటవమ్ — నపుం (ఫల)
మాధురీ — స్త్రీ (నదీ)
మధురిమా — పుం (సుత్రామన్)

సమూహార్థకములు

అకారాంతములు, బ్రాహ్మణ్యమ్ నపుం — (ఫల)
ఆకారాంతములు, బంధుతా — స్త్రీ — (రమా)

ఇక తక్కినవి మూఁడు లింగములందును వర్తించుచు రూప భేదము గలిగి యుండును. అందు ప్రసిద్ధములైన వాని కన్నిటికిని త్రిలింగము లందును ప్రథమైక వచనాంత రూపముల మాత్రముదాహరించెదను - తక్కిన వాని నూహించునది.

| | | | పుం | స్త్రీ | నపుం |
|---|---|---|---|---|---|
| 1. | తృచ్ | — | కర్తా | కర్త్రీ | కర్తృ |
| 2. | అక | — | కారకః | కారికా | కారకమ్ |
| 3. | ఇన్ | — | కారీ | కారిణీ / కారిణి | కారి |
| 4. | ఘఞ్ | — | కరః / కారః | కరా / కరీ ; కారా / కారీ | కరమ్ / కారమ్ |
| 5. | క్విప్ | — | కృత్ | కృత్ | కృత్ |
| 6. | క్వనిప్ | — | కృత్వా | కృత్వరీ | కృత్వ |
| 7. | తుమనస్ | — | కర్తుమనాః | కర్తుమనాః | కర్తుమనః |
| 8. | తుకామ | — | కర్తుకామః | కర్తుకామా | కర్తుకామమ్ |
| 9. | ఇష్ణుచ్ | — | కరిష్ణుః | కరిష్ణుః | కరిష్ణు |
| 10. | వస్ | — | చకృవాన్ | చకృషీ | చకృవః |
| 11. | సు | — | చికీర్షుః | చికీర్షుః | చికీర్షు |

---

## కర్మార్థమున వచ్చు కర్తవ్యాది శబ్దములు

పుం. స్త్రీ నపుంసకములందు వరుసగా 'రామ', 'రమా' 'ఫల' శబ్దములను పోలియుండును,

తెల్పిన అర్థము లందలివి—

| | | పుం | స్త్రీ | నపుం |
|---|---|---|---|---|
| 1. | అ | శైవః | శైవీ | శైవమ్ |
| 2. | ఈయ | మదీయః | మదీయా | మదీయమ్ |
| 3. | ఏయ | నాదేయః | నాదేయీ | నాదేయమ్ |
| 4. | ఆయన | వాత్స్యాయనః | వాత్స్యాయనీ | వాత్స్యాయనమ్ |

| | | పుం. | స్త్రీ. | నపుం. |
|---|---|---|---|---|
| 5. | అక | నాగరకః | నాగరికా | నాగరకమ్ |
| 6. | ఇక | దైవికః | దైవికీ | దైవికమ్ |
| 7. | మత్ | ధీమాన్ | ధీమతీ | ధీమత్ |
| 8. | వత్ | గుణవాన్ | గుణవతీ | గుణవత్ |
| 9. | ఇన్ | రాగీ | రాగిణీ | రాగి |
| 10. | విన్ | యశస్వీ | యశస్వినీ | యశస్వి |
| 11. | శాలిన్ | భాగ్యశాలీ | భాగ్యశాలినీ | భాగ్యశాలి |
| 12. | ఇతచ్ | తారకితః | తారకితా | తారకితమ్ |
| 13. | మయట్ | తమోమయః | తమోమయీ | తమోమయమ్ |
| 14. | ప్రాయ | తృణప్రాయః | తృణప్రాయా | తృణప్రాయమ్ |
| 15. | కల్పప్ | మృతకల్పః | మృతకల్పా | మృతకల్పమ్ |
| 16 | దేశ్య | పంచవర్ష దేశ్యః | — దేశ్యా | — దేశ్యమ్ |
| 17. | భూత | రజోభూతః | రజోభూతా | రజోభూతమ్ |
| 18. | చణప్ | యాత్రాచణః | యాత్రాచణా | యాత్రాచణమ్ |
| 19. | దఘ్నచ్ | ఊరుదఘ్నః | ఊరుదఘ్నీ | ఊరుదఘ్నమ్ |
| 20. | ద్వయసచ్ | కటిద్వయసః | కటిద్వయసీ | కటిద్వయసమ్ |
| 21. | మాత్రచ్ | జానుమాత్రః | జానుమాత్రీ | జానుమాత్రమ్ |
| 22. | తన | సాయంతనః | సాయంతనీ | సాయంతనమ్ |
| 23. | చరట్ | శ్రుతచరః | శ్రుతచరీ | శ్రుతచరమ్ |
| 24. | నఞ్ | పౌంస్నః | పౌంస్నీ | పౌంస్నమ్ |

ఇత్యాదులు.

ఇది

సాధ్య శబ్ద ప్రకరణము.

---

# 7. సమాసములు

## Compounds

శబ్దములన్ని వ్యస్తములని సమస్తములని మరల రెండు విధములు. పృథగ్భూతములగు శబ్దములు (Separate or Single words) వ్యస్తములు. ఏకీభూతములగునవి (Double or Compound) సమస్తములు. వీనికే సమాసములని నామాంతరము.

ఉ॥ నీలమ్ — ఉత్పలమ్ — ఇవి వ్యస్తపదములు.

నీలోత్పలమ్ — ఇది సమస్తము

దీనిని బట్టి సంస్కృతమునగల శబ్దములు చాలవఱకు వ్యస్తములు గను సమస్తములు గను కూడ ప్రయోగించుటకు శక్యమగునని తాత్పర్యము. ఇట్టి *సమాసములు సంస్కృతమున ప్రధానముగా ఆఱు జాతులు. వానినెల్ల క్రింద నుదాహరించెదను. పరిశీలించునది.

## 1 తత్పురుషము.

ఇది ఎనిమిది విధముల నొప్పుచున్నది.

1. ప్రథమాతత్పురుష — పూర్వకాయమ్ — పూర్వమ్ కాయస్య
2. ద్వితీయా ,, — మోక్షజిజ్ఞాసుః — మోక్షమ్ జిజ్ఞాసుః
   ఖట్వారూఢః — ఖట్వామారూఢః

* సమాసమునందు కడపట ప్రయుక్తమైన శబ్దముననే లింగ విభక్తి వచనము లేర్పడును. దానిని బట్టియే సమాసమునకు విభక్త్యంత రూపములు సాధించుకో వలెను.

ఉ॥ రామః — గుణాఢ్యరామః మొ॥

3. తృతీయాతత్పురుష — విద్యానిపుణః — విద్యయా నిపుణః

— వాక్కలహః — వాగ్భిః కలహః

4. చతుర్థీ ,, — భూతబలిః — భూతేభ్యః బలిః

ప్రజాహితమ్ — ప్రజాభ్యః హితమ్

5. పంచమీ ,, — చోరభయమ్ — చోరాత్ భయమ్

తరుపతితః — తరోః పతితః

6. షష్ఠీ ,, — రాజభటః — రాజ్ఞః భటః

దేవపూజా — దేవస్యపూజా

7. సప్తమీ ,, — ఈశ్వరాధీనమ్ — ఈశ్వరే అధీనమ్

ఆతపశుష్కమ్ — ఆతపే శుష్కమ్

8. నఞ్ ,, — అబ్రాహ్మణః — నబ్రాహ్మణః

అజ్ఞానమ్ — నజ్ఞానమ్

---

## II కర్మధారయము

ఇది ఏడు విధములు.

1. విశేషణ పూర్వము { నీలోత్పలమ్ — నీలమ్‌చ తదుత్పలమ్‌చ

శ్వేతాశ్వః — శ్వేతశ్చాసౌ అశ్వశ్చ

2. విశేష్య పూర్వము:— నరాధమః — అధమోనరః

కిరాట ధూర్తః — ధూర్తః కిరాటః

3. విశేషణోభయము:— శీతోష్ణమ్ — శీతమ్ చతదుష్ణమ్‌చ

శుక్తోజ్ఝితమ్ — శుక్తంచ తదుజ్ఝితంచ

4. ఉపమానోత్తరము:— పురుష వ్యాఘ్రః — పురుషః వ్యాఘ్రః ఇవ

కపికుంజరః — కపిః కుంజరః ఇవ

5. ఉపమాన పూర్వము:— ద్రాక్షామధురమ్ — ద్రాక్షేవ మధురమ్
లతాతన్వీ — లతేవతన్వీ

6. సంభావనా పూర్వము:- తమాలవృక్షః — తమాలః ఇతి వృక్షః
వింధ్య పర్వతః — వింధ్యః ఇతి పర్వతః

7. అవధారణ పూర్వము:— వినయ ధనమ్ — వినయః ఏవధనమ్
కీర్తిహంసీ — కీర్తి రేవ హంసీ
పరాక్రమానలః — పరాక్రమ ఏవ అనలః

## III ద్విగువు

ఇది రెండు విధములు.

1. ఏకవద్భావి:— పంచవటీ — పంచానామ్ వటానామ్ సమాహారః
2. అనేకవద్భావి:— షాణ్మాతురః — షణ్ణామ్ మాతౄణామ్ అపత్యమ్ పుమాన్

## IV బహువ్రీహి

ఇది ఏడు విధములు.

1. ద్విపదము — ప్రాప్తధనః — ప్రాప్తమ్ ధనమ్ యేన సః
దత్తపుస్తకః — దత్తమ్ పుస్తకమ్ యస్మైసః

2. బహుపదము — నీలోజ్జ్వలకాయః- నీలముజ్జ్వలంచ కాయం యస్యసః

3. సంఖ్యోభయపదము — ద్విత్రాః — ద్వౌవా త్రయోవా
పంచషాః — పంచ షడ్వా

4. సహపూర్వపదము — సపుత్రః — సహపుత్రేణ వర్తమానః
సబాంధవః — సహబాంధవైః వర్తమానః

5. దిగంతరాళ లక్షణము — ఉత్తరపూర్వా / దక్షిణోత్తరా } —

6. వ్యతిహార లక్షణము — బాహాబాహవి / కచాకచి / ముష్టిముష్టి / తలాతలి / కేశాకేశి } బాహుభి ర్బాహుభిశ్చ గృహీ త్వేదమ్ ప్రవృత్తమ్ యుద్ధమ్-ఇత్యాది

7. సంఖ్యోత్తర పదము — ఉపదశాః / ఉపైకాదశాః } దశానామ్ సమీపే వర్తంతే ఇత్యాది.

## V అవ్యయీభావము

1. అవ్యయ పూర్వము:— ప్రత్యహమ్ — అహన్యహని
   యథాలాభమ్— లాభమనతిక్రమ్య

2. నామపూర్వము:— సూపప్రతి / శాకప్రతి } సూపస్య లేశః ఇతి

## VI ద్వంద్వము

ఇది నాల్గు విధములు

1. ద్విపదేతరేతర యోగము:— కంసరావణౌ — కంసశ్చ రావణశ్చ
2. బహుపదేతరేతర ,, వాపీకూపతడాగాః — వాపీచకూపంచ తడాగశ్చ
4. ద్విపద సమాహారము — సుఖదుఃఖమ్ — సుఖదుఃఖయోః సమాహారః
   అహినకులమ్ — అహినకులయోః ,,
   పాణిపాదమ్ — పాణిపాదయోః ,,

బహుపద ,, వీణావేణుశంఖకాహళమ్ - ఏతేషామ్ ,,

## మఱికొన్ని విలక్షణ సమాసములు

1. అలుక్ — కంఠేకాలః — కంఠే కాలమ్ యస్య
   పశ్యతోహరః — పశ్యత ఏవ హరతీతి
2. గతి — సాక్షాత్కృత్య — సాక్షాత్ కృత్వా
   ఊరీకృత్య — ఊరీ కృత్వా
3. నిత్య — కుంభకారః — కుంభమ్ కరోతీతి
   కాంచనసన్నిభః — కాంచనేన తుల్యమితి
   వాగర్థావివ — వాగర్థయో రుపమితావితి
4. అసమర్థ — శివభాగవతః — భగవతిభక్తః భాగవతః
   శివేభాగవతః - ఇతి
   అరిషడ్వర్గః — షణ్ణామ్ వర్గః — షడ్వర్గః
   అరీణామ్ షడ్వర్గః - ఇతి
   అసూర్యమ్పశ్యా — సూర్యమ్ పశ్యతీతి
   సూర్యమ్ పశ్యా
   సా నభవతీతి ఇత్యాదులు.

ఇది

సమాసాధికరణము

---

# 8. సంధులు

## Combinations

శబ్ద స్వరూపమును నిరూపించిన అనంతరము వానికి సంబంధించిన సంధులను కూడ నిరూపింప వలసి యున్నది. పూర్వ శబ్దము కడపటి అక్షరమునకును ఉత్తర శబ్దము మొదటి అక్షరమునకును ఏర్పడు కలయికయే *సంధి ఇట్టి సంధులను నాల్గు విధములుగ విభజింప వచ్చును.

1. అచ్చు + అచ్చు. 2. అచ్చు + హల్లు. 3. హల్లు + హల్లు
4. హల్లు + అచ్చు.

### 1. అచ్చు + అచ్చు

1. అ. ఆ + అ ఆ — ఆ. మమ + అగ్రజః — మమాగ్రజః
ఇహ + ఆగచ్ఛతి — ఇహాగచ్ఛతి
" " + ఇ ఈ — ఏ. తవ + ఇచ్ఛా ........ తవేచ్ఛా
యథా + ఈప్సితమ్ — యథేప్సితమ్
" " + ఉ ఊ — ఓ. బాలస్య + ఉత్సాహః .... బాలస్యోత్సాహః
మయా + ఊరీకృతమ్ .... మయోరీకృతమ్
" " + ఋ — అర్ / అఋ } వసంత + ఋతుః { వసంతర్తుః / వసంత ఋతుః
" " + ఏ ఐ — ఐ తత్ర + ఏకదా ... తత్రైకదా
మహా + ఐశ్వర్యమ్ ... మహైశ్వర్యమ్

---

* సంధి సంస్కృతమున శబ్దములందును, సమాసములందును నిత్యము, వాక్యములందు వైకల్పికము.

అ.ఆ + ఓ.ఔ — ఔ — జీర్ణ + ఓతుః .... జీర్ణౌతుః
మహా + ఔషధమ్ .... మహౌషధమ్

2. ఇ.ఈ + ఇ.ఈ — ఈ ... కవి + ఈశ్వరః ... కవీశ్వరః
మయి + ఇత్థమ్ .... మయీత్థమ్

" " + అ.ఆ / ఉ.ఊ.ఋ / ఏ.ఓ.ఐ.ఔ } —య్ అతి + అధికమ్ అత్యధికమ్
జగతి + ఉన్నతిః జగత్యున్నతిః
ప్రతి + అయాతః ప్రత్యాయాతః

3. ఉ.ఊ + ఉ.ఊ — ఊ గురు + ఉత్తమః గురూత్తమః

" " + అ.ఆ / ఇ.ఈ.ఋ / ఏ.ఓ / ఐ.ఔ } — వ్
కురు + ఏతత్ కుర్వేతత్
మధు + అస్తి మధ్వస్తి
సాధు + ఇచ్ఛతి సాధ్విచ్ఛతి
అను + అభవత్ అన్వభవత్
విష్ణు + ఆలయః విష్ణ్వాలయః

4. ఋ + ఋ — ౠ — పితృ + ఋణః పితౄణః

" + అ.ఆ / ఇ.ఈ / ఉ.ఊ / ఏ.ఓ / ఐ.ఔ } — ర్
దుహితృ + ఆనందః దుహిత్రానందః
మాతృ + ఐశ్వర్యమ్ మాత్రైశ్వర్యమ్

5. ఏ.ఓ + 'అ'లోపము — హరే + అవ .... హరేవ
విష్ణో + అవ .... విష్ణోవ

6. ఏ.ఓ + ఐ.ఔ + అచ్చు — అయ్.అవ్ / ఆయ్.ఆవ్ } వాగర్థౌ + ఇవ-వాగర్థావివ

అయ్ మొ॥ వాని యకారవకారములకు పదాంతమున లోపము రావచ్చును. } మన్యతే + ఇతి — మన్యత ఇతి

7. గో + అచ్చు — గవ్ — గో[illegible]ంద్రః

8. ద్వివచనములగు ఈ ఊ ఏ + అచ్చు — సంధి లేదు
హరీ + ఏతౌ — హరీ ఏతౌ
విష్ణూ + ఇవ — విష్ణూ ఇవ

## 2 అచ్చు + హల్లు

వీనికి ఎప్పుడును సంధి రాదు. ఇందులకు ఒకటి మాత్ర మపవాదము గలదు.

1. అ.ఇ.ఉ.ఋ + ఛ = చ్ఛ - తరు + ఛాయా - తరుచ్ఛాయా
దేవా + ఛవిః — దేవాచ్ఛవిః
ఇత్యాది.

## 3 హల్లు + అచ్చు

1. క్ + అచ్చు — గ్ — వాక్ + ఈశః .... వాగీశః
త్వక్ + అస్థి .... త్వగస్థి
2. చ్ + ,, — జ్— అచ్ + అంతమ్ ... అజంతమ్
3. ట్ + ,, — డ్— సమ్రాట్ + ఆయాతి ... సమ్రాడాయాతి
4. త్ + ,, — ద్— పతత్ + అర్పయ ... పతదర్పయ
5. ప్ + ,, — బ్— కకుప్ + అంతః ... కకుబంతః
6. దీర్ఘ పూర్వకన్ + అచ్చు — మార్పు లేదు.
విద్వాన్ + ఏవ .... విద్వానేవ
గురూన్ + ఇవ ... గురూనివ
7. హ్రస్వపూర్వకన్ + అచ్చు—న్న....తస్మిన్ + అద్రౌ + తస్మిన్నద్రౌ
చరన్ + అసౌ చరన్నసౌ
8. మ్ + అచ్చు—మార్పులేదు రామమ్ + ఏవ .... రామమేవ
దైవమ్ + ఇతి .... దైవమితి

## 4. హల్లు + హల్లు

1. క్ + కఖ చఛ టఠ తథ పఫ శషస } మార్పు లేదు
సమ్యక్ + చాతుర్యమ్ } సమ్యక్చాతుర్యమ్
వాక్ + పాండిత్యమ్ } వాక్పాండిత్యమ్

క్ + గఘ జఝ డఢ దధ బభ యరలవ } గకారము వచ్చును. త్వక్ + వేదనా త్వగ్వేదనా
భిషక్ + గర్వః - భిషగ్గర్వః

క్ + న — గ్న, క్న — వాక్ + నైపుణి - వాగ్నైపుణి వాక్నైపుణి

క్ + మ — గ్మ, క్మ ,, + మాధురీ - వాగ్మాధురీ వాక్మాధురీ

మాత్ర, మయ అనునవి పరమగు నపుడు 'ఙ' కారము మాత్రమే వచ్చును. వాఙ్మాత్ర, వాఙ్మయ.

క్ + శ — క్ఛ — క్శ — వాక్ + శాసనమ్ వాక్ఛాసనమ్ } వాక్శాసనమ్

క్ + హ — గ్హ, గ్ఘ — ఋక్ + హోతా.
ఋగ్హోతా } ఋగ్ఘోతా

2. ట్ + కఖ చఛ టఠ తథ పఫ శషస } మార్పు లేదు. రాట్కంఠీరవః } [illegible]

,, + గఘ జఝ డఢ దధ బభ యరలవ } డకారము వచ్చును. [illegible] } ద్విడ్వరమ్

,, + న — ణ్న, ట్న — రాణ్నీతిః రాట్నీతిః

,, + మ — ణ్మ — డ్మ — రాణ్మండలమ్, రాడ్మండలమ్

,, + శ — ట్ఛ, ట్శ — రాట్ఛాసనమ్, రాట్శాసనమ్

,, + హ — డ్హ, డ్ఢ — రాడ్హంతా, రాడ్ఢంతా

3. త్ + కఖతథ పఫపస } మార్పులేదు. మరుత్కాంతాః, జగత్సుందరీ

,, + చఛటఠజఝ డఢదధ } ద్విత్వము. జగజ్జాలమ్. మహాసజ్జవమ్ గరుచ్ఛలనమ్, బృహట్టక్కురకః

,, + గఘజబభ యరవ } దకారము వచ్చును జగద్బాంధవః మహాద్యానమ్

,, + న—ద్న, న్న—జగద్నాటకమ్. జగన్నాటకమ్

,, + మ—ద్మ న్మ—భగవద్మాయా. భగవన్మాయా

మాత్రమయలకు అపవాదము. చిన్మాత్రమ్. మృన్మయః

,, + శ—చ్ఛ—మరుత్ + శాపః—మరుచ్ఛాపః

,, + ల—ల్ల—జగత్ + లయః — జగల్లయః

,, + హ—ద్హ—ద్ధ—జగత్ + హితమ్ — జగద్హితమ్. జగద్ధితమ్

4. ప్ + కఖచఛటఠతథపఫషస } మార్పు లేదు అప్సేచనః కకుప్చక్రమ్

,, + గఘజఝడఢదధనబభయరలవ } బకారము వచ్చును అబ్జాలిః కకుబ్ధాటి

,, + మ — మ్మ అమ్మాంసమ్

,, + శ —ప్శ, ప్ఛ అప్శైత్యమ్. అప్ఛైత్యమ్

,, + హ —బ్హ, బ్భ అబ్హరణమ్ అబ్భరణమ్

5. మ్ + హల్లు — మ్, ం హరిమ్వందే హరిం వందే

,, + కవర్గ — ఙ్ .... కార్యఙ్కరోతి

,, + చవర్గ — ఞ్ .... కరఞ్చాలయతి

,, + టవర్గ — ణ్ .... మిత్రణ్ఢౌకతే

,, + తవర్గ — న్ ... కామన్త్యజతి

,, + పవర్గ — మ్ .... రాజ్యమ్పాలయతి

'ఏషః' 'సః' అను రెంటికిని ఇదివర్తింపదు. వానికి విసర్గ మాత్రమె లోపించును.

ఏష గచ్ఛతి స వదాలి.

మఱియును పునః ప్రాతః మొదలగు అవ్యయములకును కొన్నిటికి ఇదివర్తింపదు. వానికి విసర్గము లోపించి రేఫము వచ్చును. పునర్గచ్ఛతి ప్రాతర్నమతి.

3. అః + గఘఙ డఢ జఝ
దధన బభమ యలర
లవ హ } విసర్గ లోపము — అశ్వా గచ్ఛంతి
శలా ధావంతే

4. ఆః ఈః ఉః ఊః
ఏః ఓః ఐః ఔః } + కఖపఫ — మార్పు లేదు. హరిః పశ్యతి గురుః క్రోశతి

" " + చఛశ — శ గురుశ్చరతి శిష్యశ్శృణోతి
" " + టఠష — ష గురుష్టీకతే ధనుష్టంకృతిః
" " + తథస — స హరేస్త్రాగః గురోస్తేజః
" " + గఘఙ
జఝ
డఢ
దధన
బభమ
యలవహ } రేఫము వచ్చును గిరేర్గుహా
సింహైర్జలమ్
గురుర్భ్రశ్యతే
జనైర్వంద్యతే
" " + ర — విసర్గలోపము
పూర్వస్వరము
నకు దీర్ఘము } పునా రమతే
హరీ రాజతే

ఇది

సంధి ప్రకరణము.

## శబ్దపరిచ్ఛేదము సమాప్తము.

---

# 1 సామాన్య లక్షణము.

## General Features

సంపూర్ణమైన అర్థమును ప్రతిపాదించునది వాక్యము. ఇది శబ్దముల సంఘటనమువలన ఏర్పడుచున్నది. వాక్యమునందు ప్రయోగింపబడు శబ్దముల కన్నిటికిని పరస్పరము అవినాభావ రూపమైన సంబంధముండవలయును. అది వాక్యము ద్వారా, శబ్దములకుగల వ్యాపారములపయి (Function) నాధారపడి యున్నది. కొన్ని భాషలయందీ సంబంధము శబ్దముల వ్యాపారములనేగాక వాని పౌర్వాపర్యమును (Order or Succession) కూడ ఆశ్రయించియుండును కాని సంస్కృత వాక్యనిర్మాణమునందుమాత్రము శబ్దముల కట్టి పౌర్వాపర్య నియమమంత కానరాదు. పూర్వమిది పరమిది అను నియమము నపేక్షింపక వాక్యమందెల్ల శబ్దములను యథేష్టముగా ప్రయోగింపవచ్చును. తన్మూలమున ప్రకృతార్థమునకు భంగము వాటిల్లుటగాని అప్రస్తుతమైన అర్థము స్ఫురించుటగాని సంభవింపదు. మీదుమిక్కిలి ప్రస్తుతార్థమున కొకప్పుడు పరిపుష్టియు కలుగవచ్చును. సంస్కృతము చాలవరకును ప్రత్యయాంతముగ (Inflexional) వ్యవస్థితమైన భాష యగుటచేత వాక్యమందే శబ్దము నెచ్చట వాడినను దాని అంతమందుగల ప్రత్యయమునుబట్టి తక్కిన శబ్దములతో దానికిగల సంబంధమును సులువుగా తెలిసికొనవచ్చును.

ఉ॥ రామః రాజ్యమ్ అకరోత్
రాజ్యమ్ అకరోద్రామః
అకరోద్రాజ్యమ్ రామః } రాముఁడు రాజ్యము చేసెను.

ఇత్యాదులు —

ఇట్లనేకవిధముల వాక్యమందలి పదములకుఁగల స్థానములను మార్చుచుఁ బోవచ్చును. కాని యిందులకు కొంత అపవాదము కలదు. ఇతి ఇవ మొదలగు శబ్దములను కొన్నింటిని ప్రయోగించునప్పుడు మాత్రము పౌర్వాపర్యమును తప్పక పాటింపవలయును.

ఉ॥ అయమ్ రామః ఇతి జానామి —

(ఇతఁడు రాముఁడని ఎఱుఁగుదును.)

రామః ఇవ భరతో పి ధార్మికః

(రామునివలె భరతుఁడును ధార్మికుఁడు )

పయి వాక్యములందు 'ఇతి' 'ఇవ' అను రెండు శబ్దముల స్థానములను ఎంతమాత్రముగాని మార్చుటకు వీలులేదు. వాక్య నిర్మాణము చెడిపోవును. వివక్షితమైన అర్థము స్ఫురింపదు. కాని యిట్టి అపవాదములు భాషయందత్యల్పములని చెప్పవచ్చును. అందుచేత సంస్కృత వాక్యనిర్మాణమునందు శబ్దముల సంబంధము వాని అనుక్రమమునుబట్టి కాక కేవలము తత్తద్వ్యాపారములఁబట్టి నిర్ణయించుటయే సమంజసము. సంస్కృతశబ్దముల కిట్టి వ్యాపారమూలకమైన సంబంధము మూఁడు విధముల వర్తించుచుండును.

1. కారక క్రియాసంబంధము
Nouns Pronouns × Verbs
2. విశేషణ విశేష్య సంబంధము
Adjectives × Nouns
3. అవ్యయ క్రియాసంబంధము
Adverbs × Verbs

## 1 కారక క్రియాసంబంధము.

నామములును, సర్వనామములును వాక్యములందుపయుక్తములగునప్పుడు కారకములని చెప్పఁబడుచున్నవి. కారకములు ఏడువిధములు. (Cases)

1 కర్త – 2. కర్మ – 3. కరణము – 4. సంప్రదానము – 6. అపాదానము – 6. శేషము - 7. అధికరణము.

ఇచ్చట సంబోధనమును ప్రథమగనే భావింపవలయును. ఈ ఏడింటికిని ప్రథమాదులైన విభక్తులేడును వరుసగా ప్రాప్తించును. అవి కారకములకును క్రియలకును గల సంబంధమును నిరూపించును. అందు ప్రథమా విభక్తి కర్త్రర్థకవాక్యములందు (Active) కర్తకును, కర్మార్థక వాక్యములందు (Passive) కర్మకును వచ్చును. అట్లు ప్రథమా విభక్త్యంతములైన కర్తృకర్మములకు "ఉద్దేశ్య"మని పేరు. వాక్యార్థమును ముగించు

సమాపక క్రియాపదమునకు "విధేయ"మని వ్యవహారము. ఉద్దేశ్య పదము వాక్యము నారంభించిన విధేయము, దానిని సమాప్తి బొందించును. ఇట్టి ఉద్దేశ్య విధేయములు వాక్య నిర్మాణమునకు అత్యావశ్యకములు. వీని రెంటికిని గల సంబంధమునందు కొన్ని ముఖ్యములైన నియమములను పాటింపవలసి యున్నది. అవి రెండు తెఱగులు.

## 1 పురుష నియమము.

### Agreement in Person

విధేయమునకుఁ గల పురుషము దాని ఉద్దేశ్యమును అనుసరించి ఉండవలెను.

| | | |
|---|---|---|
| ఉద్దేశ్యము – అస్మదర్థకమైన | – | ఉత్తమ పురుషమందును |
| ,, – యుష్మ ,, | – | మధ్యమ ,, |
| ,, అన్యార్థకమైన | – | ప్రథమ ,, |

విధేయము వర్తించును.

| | |
|---|---|
| ఉ॥ అహమ్ గచ్ఛామి | అహమ్ దృశ్యే |
| త్వమ్ గచ్ఛసి | త్వమ్ దృశ్యసే |
| రామః గచ్ఛతి | సః దృశ్యతే – ఇత్యాది – |

కాని 'భవత్' శబ్దమునకు మాత్రము పై సూత్రము వర్తింపదు. అది యుష్మదర్థకమైనను దాని విధేయమెప్పుడును ప్రథమ పురుషమునందే వర్తించును.

ఉ॥ భవాన్ కథమ్వర్తతే – భవతీ కుత్ర గచ్ఛతి.

ము॥

మఱియును అస్మద్యుష్మదన్యార్థకములైన శబ్దములు రెండును మూడును కలిసి వాక్యమందు ఉద్దేశ్యముగ ప్రయోగింపఁబడుటయు వానికి సముచ్చయార్థక శబ్దము కడపట చేరుటయు సంభవింపవచ్చును. అట్టి సందర్భమున అన్యముకంటె యుష్మదర్థకమును, దానికంటె అస్మదర్థకమును ప్రధానములుగా భావించి వానినిబట్టి పురుషమునందు మార్పు గావింపవలెను.

ఉ। త్వమహమ్ రామశ్చ పుస్తకమ్ పఠామః
త్వం తవ భ్రాతాచ ఏతదాచరతమ్. ఇత్యాది.

సముచ్చయార్థమునకు మాఱుగా వికల్పార్థము వచ్చి చేరినయెడల క్రియాపదమునకు సన్నిహితమైనదానినిబట్టి పురుషము పాటించును.

ఉ॥ రామో వా త్వం వా తత్కరిష్యసి
అహం వా భ్రాతా అనుజో వా తస్మై ప్రయతతే. ఇత్యాది.

## 2 వచన నియమము.

## Agreement in Number

వాక్యమునందు ఉద్దేశ్య విధేయముల వచనములు ఏకరూపముగ నుండవలయును.

ఉ। అశ్వః ఘాసమ్ చరతి
అశ్వౌ ,, చరతః
అశ్వాః ,, చరంతి

వ్యాధేన శరః క్షిప్యతే.
,, శరౌ క్షిప్యేతే.
,, శరాః క్షిప్యంతే

మొ॥

వచనమునకు సముచ్చయార్థ సంబంధమున కొన్ని విశేషములు గలవు.

రెండుమూడు నామములు ఉద్దేశ్యములుగా ప్రయుక్తములయి వానికి సముచ్చయార్థకముతోడి సంబంధమేర్పడి నపుడు వాని విధేయమునకు బహువచనమే రావలసియున్నను సన్నిహితమైన నామ మేకవచనమందున్నయెడల [illegible] మైన బహువచనమే కాక వాని కేకవచనముకూడ రావచ్చును.

ఉ॥ రామః సీతాలక్ష్మణశ్చ వన మగచ్ఛత్ (అగచ్ఛన్)
అహశ్చరాత్రిశ్చ ఉభే చ సంధ్యే.
ధర్మోపి జానాతి నరస్య వృత్తమ్ (జానంతి).
ఇత్యాదులు.

మఱి వికల్పార్థముతోడి సంబంధము కలిగి అన్ని నామములును ఏక వచనాంతములైనయెడల వాని క్రియాపదముకూడ ఏకవచనాంతమగును.

ఉ॥ బాలకః బాలికావా పశ్యతు, ఇత్యాది.

కాని అట్టి నామములందు వచన వైషమ్య మేర్పడిన పక్షమున క్రియాపదము తనకు సన్నిహితమైన దాని వచనమునే అనుసరించును.

ఉ॥ ఆచార్యోవా శిష్యాః వా ప్రతిపఠంతి, ఇత్యాది.

## 2 విశేషణ విశేష్య సంబంధము.

విశేషములనఁగా పదార్థములకుఁగల లక్షణములు. అట్టి విశేషములను కలిగినవి కాఁబట్టి నామములకు విశేష్యములని

పేరు. విశేష్యములకు గల విశేషములను నిరూపించు శబ్దములకు విశేషణములని వ్యపదేశము. రెంటికిని గల సంబంధమే విశేషణవిశేష్యసంబంధము. సంస్కృతమున విశేషణముల కన్నిటికిని విశేష్యములకువలె లింగవచన విభక్తులు స్వాభావికముగా లేవు. కాని వీని రెంటికిని వాక్యమందు సంబంధమేర్పడు నప్పుడు విశేషణములకు వానివాని విశేష్యములకు గల లింగ వచన విభక్తులు తాత్కాలికముగా నేర్పడక తప్పదు.

ఉ॥ మధురః [illegible] — పుం. మధురా శర్కరా — (స్త్రీ)
మధురమ్ [illegible] — నపుం.

మరియును విశేషణములు వాక్యమునందు విధేయములుగా (సమాపక క్రియాపదములు) ప్రయోగింపఁబడుచుండును. అప్పుడును వానికీ నియమము వర్తించును.

ఉ॥ [illegible]
[illegible] ,, [illegible]
[illegible] ,, [illegible] — ఇత్యాది.

ఉ॥ [illegible]
[illegible] ,, [illegible]
[illegible] ,, [illegible] — ఇత్యాది.

ఇట్లు విధేయముగ ప్రయుక్తమైన విశేషణమునకును, సముచ్చయ విశేష్యములలోని ఉద్దేశ్య పదమునకు సంబంధ మేర్పడినప్పుడు పైన చెప్పబడిన లక్షణములన్నియు సమన్వయించును.

ఉ॥ [illegible] గతవాన్ (గతవంతౌ).
[illegible] గతీయసి (గతీయస్యౌ).
[illegible] [illegible]. ఇత్యాది.

విశేష్యముల లింగవిభక్తి వచనములు విశేషణములకును సంక్రమించునను సామాన్య సూత్రమునకు ఒకటి రెండు అపవాదములు గలవు.

1. 'వింశతి' మొదలుకొని 'కోటి' వఱకును గల సంఖ్యావాచక విశేషణములందు కొంత వైచిత్ర్యము గలదు. వానికి లింగవచనములు రెండును వ్యవస్థితములై యున్నవి. కావున అవి విశేషణములుగా ప్రయుక్తములగునప్పుడు తమ విశేష్యములకుం గల విభక్తిని మాత్రమే అనుసరించునుగాని లింగవచనముల ననుసరింపవు.

ఉ। వింశతిః బ్రాహ్మణాః — వింశత్యా బ్రాహ్మణైః
శతమ్ కన్యాః — శతేన కన్యాభిః
సహస్రమ్ పుస్తకాని — సహస్రేణ పుస్తకైః.
మొ॥

ఇచ్చట మరియొక విశేషమేమనిన 'వింశత్యాదులు' నియత లింగవచనములైనను అన్ని లింగములందు వర్తించును, బహువచనార్థమునే బోధించును. ఈ అంశము పై యుదాహరణములను బట్టి గ్రహింపవచ్చును.

2. నామములుకూడ తఱుచు విశేషణములుగా వాక్యములందు వాడఁబడుచుండును. అప్పుడవి తమ విశేష్యముల వచన విభక్తులనుమాత్రమే స్వీకరించును. లింగమును అంగీకరింపవు. అవి వానికంతకు పూర్వమే వ్యవస్థితమైయున్నవి.

ఉ॥ సీతా విషాదస్య పాత్రమ్ అభవత్
వాల్మీకిః అత్ర విషయే ప్రమాణమ్

రత్నానామ్ ప్రత్యేవ మహాన్ ఫనస
సా ద్రాక్షా విక్రమస్య అలంకారః ఇత్యాది.

మఱియును నిత్య బహువచనాంతములు విశేషణము లైనప్పుడు వాని వచనముకూడ మారుచుండదు.

ఉ॥ ( దారాః ) వస్త్రాణి వ త్రిలోక(జననీమ్) వందే గిరామ్
( దేవతాం ) ఇత్యాది -

ఇంకను సార్వనామికములైన విశేషణములు కొన్ని గలవు. అవి నిత్య సంబంధ ద్యోతకములైన యత్తచ్ఛబ్దములు. భిన్నవాక్యములందవి ప్రయుక్తము లగుచుండును. అందు యచ్ఛబ్దమునకుఁ గల లింగవచనములనే తచ్ఛబ్దము అనుసరింప వలెను. విభక్తినిమాత్ర మట్లనుసరింపవలెనని నియమము లేదు.

ఉ॥ ( యమ్ ) సేవా సంప్రోక్షతి
( సః ) భాగ్యవాన్ భవతి ... ఇత్యాది.

ఒకానొకస్థలమున యత్తచ్ఛబ్దములకు లింగభేదముకూడ కలుగవచ్చును. అది తచ్ఛబ్దవాక్యమందు దానిని పరామర్శించు విశేషణమునుబట్టి ఏర్పడుచుండును,

ఉ॥ (యచ్ఛైత్యమ్) (సా) జలస్య (ప్రకృతిః)
పరగుణేషు అసహిష్ణుతా (యా)
(సః) దుర్జనానామ్ (స్వభావః) ఇత్యాది

## 3 అవ్యయ క్రియాసంబంధము.

విశేషణములు నామములకువలె అవ్యయములకును క్రియాపదములకుఁ గల విశేషములను దెలుపుచుండును. కను

కనే వీనికి క్రియావిశేషణములని సంజ్ఞాంతరము కలదు. వీనికి నామ సర్వనామ విశేషణములకువలె లింగవచన విభక్తులుగాని క్రియలకువలె పురుషవచన విభక్తులుగాని లేవు. కనుకనే **అవ్యయ** ములను పేరు (వ్యయము — పరిణామము లేనివి) వీనికి **అన్వర్థ** మగుచున్నది. **అవ్యయములు** వాక్యములందు **క్రియలకు** విశేషణములుగా ప్రయుక్తములగును. అప్పుడు వీని రూపము లందెట్టి మార్పును కనుపట్టదు. అవ్యయ క్రియాపదములకుఁగల సంబంధము విశేషణ విశేష్యోహాదృశమైన సంబంధమేయని గ్రహింపవలెను.

> ఉ॥ శివః (సర్వదా) క్రీడాసు సక్తః
> (రామవత్) అస్మాకం (అపి) పరాక్రమసంఘ (ఏవ)
> (యావచ్ఛమే) మనుష్యాః విద్యాం సర్వమేవ(చ)
> సాధయేయుః — ఇత్యాది —

## వాక్య విస్తరము
## Extension or Scope of Syntax.

వాక్యము లనునవి శబ్దముల సంఘటనవలన ఏర్పడునని నిర్దేశింపఁబడినది. ప్రస్తుతము అట్టిస్పష్టీకృత వాక్యములకుఁగల విస్తరమును (Extension) నిరూపింపవలసియున్నది. ఇందు మూలమున సంస్కృత భాషయందు అత్యల్పమైన వాక్యము మొదలుకొని అత్యధికమైన వాక్యమువరకును నిర్మాణమునందుఁ గల అవస్థాక్రమము నంతటిని సూక్ష్మముగా అవగాహనమునకు తెచ్చుకోవచ్చును.

ప్రతి వాక్యమందును రెండు ప్రధానములైన భాగములు గలవు. అందు మొదటిది ఉద్దేశ్యమని (Subject Part), రెండవది విధేయమని (Predicate Part) వ్యవహరింపబడును. ఉద్దేశ్యము వాక్యమును ఆరంభము చేయును. అట్లారబ్ధమైన వాక్యమును విధేయము సమాప్తము గావించును. ఈ రెంటిలో నేది లోపించినను వాక్యము నిష్పన్నము కానేరదు. కనుక ఇవి రెండును అన్ని వాక్యములకును అత్యంతము ప్రధానములైన అంశములని గ్రహింపవలయును. అందు ఉద్దేశ్యభాగమున నొకటియు, విధేయమునకొకటియు కేంద్ర స్థానికములైన శబ్దము లుండును. అట్టి కేంద్రస్థానీయమగు శబ్దము (Subject word) ఉద్దేశ్యభాగమందు - కర్తృ-కర్మ-భావవాచకములగు నామములందొకటియైయుండును. మఱియు విధేయమునందట్టి కేంద్రస్థానికము (Predicate word) సమాపక క్రియగాని, సామాన్య, ధాతుజ విశేషణములం దొకటిగాని అయియుండును. ఇక ఉద్దేశ్య విధేయ భాగములందు తక్కిన శబ్దములన్నియును వానివాని కేంద్రశబ్దములకు అనుబంధ రూపములుగా వర్తించుచుండును. అందు ఉద్దేశ్యమున కట్టి అనుబంధములు ఐదు గలవు.

1. ఉద్దేశ్యపదము గాక తక్కుంగల కారకములు.

2. సామాన్య ధాతుజాది విశేషణములు.

3. భూత భావ్యర్థకములైన అసమాపక క్రియాపదములు.

4. భావార్థకరూపమైన వాక్యఖండము.
5. భావలక్షణము లేక — సతిసప్తమీరూపమగు వాక్యఖండము.

మఱి విధేయశబ్దమునకు కర్త్రి అనుబంధ మొకటిగలదు. అదే క్రియావిశేషణము అని చెప్పఁబడు 'అవ్యయము.' కర్త్రి ఆఱు ప్రకారములైన అనుబంధములతో కూడిన ఉద్దేశ్య విధేయభాగములచే నేర్పడిన వాక్యములకు శుద్ధవాక్యములని పేరు. అట్టి శుద్ధవాక్యములు రెండు మూఁడు కలిసి ఏర్పడిన వానికి సంకీర్ణ వాక్యములని అభిధానము. శుద్ధవాక్యములందు విధేయ శబ్దమొకటియే యుండును. సంకీర్ణములం దొకటి కంటె హెచ్చుగా నుండును. ఇదే శుద్ధ సంకీర్ణ నిర్మాణములకుఁ గల తారతమ్యము.

**1 శుద్ధము (ఏక విధేయము)**

**ఉద్దేశ్యము.**
1) కారకములు
2) విశేషణములు
3) అసమాపకములు
4) భావార్థకము
5) భావలక్షణము (సతిసప్తమి)

**విధేయము**
1) అవ్యయములు

## 2 సంకీర్ణము (అనేక విధేయము)

రెండు శుద్ధవాక్యముల కలయికవలన ఏర్పడునది. ఇట్టి కలయికకు ఆధారభూతములైన శబ్దములు నాలుగు.

1) యత్ప్రసిద్ధక శబ్దములు (సార్వనామికములు - అవ్యయములు)

2) 'ఇతి' అను అవ్యయము

3) ఉత - ఉతాహో మొ॥ అవ్యయములు.

4) వా, చ, అనునవి.

## వాక్య ప్రభేదములు.

## (*Varieties of Sentences*)

వాక్యములెల్ల స్వరూపమునుబట్టి నాల్గు జాతులు.

1 భావవాక్యములు (Affirmative)

2 విధి వాక్యములు (Imperative or Potential)

3 ప్రశ్నవాక్యములు (Interrogative)

4 ఆశ్చర్యాద్యర్థకములు Exclamatory, Etc)

1. భావము:—

బాలకః పుస్తకమ్ పఠతి (Reads)

2. విధి:—

(ఆజ్ఞ) బాలకః పుస్తకమ్ పఠేత్ (Must read)

(పరోక్షము - అనుజ్ఞ) ,, ,, పఠతు (Let him read)

(ప్రత్యక్షము ,, ) బాలక ,, పఠ (Read)

3. ప్రశ్న:—

కః పుస్తకమ్ పఠతి (Who reads)

బాలకః కిమ్ ,, (What reads)

,, ,, కరోతి (What does he do)

అపి — కిమ్ బాలకః పుస్తకమ్ పఠతి (Is he reading)

4. ఆశ్చర్యాది:—

అహో ,, ,, ,, ఇత్యాది.

పయి వాక్యములన్నిటిని వ్యతిరేకార్థముగ కూడ ప్రయోగింపవచ్చును. అప్పుడు వానియందు 'న' — 'మా' అను వ్యతిరేకార్థకావ్యయములను చేర్పవలసియుండును.

ఉ। రామః గచ్ఛతి — రామః ( న ) గచ్ఛతి.

త్వమ్ గచ్ఛ — త్వమ్ ( మా ) గచ్ఛ

( ఇత్యాది )

మఱియును అట్టి వ్యతిరేకార్థక శబ్దములు రెండు ప్రయోగించినయెడల వాక్యము భావార్థమును సూచించును, అది సామాన్యభావముకంటె శక్తిమంతముగకూడ నుండును.

రామః 'రక్షతి' — రామః న రక్షతి

న రామః న రక్షతి — (రక్షత్యేవ - తప్పక రక్షించునని అర్థము.)

## వాక్య ప్రభేదములు.

### ( Variety Contd. )

---

వాక్యములను మరల వాని వ్యాపారములను (Function) బట్టి కర్తృ కర్మ ప్రేరణా కర్తృ ప్రేరణ కర్మార్థ ప్రయోగములని నాల్గు విధముల విభజింపవచ్చును. అకర్మకములైన యెడల కర్మార్థమునకు మాఱుగ భావార్థమును చెప్పుకొనవలెను

ఉ॥ ఛాత్రః పత్రికామ్ లిఖతి — కర్తృ

ఛాత్రేణ పత్రికా లిఖ్యతే — కర్మ
,, గమ్యతే — భావ

గురుశ్ఛాత్రేణ పత్రికామ్ లేఖయతి — ప్రే. కర్తృ

గురుణా ఛాత్రేణ పత్రికామ్ లేఖ్యతే
,, ఛాత్రేః పత్రికామ్ లేఖ్యతే — ప్రే. కర్మ.

ఇత్యాదికము.

ఇది

వాక్య సామాన్య లక్షణము.

---

# 2. నామ సర్వనామ ప్రయోగము.

## Use of Nouns and Pronouns

---

నామములుగాని సర్వనామములుగాని వాక్యములందు ఏడు విధములగు అర్థములందు ప్రయుక్తములగుచుండును. ఆ యేడింటియందును వానికి వాక్యమునందుగల తక్కిన శబ్దములతోడ సంబంధము గలదు. అట్లు సంబంధమున్న శబ్దములు మూడు.

1. సమాపక క్రియాపదములు (Finite Verbs)
2. విధేయ విశేషణములు (Adj. used as predicatives)
3. అసమాపక క్రియలు (Infinitives)

ఇట్టి మూడు రకములైన శబ్దములతోడ సంబంధించునప్పుడు నామములు కారకములని వ్యవహరింపబడుచున్నవి. ఒక్కొక్క కారకము ఒక్కొక్క అర్థమందు క్రియాదులతో సంబంధము కలిగియుండును. అట్టి అర్థ సంబంధమును బోధించుటకే నామములకును సర్వనామములకును, విభక్తులనునవి ఏర్పడియున్నవి. విభక్తులు ఏడు విధములు. (ఇందు సంబోధనము లెక్కకురాదు.) అవి ఒక్కొక్కటి ఒక్కొక్క కారకార్థమును ప్రతిపాదించుచుండును. వాని నన్నింటిని సప్రయోగముగా క్రింద పేర్కొనియెదను - పరిశీలించునది.

1) కర్తృకారకము:— క్రియాపదముచేత ప్రతిపాదింపఁ బడు వ్యాపారమునకు ఆశ్రయమగునది కర్త. అట్టి కర్తృ వాచకనామమునకు ప్రథమా విభక్తి వచ్చుచున్నది.

ఉ॥ (బ్రాహ్మణః) దదాతి.

(బ్రాహ్మణుఁడు ఇచ్చుచున్నాఁడు.)

2) కర్మకారకము:— క్రియావ్యాపారఫలమునకు ఆశ్రయ మగునది కర్మము. అట్టి కర్మమును చెప్పు నామమునకు ద్వితీయ వచ్చును.

ఉ॥ బ్రాహ్మణః ( అర్ఘ్యమ్ ) దదాతి.

(బ్రాహ్మణుఁడు అర్ఘ్యము నిచ్చుచున్నాడు.)

3) కరణకారకము:— క్రియావ్యాపారమును సాధించు ఉపకరణము కరణము. దానిని బోధించు నామమునకు తృతీయ వచ్చును.

ఉ॥ బ్రాహ్మణః ( హస్తాభ్యామ్ ) అర్ఘ్యమ్ దదాతి.

(బ్రాహ్మణుఁడు హస్తములతో అర్ఘ్యము నిచ్చుచున్నాఁడు.)

4) సంప్రదానము:— దానక్రియావ్యాపారముచేత ఉద్దే శింపఁబడినది సంప్రదానము. దానిని సూచించు నామమునకు చతుర్థి ప్రాప్తించును.

ఉ॥ బ్రాహ్మణః హస్తాభ్యామ్ ( ఆదిత్యాయ ) అర్ఘ్యమ్ దదాతి.

(బ్రాహ్మణుడు చేతులతో సూర్యునికొఱకు అర్ఘ్యము నిచ్చుచున్నాడు.)

5) అపాదానము:— క్రియావ్యాపారముచేత విశ్లేషము కలిగినప్పుడు మిగిలియుండునది అపాదానము. దానిని బోధించు నామమునకు పంచమి వచ్చును.

ఉ॥ బ్రాహ్మణః హస్తాభ్యామాదిత్యాయ ( అర్ఘ్యపాత్రాత్ ) అర్ఘ్యమ్ దదాతి.

(బ్రాహ్మణుడు చేతులతో అర్ఘ్యపాత్రనుండి అర్ఘ్యమును సూర్యునికొఱకు అర్పించుచున్నాడు.)

6) శేషకారకము:— ఒక నామమునకు నామాంతరముతోఁ గల సంబంధమును నిరూపించునది శేషము. దానిని చెప్పు నామమునకు షష్ఠి వచ్చును.

ఉ॥ బ్రాహ్మణః (ఆత్మనః) హస్తాభ్యామ్ ఆదిత్యాయ అర్ఘ్యపాత్రాదర్ఘ్యమ్ దదాతి.

(బ్రాహ్మణుడు తన చేతులతో ఆదిత్యునికొఱకు అర్ఘ్యపాత్రమునుండి అర్ఘ్యము నిచ్చుచున్నాడు.)

నిజమునకు శేషసంబంధమునకు కారకత్వము సిద్ధించుట అసమంజసము. ఇది నామ క్రియాపదములకుఁగల సంబంధముమగాక రెండు నామముల సంబంధమును నిరూపించుచున్నది. కనుకనే సంబంధ విశేషములన్నింటిని నిరూపించెడు తక్కిన కారకము లాఱును ముగిసినతరువాత మిగిలియుండునది

కాఁబట్టి దీనికి శేషమని పేరు వచ్చినది. ఇది సంబంధ విశేష
మునుగాక స్వామి భృత్యాది సంబంధ సామాన్యమునె
నిరూపించును. అయినను —

'తవాపకరోతి — మమోపకరోతి' — ఇత్యాది ప్రయో
గములందు దీనికిని క్రియాపదముతోడి సంసర్గముండుటవలనను,
సామాన్య పరిస్థితులందుకూడ సాక్షాత్సంబంధములేకున్నను
నామములద్వారా క్రియలతోనే సంబద్ధమయి యుండుటవలనను
కొందఱు దీనినికూడ ఒక కారకముగనే పరిగణింపక తప్పదని
చెప్పుదురు.

7) అధికరణము:— క్రియావ్యాపారమునకు ఆధారభూత
మన్నది. దీనిని బోధించు నామమునకు సప్తమి వచ్చును.

ఉ। (నదీతీరే) బ్రాహ్మణః ఆత్మనః హస్తాభ్యామ్ ఆదిత్యాయ
అర్ఘ్యపాత్రాదర్ఘ్యమ్ దదాతి.

(నదీతీరమునందు బ్రాహ్మణుఁడు తన హస్తములతో
ఆదిత్యునికయి అర్ఘ్యపాత్రమునుండి అర్ఘ్యము నర్పించు
చున్నాఁడు.)

ఇట్లు తత్తత్కారకములును, వానికి క్రియాప్రభృతుల
తోడఁ గల సంబంధములును, వానిని నిరూపించు విభక్తులును,
తదనురూపములైన ప్రయోగములును క్రమముగా చూపఁబడి
నవి. కాని ప్రథమాదులైన విభక్తులేడును పైని నిరూపింపఁ
బడిన కర్త్రాద్యర్థములందేకాక అనేకములైన విశేషార్థములం

దును వర్తించుచున్నవి. ఇవి వాని సామాన్యార్థములు మాత్రమే. కాబట్టి ప్రస్తుతము ఒక్కొక్క విభక్తికిఁగల సామాన్య విశేషార్థముల నన్నిటిని ఆవశ్యకమగు సంతవఱకును క్రోడీకరించి చూపెదను — పరిశీలించునది.

## విభక్తులు — ప్రయోగ వైచిత్ర్యము.

### ప్రథమా విభక్తి.

1. కర్త్రర్థము:— (రామః) పఠతి (శిష్యః) వందతే.
2. ద్వికర్త్రర్థము:— (దశరథః) (రాజా) అభవత్.
   అయస్స్వర్ణం సంపద్యతే.
3. కర్మార్థము:— బాలకేన (గ్రంథః) పఠ్యతే.
4. భావార్థము:— మయా (భోజనమ్) క్రియతే.

### ద్వితీయా విభక్తి.

1. కర్మార్థము:— మేఘః (జలమ్) వర్షతి.
2. ద్వికర్మార్థకము:— దశరథః (రామమ్) (రాజానమ్) అకరోత్
   పాచకః తండులాన్ ఓదనమ్ పచతి
3. గమనాది క్రియా సంబంధము — పితా (గ్రామమ్) గచ్ఛతి. చోరః (గృహమ్) ప్రవిశతి. మొ॥
4. అధిష్ఠానాది సంబంధము — రాజా (సింహాసన) మధితిష్ఠతి. మునిః (కుశాసన) మధ్యాస్తే
   (అధివసతి — ఆవసతి — అనువసతి — ఉపవసతి.)
5. అంతరా - అంతరేణ సమంతాత్ - పరితః అభితః—ప్రతి — అను అతి - వినా 'పృథక్' మొ॥ అవ్యయముల సంబంధము. — సః (మా) మంతరా కిమబ్రవీత్ (రామ) మంతరేణ లక్ష్మణః నజీవతి సమంతా (ద్రాజధానీమ్) ఉద్యానాని బాలాః పాఠశాలమ్ (ప్రతి) గచ్ఛంతి. విద్యంతే.

ప్రజాః ( రాజానమ్ ) అనువర్తంతే
నకోఽపి ( కాలమ్ ) ( దేశమ్ వ )
అతిగంతుమ్ శక్నుయాత్.
( రామమ్ ) వినా అన్యచ్ఛరణమ్ నాస్తి,
ఇత్యాది.

6. దేశకాలవ్యాప్తి సంబంధము } పాంథః క్రోశమ్ యాతి. ఛాత్రః మాస మధీతే

7. 'ధిక్' శబ్దయోగము:— ధిక్ రావణమ్ దురాత్మానమ్.

---

## తృతీయా విభక్తిః.

---

1. కరణార్థము:— వృద్ధః శునకమ్ ( దండేన ) అతాడయత్.
2. హేత్వర్థము:— ( ధనేన ) వయమ్ సుఖమ్ జీవేమ.
3. కర్త్రర్థము:— ( రాజ్ఞా ) శత్రవో జితాః.
4. సహార్థయోగము:— ( బంధుభి ) స్సహ (సాకమ్ – సార్థమ్-సమమ్) యాత్రామ్ కరిష్యామి.
5. తుల్యార్థయోగము:— ( విద్యయా ) సమమ్ (సదృశమ్–తుల్యమ్) న విద్యతే.
6. హీనార్థ ,, (బలేన) హీయతే వృషభః
(ప్రాణై)ర్వియుక్తః పురుషః
( ధనేన ) రహితో భవాన్
7. పరిక్రయణార్థము:— (శతేన) పరిక్రీతమ్ వస్తు.
8. లక్షణార్థము:— ( వయసా ) యుధిష్ఠిరో జ్యేష్ఠః
(జటాభి) స్తాపసమ్ మన్యే.

9. అంగవికారార్థము— ( అక్ష్ణా ) శుక్రః కాణః
కవిః ( పాదేన ) ఖంజః.

10. 'అల' మర్థయోగము:— అల ( మతిభాషణేన.)
అలం (చాశ్రై ) ( గసర్ధద్రైః. )

11 'పృథక్' వినార్థయోగము:— ( ఉద్యమేన ) వినా కార్యాణి న
సిధ్యంతి.

12 సంబంధార్థము:— తామ్రమ్ ( స్వర్ణేన ) సంబధ్యతే
( సంయుజ్యతే – సంగచ్ఛతే. )

---

## చతుర్థీ విభక్తి.

---

1. సంప్రదానార్థము:— జనకః ( రామాయ ) కన్యామ్
దదౌ.

2. కేవలోద్దేశ్యార్థము:— రామః ( వనాయ ) అగచ్ఛత్.
(యశసే) ధీరాః ప్రయతంతే.

3. రుచ్యర్థము:— (మహ్యమ్) కిమ్ రోచతే.
( నమే ) భోజనం రోచతే

4. ధారణార్థము అప్పుపడుట } వయమ్ ( దేవదత్తాయ ) శతమ్
ధారయామః.

5. స్పృహార్థము:— (శర్కరాభ్యో) స్పృహయంతి బాలాః
(తరుణీభ్యః) స్పృహయంతి యువానః.

6. క్రుధాద్యర్థయోగము:— గురుః (శిష్యాయ) కుప్యతి.
(మహ్యమ్) నకోప (ద్రుహ్యతి) జనః

7. ప్రతిశ్రుత్యర్థము ప్రతిజ్ఞ యొ॥ } అర్జునః (విప్రాయ) ప్రతి
శృణోతి – ఆశృణోతి. ఇత్యాది.

8. పరిక్రయణార్థము:— (శతాయ) పరిక్రీత మాభరణ మస్మాభిః

9. తాదర్థ్యము:— జనాః (మోక్షాయ) దేవమ్ భజంతి
సర్వే సంపాదనాయ యత్నమాతిష్ఠంతే.

10 క్లృప్త్యర్థము— భక్తిః (జ్ఞానాయ) కల్పతే.
విద్యా (ప్రతిష్ఠాయై) భవతి.
సంసారః (బంధనాయ) జాయతే.
మైత్రీ (ఉపకారాయ) సంపద్యతే.

11. ఉత్పాత జ్ఞాపితార్థము:— (వినాశాయ) విపరీతాబుద్ధిః.

12. హితయోగము:— (ప్రాణిభ్యో) హితమ్ చింతయేత్.

13. తుమర్థము:— బాలకాః (ఫలేభ్యః) (ఫలాన్యాహర్తుమ్)
యాంత్యరణ్యాని.
అంగనాః పుష్పేభ్యః) ఉద్యానాని విశంతి.

14. భావార్థే :— (యాగాయ) రాజా సంభారా
నాహరేత్ (యజనాయ.)
[illegible]గాయ) జనాః ద్రవ్యమ్ చిన్వంతి.

15. మన్యార్థము:— మూఢ స్సాధూనపి (తృణాయ) మన్యతే.

16. సమస్వస్త్యాది యోగము { (అగ్నయేస్వాహా) (అతిథయే) స్వాగతమ్
స్వస్తి ప్రజాభ్యః।
రామః రాక్షసానామ్ (సంహారాయ)
అలమ్ మొ॥ నవి.

---

## పంచమీ విభక్తి.

---

1. విశ్లేషార్థము:— నద్యః (నగేభ్యః) ప్రసరంతి.
సర్పాః (వల్మీకేభ్యః) నిస్సరంతి.

8. దిక్సంబంధము:— (గ్రామస్య) దక్షిణతః వటవృక్షః.
9. ప్రభవత్యాది యోగము:— సః (ఆత్మనః) ప్రభవతి – ఈష్టే.
10. 'దీవ్యతి' ,, — (శతస్య) దీవ్యతి కితవః
11. 'కృత్వసుచ్' ,, — (దినస్య) పంచకృత్వః అభ్యవహార మాచరతి మూఢః.
12. భావార్థయోగము:— (రామస్య) గమనమ్ – గతిః – గతమ్
(దశరథస్య) మరణమ్ – మృతిః. మొ
13. కృదంత సంబంధము:— కృష్ణః (జగతః) కర్తా.
(కృష్ణస్య) కృతిః
14. కృత్యాధ్యయోగము:— (విశ్వామిత్రస్య). పూజ్యత్వం
(రావణస్య) వధ్యత్వమ్. మొ॥

---

## సప్తమీ విభక్తి.

---

1. అధికరణార్థము:— (పాత్రే) జలమస్తి
ధనమిత్రస్య (పిడా ...) మాసక్తిః
2. సాధ్వాదియోగము:— యుధిష్ఠిరః (అతిథిషు) సాధుః
(కార్యే) నిపుణః – (ధనుషి) ప్రవీణః మొ॥
3. అధీనాది ,, — భగవాన్ (భక్తే) హ్యధీనః – నిఘ్నః
– ఆయత్తః మొ॥
4. విశ్వాసాది , — లక్ష్మణః (అగ్రజే) విశ్వసితి.
సీతా (భర్తరి) స్నిహ్యతి.
విభీషణః రామే రక్తః– రావణః కుపితః ఇత్యాది
5. నిమిత్తాది యోగము:— (చర్మణి) ద్వీపినమ్ హంతి
(దంతయో) ర్హంతి కుంజరమ్.

6. అంగాంగి సంబంధము :— కృష్ణః రాధామ్ (చేలాంచలే) కర్షతి.
(ద్వికర్మక ప్రయోగము)

మాతా పుత్రిమ్ (మూర్ధ్ని) న్యు పాణిగ్రహీత్. మొ॥

7. వితరణార్థక ప్రయోగము:— (మయి) వితరతి - అర్పయతి
విజ్ఞాపయతి — నివేదయతి మొ॥

---

## షష్ఠీ సప్తములు

---

1. నిర్ధారణము:— రామః (ధనుష్మతామ్) శ్రేష్ఠః
,, (ధనుష్మత్సు) ,,

2. భావలక్షణము:— (మమ) (పశ్యతః) } చోరః ధనమ్
(సతి) (మయి) (పశ్యతి) } అపాహరత్ మొ॥

ఇది

నామ సర్వనామ ప్రయోగము.

# 3. క్రియా ప్రయోగము

## Use of Verbs.

---

### 1. సమాపకములు
### (Finite)

సమాపక క్రియాపదము లెల్ల భూత భవిష్యద్వర్తమాన ములను మూఁడు కాలవిశేషములందును, విధ్యాశీర్నిషేధ హేతు మదర్థము లనియెడు మూఁడు అర్థవిశేషములందును ప్రయోగింపఁబడుచున్నవి.

అందు భూతకాలికములైన క్రియారూపములు మూఁడు విధములుగను, భవిష్యత్కాలికములు రెండు ప్రకారములు గను విధ్యర్థక రూపము లిరువెరఁగులుగను వర్తించుచున్నవి. వాస్తవమునకు వర్తమానమువలె భూతభవిష్యత్కాలములు కూడ ఏకవిధముగనే ఉండవలసియున్నను ఆకాలములందు కొంత సన్నికర్ష విప్రకర్షాది విశేషములు సూచించు నిమిత్తము ప్రాచీనులు భేదములను కల్పించిరి. కాని రానురాను భేదము నశించి ఆ రూపములన్నియు నిర్విశేషముగనే ప్రయుక్తము లగుచుండినవి. ఇఁక విధ్యర్థమునందలి రెండు భేదములును ఒకటి ఆజ్ఞార్థమును, మఱియొకటి సంప్రార్థనార్థమును నిరూపించుటకు ఏర్పడినవి.

కాలమునకును, అర్థమునకును ప్రధానమైన భేదమొకటి గలదు. కాలమనునది క్రియావ్యాపారము జరిగెడు సమయము

(Tense) అర్థము. అట్టి వ్యాపారము జరుగు ప్రకారము (Mood) ప్రస్తుతము ఆ యా కాలములయు, అర్థములయు స్వరూపమును, తదనుసారము తెలుగుప్రయోగములును, ప్రదర్శింపబడుచున్నవి. పరిశీలించునది.

---

## 1. వర్తమానము

ఒక వ్యాపారము జరిగెడుకాలము. దీనిని ప్రతిపాదించునది వర్తమాన కాలిక క్రియాపదము.

ఉ॥ బాలకః గ్రామం (గచ్ఛతి).
(బాలుడు గ్రామమునకు పోవుచున్నాడు)

---

## 2. భూతము

ఒక వ్యాపారము జరిగిపోయిన కాలము భూతకాలము. దానిని సూచించునది భూతకాలిక క్రియాపదము.

ఉ॥ బాలకః గ్రామం (అగచ్ఛత్.)
బాలకః గ్రామమ్ (అగమత్)
బాలకః గ్రామమ్ (జగామ)
(బాలుడు గ్రామమునకు పోయెను.)

ఇట్లు ఒకటే భూతార్థమును ప్రతిపాదించుటకే మూడు క్రియారూపములు గలవు. ఇవి మూడును ప్రాచీన కాలమందు

సన్నికర్ష విప్రకర్షాది (Near and Far) విశేషములను బోధించుటకయి కల్పింపఁబడినవి. అందు:—

1) అగచ్ఛత్ (పోయెను) — సన్నిహిత భూతము
2) అగమత్ ( ,, ) — మధ్యస్థ ,,
3) జగామ ( ,, ) — విప్రకృష్ట ,,

ఇట్లు అర్థభేదమును పాటింపవలసియున్నను చాలకాలము క్రిందటనే అది పరిత్యజింపఁబడినది. ఇతరకాలమునుండి ఇవి అభిన్నముగనే వాడఁబడుచుండినవి. అయినను కడపటి క్రియారూప మెప్పటికిని విప్రకృష్టార్థమునందే ప్రయుక్తమగుచుండును. తక్కినవి రెండును సమీప దూరార్థములు రెంటియందును వర్తింపవచ్చును.

ఉ॥ రామః రాజ్యమ్ (చకార) — (అకరోత్ — అకార్షీత్)

అని యిట్లు విప్రకృష్టార్థమున మూఁడిటిని వాడవచ్చును. కాని సమీపార్థమందు మాత్రము:—

ఉ॥ కింకరః కార్య మకరోత్ — అకార్షీత్.

అని వీని రెండిటినీ వాడవలెను గాని కడపటిదానిని (చకార) వాడ రాదు.

## 3. భవిష్యత్తు

ఇకమీఁదట జరుగఁబోవు వ్యాపారమును సూచించు కాలము భవిష్యత్తు. దీనిని నిరూపించునది భవిష్యత్కాలిక క్రియాపదము.

ఉ॥ బాలకః గ్రామం (గమిష్యతి.)
బాలకః గ్రామమ్ (గంతా.)
(బాలుఁడు గ్రామమునకు పోఁగలడు, పోవును)

దీని రెంటికిని ప్రాచీనకాలమునందర్థభేదము కలదు. అందు మొదటిది అచిరకాలమందు జరుగఁబోవు నర్థమును రెండవది అంతకంటె ఆలస్యముగ జరుగు నర్థమును సూచించుచుండెడివి. కాని ఇవి చాలనాఁటనుండి పర్యాయములుగనే వాడఁబడుచున్నవి. పైగా మొదటిదానికంటె రెండవదానికి వ్యవహారము కూడ చాల తక్కువ అని గ్రహింపవలెను.

---

## 4. విధ్యర్థము (ఆజ్ఞ)

ఒక వ్యాపారము అవశ్యముగా జరుగవలెనను అర్థము ఆజ్ఞావిధి. దీనిని బోధించునది విధ్యర్థక క్రియాపదము.

ఉ॥ బాలకః గ్రామమ్ (గచ్ఛేత్)
(బాలుఁడు గ్రామమునకు పోవలెను.)

---

## 5. విధ్యర్థము — (సంప్రార్థనము)

ఒక వ్యాపారము జరుగుటకు అనుమతించుట, కోరుట సంప్రార్థనావిధి. తదర్థ ప్రతిపాదకమగునది సంప్రార్థనా విధ్యర్థ క్రియాపదము.

ఉ॥ బాలకః గ్రామమ్ (గచ్ఛతు.)
(బాలుఁడు గ్రామమునకు పోవచ్చును.
(పోవునుగాక)

—

## 6. ఆశీరర్థము

ఒక వ్యాపారము జరిగిన బాగుండునని తలంచుటకు ఆశీరర్థమని పేరు. తత్ప్రతిపాదక మగునది ఆశీరర్థక క్రియాపదము.

ఉ॥ బాలకః గ్రామమ్ (గమ్యాత్.)
(బాలుఁడు గ్రామమునకు పోవునుగాక.)

—

## 7. హేతు హేతుమంతము

పరస్పరము కార్యకారణ రూపముగ సంబద్ధములైన రెండు వ్యాపారములను బోధించు దానికి హేతుహేతుమంతమని సంజ్ఞ. దానిని ప్రతిపాదించుటకయి ఏతదర్థకమైన క్రియా పదము వాడబడును.

ఉ॥ బాలకః గ్రామమ్ (అగమిష్యత్)
(బాలుడు గ్రామమునకు పోయియుండును. పోలేదని భావము.)

## వర్తమానాదులు — విశేష రూపములు.

వర్తమానాద్యర్థములందు పయి నుదాహరించిన సామాన్య క్రియారూపములేగాక మఱికొన్ని విశేషరూపములును ప్రయుక్తములగుచున్నవి. అవి ఆయాకాలములందు కొన్ని విలక్షణార్థములను బోధించుచుండును. చాలవఱకును ఇవి ధాతుజ విశేషణ క్రియాపదముల సంశ్లేషమువలన ఏర్పడుచున్నవి వానిని వరుసగా నుదాహరించెదను. — పరిశీలించునది.

### 1. వర్తమానము.

సామాన్య రూపము (గచ్ఛతి) పోవుచున్నాడు Goes)
విశేషములు గచ్ఛన్ అస్తి పోవుచు నున్నాడు (Is going)

### 2. భూతము.

సామాన్యములు అగచ్ఛత్, గచ్ఛతిస్మ, పురా గచ్ఛతి } పోయెను. (Went)

విశేషములు గచ్ఛన్నాసీత్, గచ్ఛన్నాస్త } పోవుచు నుండెను (Was going)

గతః అస్తి — పోయిఉన్నాడు. (Has gone)

గతః ఆసీత్ — అభవత్ — పోయియుండెను Had gone)

సంభావనార్థము:— గతః భవిష్యతి — పోయి యుండును.

(Might have gone - would have gone)

నిశ్చయార్థము;— గతః స్యాత్ } Should have or must have
గతః భవేత్ } gone (పోయియుండవలెను)

పర్యవసానార్థము:— గతః భవతి — పోయినవాడగును

(is said to have gone)

భవిష్యత్తు.

సామాన్య రూపములు:— గమిష్యతి } పోగలడు.
పురాగచ్ఛతి } will go, shall go.
విశేషములు యావద్గచ్ఛతి }
గమిష్యన్నాస్తే will be going.

ఇట్లు విశేషార్థములందేకాక సామాన్యార్థమునందే కొన్ని క్రియాపదములకు బహులుగా కేవల ధాతుజ విశేషణములనే వాడవచ్చును.

1) భూతకాలికములైన అన్ని క్రియారూపములకును మాఱుగా భూతకాలిక ధాతుజ విశేషణములనే వాడవచ్చును.

ఉదా॥ 1. కర్త్రర్థము — ఛాత్రః పుస్తక (మపఠత్) (క్రియ)
,, పుస్తకమ్ (పఠితవాన్) (ధా. వి.)
2, కర్మార్థము — ఛాత్రేణ పుస్తకమ్ (అపఠ్యత) (క్రియ)
,, పుస్తకమ్ పఠితమ్ (ధా. వి.)
ఇత్యాదులు.

2) విధ్యర్థకములైన క్రియాపదములన్నిటికిని బదులు విధ్యర్థక ధాతుజ విశేషణములనే వాడవచ్చును.

కర్త్రర్థ — ఛాత్రః పుస్తకమ్ (పఠేత్) (క్రియ)
కర్మార్థ — ఛాత్రేణ పుస్తకమ్ (పఠితవ్యమ్) (ధా. వి.) మొ॥

ధాతుజ విశేషణములనుగూర్చి ఇంకను అనేక వివరములు తరువాత విశేషణప్రకరణమున విస్పష్టముగా ప్రతిపాదింపబడును. ప్రసంగవశమున కొన్నింటిని మాత్రమే ఇచట ఎన్నవలసి వచ్చినది.

---

## వర్తమానాదులు — ప్రయోగ వైచిత్ర్యము.

సమాపక క్రియాపదములెల్ల వర్తమానాది కాలములను విధ్యాద్యర్థములను బోధించునని పూర్వము ప్రతిపాదింపబడినది. అట్టి వర్తమానాదులనుండే క్రియలకు వచ్చు విశేష రూపములును పేర్కొనబడినవి. ప్రస్తుతము క్రియాపదములు ప్రయోగింపబడు వర్తమానాది కాలములకును, విధ్యాద్యర్థములకును గల ప్రయోగ వైశాల్యమును పరికింపవలసి యున్నది.

### 1) వర్తమానము.

**1)** ప్రస్తుతము జరుగుచున్న విషయమును బోధించుటకు:—

ఉ॥ మేఘః ( వర్షతి. )
అశ్వః ( ధావతి )

**2)** దైనందినములైన అభ్యాసములను, ఆచారములను వర్ణించుటకు:—

ఉ॥ సః ప్రతిదినమ్ ప్రాతరేవ శయనా ( దుత్తిష్ఠతి )
వయమ్ సర్వదా ఫలాని (భక్షయామః).

3) శాశ్వతికములైన స్వభావములను, వ్యాపతములను బోధించుటకు:—

ఉ॥ సూర్యః ప్రాత (రుదేతి) సాయమస్తమ్ (గచ్ఛతి)
బాలాః (క్రీడంతి) — వృక్షాః (ప్రమాద్యంతి) మొ॥

4) ఆఖ్యానాదులందు భూతకాలిక క్రియాస్థానమున:—

ఉ॥ అథ విశ్వామిత్రో దశరథమ్ (పృచ్ఛతి) (అపృచ్ఛత్)
రాక్షసాః యజ్ఞస్య విఘ్న (మాచరంతి) (ఆచరన్)
ఇత్యాది.

5) ప్రకరణ సామర్థ్యముచేత స్ఫురించెడు భవిష్యదర్థమును సూచించుటకు:—

ఉ॥ రామః (గచ్ఛతి (గమిష్యతి) — త్వమ్ తిష్ఠ
అథ అహమ్ (వదామి) (వదిష్యామి) — శృణు మొ॥

---

## 2) భూతము.

1) ముందు జరిగిన అర్థమును సూచించుటకు:—

ఉ॥ గురుః శిష్య (మతాడయత్)
కృష్ణః మాతరమ్ (అవందత) ఇత్యాదులు.

2) ప్రకరణబలముచేత భవిష్యదర్థమును బోధించుటకు:—

ఉ॥ అయ మహా (మాగచ్ఛమ్) (ఆగమిష్యామి)
ఏషో హా (మకరవమ్) (కరిష్యామి) ఇత్యాది

---

### 3) భవిష్యత్.

**1)** జరుగఁబోవు నర్థమును వ్యపదేశించుటకు:—

ఉ॥ అ[illegible] బాంధవాః (ఆగమిష్యంతి.)

కార్యమ్ (ఫలిష్యతి) ఇత్యాది.

**2)** సంభావనార్థమును సూచించుటకు:—

ఉ॥ వృష్టిః (పతిష్యతి.)

[illegible] (ఉత్పత్స్యతే.) ఇత్యాది

**3)** ఆశంసితార్థమును బోధించుటకు:—

ఉ॥ మంగళాని (భవిష్యంతి), —ఉపద్రవః (అపగమిష్యతి) మొ॥

---

### 4) విధ్యర్థము (ఆజ్ఞ)

**1)** ఆవశ్యకమైన అర్థమును స్ఫురింపఁజేయుటకు:—

ఉ॥ శిష్యః ఆచార్యమ్ (సేవేత)

కర్మకరాః జల (మాహరేయుః) ఇత్యాది.

**2)** సంభావితార్థమును సూచించుటకు:—

ఉ॥ వైద్యః కృతార్థో న భవేత్) — రోగి (మ్రియేత) మొ॥

**3)** అనుమతిని తెల్పుటకు:—

ఉ॥ పుత్రోఽపి పితర (మనుగచ్ఛేత్)

**4)** ఆశంకితార్థమును చెప్పుటకు:—

ఉ॥ జనాః (పరిహసేయుః.)

బాలకః అధః (పతే) దపి ఇత్యాది.

5) ఆశంసితార్థమును తెల్పుటకు:—

ఉ॥ తవాపరః సుదూర (మపసరేయుః)
దేవాస్త్వా (మనుగృహ్ణీయుః) ఇత్యాది.

6) భవిష్యదర్థమును స్ఫురింపఁజేయుటకు:—

ఉ॥ వర్షః (పతేత్) — బాంధవాః (ఆగచ్ఛేయుః)

7) వర్తమానార్థమును తెల్పుటకు:—

ఉ॥ (స్యాదే) తత్ — (భవే) దేవమ్ — ఇత్యాది.

8) సంప్రశ్నార్థమును సూచించుటకు:—

ఉ॥ కిమహామ్ (తిష్ఠేయమ్) అథవా (గచ్ఛేయమ్.) మొ॥

---

5) విధ్యర్థకము. (అనుజ్ఞ)

1) సంప్రార్థితార్థమును తెల్పుటకు:—

ఉ॥ భగవన్ మామ్ (రక్ష) — (పాహి, —, త్రాయస్వ.) ఇత్యాది.

2) అనుమత్యర్థమును నిరూపించుటకు:—

ఉ॥ బాలాః గృహమ్ (గచ్ఛంతు.)
పశవః ఘాసమ్ (చరంతు) ఇత్యాది.

3) అనాదరార్థమును తెల్పుటకు:—

ఉ॥ (తిష్ఠ) త్వేతత్ — (గచ్ఛతు) నవరాకః
(ఆస్తామ్) తావత్సర్వమ్ మొ.

4) అసంభావితార్థమును తెల్పుటకు:—

ఉ॥ (మేరుశ్చలతు) - సాగర (శ్శుష్యతు) ఇత్యాది.

5) ఆశంసితార్థమును ప్రకటించుటకు:—

ఉ. సుముహూర్తే శ్రియామ (భవతు.)
(వర్ధతాం) మాంగళం ఇత్యాది.

---

### 6) ఆశీరర్థము.

1) ఆశంసితమైన అర్థమును తెల్పుటకు:—

ఉ. (భూయాసుః) పురుషోత్తమ ప్రసాదాద్భవ
శ్రీగంధరాజ్యేయమనే.

దీనియందు విశేషార్థ ప్రయోగములంత కానరావు.

---

### 7) హేతు హేతుమంతము.

1) పరస్పరాశ్రయములగు అంశములందేదియును జరుగలేదను భావమును ప్రతిపాదించుటకు:—

ఉ. సువృష్టిశ్చే (దభవిష్యత్) సుభిక్ష (మభవిష్యత్.)

ఏదియును జరుగలేదని భావము — దీనియందును విశేష ప్రయోగములు కలుగవు.

---

## ఆత్మనేపద — పరస్మైపదములు.

క్రియాపదములెల్ల ఆత్మనేపదములని పరస్మైపదములని రెండు జాతులు. వీని రెంటికిని మొదట కొంత అర్థభేదముండెడిది. క్రియాఫలము కర్తకు చెందినయెడల ఆత్మనేపదము, పరులకు

చెందినయెడల పరస్మైపదము లని పరిగణింపఁబడెను. కాని కాల క్రమమున వీనికిఁగల అర్థభేదము నెంచి ప్రస్తుతము రెండును అన్ని కాలములందును, అర్థములందును అభిన్నముగనే వాడఁ బడుచున్నవి. కేవలము క్రియాప్రత్యయములు చేయునప్పుడు రూపములందు మాత్రము వైలక్షణ్యము గోచరించును.

ఉదాహరణము.

| | పరస్మై | ఆత్మనే. |
|---|---|---|
| 1 | వయమ్ కావ్యమ్ పఠామః | వయమ్ గురుమ్ సేవామహే |
| 2 | త్వమ్ కుత్ర (వససి) | త్వమ్ కథమ్ (వర్తసే.) |
| 3 | తే కార్యమ్ న (కుర్వంతి) | తాః ధైర్యమ్ న (లభంతే.) |

కొన్ని క్రియాపదములు రెండింటియందును ప్రయుక్తము లగుచుండును. అట్టివాని కుభయపదములని పేరు.

| | పరస్మై. | ఆత్మనే. |
|---|---|---|
| 1 | రామః వార్తామ్ (శృణోతి) | రామః వార్తామ్ శృణుతే |
| 2 | కింకరః సేవామ్ (కరోతి) | కింకరః సేవామ్ (కురుతే) |

మఱికొన్ని క్రియాపదములు గలవు. అవి ఉపసర్గములు చేరుటవలన పరస్పరము మార్పుచెందును.

1 సేవకః (తిష్ఠతి) — సః స్వామినమ్ (ఉపతిష్ఠతే)

2 ప్రహ్లాదః భగవతి (రమతే) — సః భోగేభ్యః (విరమతి)

ఇత్యాదికము

## ఉపసర్గాది సంబంధము.

ప్ర, పరా, అప, అవ, మొదలగు ఇరువదిరెండు ఉపసర్గలును, సాక్షాత్, ఊరీ ప్రభృతులు గతి సంజ్ఞాకములు కొన్నియును గలవు. ఇవి యథాసంభవముగా ధాతువులకు ముందు వచ్చి చేరుచుండును, అప్పుడా ధాతువులనుండి అనేక విధములైన క్రియారూపము లుదయించుచు అనేక విధములగు నర్థములందు రూఢములగుచుండును. క్రింది యుదాహరణములను పరిశీలించునది.

---

## 1. 'భూ' ధాతువు

( అగుట — ఉండుట )

భవతి — ఉన్నాడు — అగుచున్నాడు — రామః రాజా భవతి.

ఇది దీని సామాన్యరూపము, సామాన్యప్రయోగము. ఉపసర్గలు చేరినయెడల రూపభేదము — అర్థభేదము కల్గును.

| | | | |
|---|---|---|---|
| 1 | రామః | అనుభవతి — అనుభవించుట | ( అను ) |
| 2 | ,, | ప్రభవతి — ఉదయించుట | ( ప్ర ) |
| 3 | ,, | సంభవతి — సంభవించుట | ( సమ్ ) |
| 4 | ,, | పరిభవతి—పరిభవించుట | ( పరి ) |
| 5 | ,, | ఉద్భవతి — పుట్టుట | ( ఉత్ ) |
| 6 | ,, | అభిభవతి — ఎదిరించుట | ( అభి ) |

ఇత్యాదులు.

---

## 2. 'హృ' ధాతువు
### ( హరించుట )

హరతి – దొంగిలించుట – రావణః సీతామ్ ( హరతి )

పరి. హరతి — పరి — పోగొట్టుట
అప. ,, — అప — దొంగిలించుట
ఆ ,, — ఆ — తెచ్చుట
ఉప. ,, — ఉప — కొనివచ్చుట ఇత్యాదులు.

ఒకొక్కప్పుడు రెండు మూఁడుపసర్గలొక్కసారిగా ధాతువులకు చేరుచుండును.

ఉ॥ ( వి + ఆ ) + హరతి = వ్యాహరతి – మాటాడుచున్నాఁడు
( అభి + ఉత్ ) + గచ్ఛతి = అభ్యుద్గచ్ఛతి - లేచి ఎదుర్కొనుచున్నాఁడు.

ఇత్యాదులు.

---

## సకర్మకాకర్మక ప్రయోగములు.

క్రియాపదములెల్ల మరల రెండు విధములు.

1. సకర్మకములు 2. అకర్మకములు, కర్తృకర్మ పదములు రెండును కలిగినవి సకర్మకములు. కర్మపదము లేక కేవలము కర్తృపదమునే కలిగినవి అకర్మకములు.

| ఉ॥ | సకర్మ. | అకర్మ. |
|---|---|---|
| 1 | బాలః ఫలమ్ (భక్షయతి) | అశ్వః (ధావతి) |
| 2 | గురుః శిష్యమ్ (పరీక్షతే) | వాయసః (డయతే) |
| 3 | రాజానః భూమిమ్ (పాలయంతి) | జనాః సుఖమ్ (జీవంతి) |
| 4 | అహమ్ ఈశ్వరమ్ ( వందే ) | వయమ్ (మోదామహే) |

కొన్ని క్రియాపదములు సకర్మకములుగను, అకర్మకములుగను రెండువిధములఁల ప్రయుక్తములగుచుండును. అప్పుడు వాని కర్థభేదముకూడ నేర్పడవచ్చును.

| | అకర్మ | సకర్మ. |
|---|---|---|
| 1 | ధర్మః (జయతి) | రామః రావణమ్ (జయతి) |
| 2 | ప్రాణాః (ధరంతి) | శూరాః ఆయుధమ్ (ధరంతి). |
| 3 | గావః (చరంతి) | గావః ఘాసమ్ (చరంతి) |

కొన్ని క్రియలు మొదట అకర్మకములే అయినను ఉపసర్గములు చేరినవెనుక సకర్మకములగుటయు చూడవచ్చును.

| | అకర్మ. | సకర్మ. |
|---|---|---|
| ఉ: | బాలః (మోదతే) | సర్వేతమ్ (అనుమోదంతే) |
| | వృక్షాః (కంపంతే) | భగవాన్ ప్రాణినః (అనుకంపతే) |

మొ॥

---

## కర్తృకర్మాద్యర్థ ప్రయోగము.

క్రియాపదముల కన్నిటికిని వాక్యమందు నాలుగు విధములైన అర్థములందు ప్రయోగములు గలవు.

| | అవి సకర్మకములైన: | అకర్మకములైన: |
|---|---|---|
| 1 | కర్త్రర్థము (స్వార్థము) | కర్త్రర్థము (స్వార్థము) |
| 2 | కర్మార్థము | భావార్థము |
| 3 | ప్రేరణ కర్త్రర్థము | ప్రేరణ కర్త్రర్థము |
| 4 | ,, కర్మార్థము | ,, కర్మార్థము |

N. B:— అకర్మకములకు కర్మయుండదు గావున కర్మార్థమునకు బదులు భావార్థమనునది ప్రాప్తించును. మఱి ప్రేరణమునందు అన్ని అకర్మకములును సకర్మకములే యగును. కావున ప్రే. కర్మార్థమనునది ఏర్పడినది. ఇట్లు కొంత సంజ్ఞా భేదమేకాని నాల్గింటియందును వీనికి రూపభేదములేదు.

సకర్మకము.

| | | |
|---|---|---|
| 1 | కర్తృ | శిష్యః పత్త్రికామ్ (లిఖతి.) |
| 2 | కర్మ | శిష్యేణ పత్త్రికా (లిఖ్యతే) |
| 3 | ప్రే. కర్తృ | గురుః శిష్యేణ పత్త్రికామ్ (లేఖయతి) |
| 4 | ప్రే. కర్మ | గురుణా శిష్యః ,, (లేఖ్యతే) |

మఱియును సకర్మకములకు వాక్యములందు కర్మవాచక మొకటియేగాక ఒకొ్కక్కపుడు రెండుకూడ నుండవచ్చును. అట్టి దానికి ద్వికర్మక ప్రయోగమని పేరు.

| | | | |
|---|---|---|---|
| ఉ॥ | 1 | కర్తృ | సూదకః (తండులాన్) (ఓదనమ్) పచతి. |
| | 2 | కర్మ | సూదకేన (తండులాః) (ఓదనః) పచ్యతే. మొ॥ |

ఇట్లు దుహ్, యాచ్ – పచ్ – నీ – పృచ్ఛ్ – మథ్ – భిక్ష్ – ముష్ –కృష్ మొదలగునవికొన్నిమాత్రమే ద్వికర్మక క్రియలుకలవు.వానికన్నింటికి నిట్లు ప్రయోగము లూహించునది.

అకర్మకము.

| | | |
|---|---|---|
| 1 | కర్తృ | ఫలమ్ (పతతి) |
| 2 | భావ | ఫలేన (పత్యతే) |
| 3 | ప్రే కర్తృ | పురుషః ఫలమ్ (పాతయతి) |
| 4 | ప్రే. కర్మ | పురుషేణ ఫలమ్ (పాత్యతే). ఇత్యాది. |

పై ప్రయోగములందన్నింటను ఒక్క క్రియాపదములె గాక వాని ననుసరించి కర్తృ కర్మవాచకములగు నామములును ఎట్లు పరిణమించుచున్నవో గ్రహింపవచ్చును.

1. కర్తర్యర్థము:- శిష్యః పత్త్రికామ్ లిఖతి.
   ఇచ్చట - కర్తకు ప్రథమా విభక్తి - కర్మమునకు ద్వితీయ
   (శిష్యః) - (పత్త్రికామ్)
2. కర్మణ్యర్థము:- శిష్యేణ పత్త్రికా లిఖ్యతే.
   ఇచ్చట - కర్తకు తృతీయ - కర్మమునకు ప్రథమ
   (శిష్యేణ - పత్త్రికా)

భావార్థప్రయోగమున కర్మముండదు కావున కర్తకు మాత్రము తృతీయ వచ్చును.

మయాగమ్యతే - (మయా) మొ॥

3. ప్రే. కర్తృః- గురుః శిష్యేణ పత్త్రికామ్ లేఖయతి.

ఇందు ప్రయోజక కర్తకు ప్రథమయు (గురుః), ప్రయోజ్య కర్తకు తృతీయయు (శిష్యేణ) వచ్చును. కర్మము ద్వితీయయందే యుండును. (పత్త్రికామ్) కొన్నిచోట్ల ప్రయోజ్య కర్తకు ద్వితీయ, షష్ఠియు రావలసియున్నది -.

ఉ॥ రామః (కృష్ణమ్) గ్రామమ్ గమయతి.
కృష్ణః (అర్జునస్య) విశ్వరూపమ్ దర్శయతి.

ఇత్యాది.

4. ప్రే. కర్మః- గురుణా శిష్యః పత్త్రికామ్ లేఖ్యతే.

ఇచ్చట ప్రయోజకకర్తకు తృతీయ (గురుణా) ప్రయోజ్య కర్తకు ప్రథమ (శిష్యః) కర్మకు ద్వితీయ (పత్త్రికామ్) ఒక

ప్పుడు ప్రయోజ్య కర్తకు ద్వితీయయు, కర్మకు ప్రథమయు రావచ్చును.

ఉ॥ గురుణా (శిష్యేణ) (పత్రికా) లేఖ్యతే మొ॥

ఇట్లు కర్త్రాద్యర్థక ప్రయోగములందు క్రియారూపము లకేగాక తిఙ్కాలమున కర్తృకర్మలందు కలుగు మార్పులను కూడ గమనింపవలయును. కర్త్రాద్యర్థరూపములు ప్రస్తుతము వర్తమాన కాలిక క్రియాపదములకే ప్రదర్శింపబడినవి. దీనినిబట్టి తక్కిన అన్ని కాలములందును అర్థములందును ఊహించునది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉ॥ | రామః పుస్తకమ్ | పఠతి | కర్తృ | వర్తమాన | |
| | రామేణ ,, | పఠ్యతే | కర్మ | | |
| ఉ॥ | రామః ,, | అపఠత్ | ,, | భూత | |
| | రామేణ ,, | అపఠ్యత | ,, | | |
| ఉ॥ | రామః ,, | పఠిష్యతి | ,, | భావి | |
| | రామేణ ,, | పఠిష్యతే | ,, | | |
| ఉ॥ | రామః ,, | పఠేత్ | ,, | విధి | (1) |
| | రామేణ ,, | పఠ్యేత | ,, | | |
| ఉ॥ | రామః ,, | పఠతు | ,, | ,, | (2) |
| | రామేణ ,, | పఠ్యతామ్ | ,, | | |

మఱియును కర్తృ కర్మాద్యర్థములు నాల్గును ప్రసిద్ధములుగావు. వీనియందు కడపటిదైన ప్రేరణ కర్మార్థము తఱచుగా వ్యవహరింపఁబడదు. తక్కినవి ప్రసిద్ధముగా వాడఁబడును.

## అసమాపకములు.
## ( Infinitives )

వాక్యమును సమాప్తము గావింపనేరవు గావున వీని కసమాపకములని పేరు సమాపకములకువలె వీనికి పురుషవచనాది లక్షణములేవియు లేవు. కాని సమాపకములవలె వీనికి కారకము లన్నిటితోడను సంబంధము గలదు. అందు కర్తృకారకముమాత్రము సమాపకాసమాపకములకు రెంటికిని తెలుచుగా సమానమైయుండును. తక్కినవి విలక్షణముగను నుండవచ్చును. మఱియును అసమాపకములు వాక్యమందు ప్రయుక్తములైనపుడు సమాపకము లేకాలమందైనను అర్థమునందైనను ప్రయుక్తములై యుండవచ్చును. ఇట్టి అసమాపకములెల్ల రెండువిధములు.

1. భూతార్థకము క్త్వాల్యబంతములు.)
(Past Infinitive.)
2. భావ్యర్థకము (తుమంతము.)
(Future Infinitive.)

---

## 1. భూతార్థకము

ఇది భూతకాలికమైన అసమాప్త వ్యాపారమును బోధించునది. దీనికే క్త్వాంతమని పేరు.

ఉ। రామః అన్నమ్ (భుక్త్వా) విద్యాలయ మయాసీత్.
సేవకః కార్యమ్ (కృత్వా) గ్రామమ్ గమిష్యతి. మొ.

ధాతువులు ఉపసర్గపూర్వకములైనయెడల వానికి క్త్వా ప్రత్యయముగాదు. ల్యప్ (య) అను ప్రత్యయము వచ్చి చేరును.

ఉ॥ దారకః బహుధా (విలప్య) నిద్రామ్‌గతః
త్వమిమమవకృత్య క్వచిదగాః

భూతార్థకమగు అసమాపకము భావమునందేగాక వ్యతిరేకమునందును ప్రయుక్తమగును.

ఉ॥ బాలకః పుస్తక (మపఠిత్వా) గృహమ్ గచ్ఛతి.
భృత్యః స్వామినః నియోగ (మకృత్వా) వేతనమలభత.
రావణః (అనాలోచ్య) సీతా మపాహరత్.
రామః ధర్మ (మపరిత్యజ్య) రావణ మమారయత్.
ఇత్యాది.

ఇది పౌనః పున్యార్థమునందును ప్రయోగింపబడవచ్చును. అప్పుడిది అనుసర్గపూర్వకమైనయెడల క్త్వాంతమేకాక 'ణములంతము' కూడ నగుచున్నది.

ఉ॥ సేవకః స్వామినః నిదేశమ్ (కృత్వా) (కృత్వా)
(కారమ్ కారమ్ శా)ంతి అభజత్.
అహమేత (దృష్ట్వా) (దృష్ట్వా) (దర్శమ్ దర్శమ్)
కుపితో భవమ్.

(స్మారమ్ స్మారమ్) స్వగృహ చరితమ్ దారుభూతో
మురారిః ఇత్యాదులు.

—

## భూతార్థకము—కర్తృ కర్మాద్యర్థ ప్రయోగము.

సమాపకములకును అసమాపకములకును ఒక కర్త్రర్థము నందేకాక కర్మాదులైన తక్కిన మూఁడర్థములందును. ప్రయోగములు కలవు. అట్లు ప్రయోగించునపుడు కొన్ని ముఖ్యాంశము లను మనసునందుంచుకొనవలెను.

1) సమాపకా సమాపకములకు రెంటికిని సమానముగా పరిణామము కలుగును.

2) రెంటికీ కర్తృకారకము సాధారణముగా ఒకటియే కావున దానికిమాత్రము క్రియలతోపాటు మార్పు వచ్చును. తక్కిన కర్మాదులు రెంటికిని వేఱుగా నుండవచ్చును గాన సమాపకములకు సంబంధించినవి మాఱినను అసమాపకములకు చెందినవి మార్పు కొందవు.

3) ఈ ప్రయోగములయందసమాపకముల రూపములు కర్తృకర్మార్థములు రెంటియందు ఒక్కవిధముగను, తక్కిన వాటికిని ఒక్కవిధముగను వర్తించును.

ఉ॥ శిష్యః పుస్తకమ్ (పఠిత్వా) గృహమ్ గచ్ఛతి.
శిష్యేణ „ „ „ గమ్యతే.
గురుః శిష్యేణ పుస్తకమ్ (పాఠయిత్వా) గృహమ్ ప్రేషయతి
గురుణా శిష్యః „ „ „ ప్రేష్యతే
మొ॥

పయి వాక్యములందు ముందు చెప్పిన మూఁడు లక్షణము లను సమన్వయించుకొనునది. ఇట్లు క్త్వాంతమునకే గాక ల్యబంత,

వ్యతిరేకాదుల కన్నింటికి నూహించునది.

ఉ. బాలకః పత్రికామ్ (విలిఖ్య) మహ్యం ప్రేషయతి
బాలకేన ,, ,, ,, ప్రేష్యతే. మొ.

---

## భూతార్థకము — విశేష ప్రయోగములు.

సాధారణముగా సమాపకాసమాపకములు వాక్యమం దేకకర్తృకములై యుండవలెనని పూర్వము నిర్దేశించితిని. ఇప్పుడందుల కపవాదప్రాయములైనవానిని కొన్నిటి నుదాహరించెద

1. హేత్వర్థము:— కుద్యమ్ (పఠిత్వా) మనుష్యాః మృతాః.
2. నియమార్థము:— గంగాయామ్ (స్నాత్వా) పాపాని వినశ్యంతి.
   స్వజనమ్ (హిత్వా) సౌఖ్యమ్ నభవేత్.
3. కాలాత్యయార్థము:— సఖ్యాః కుశల (మాకర్ణ్య) సంవత్సరః అభవత్.
4. దేశాత్యయార్థము:— తమ్ పర్వత (మతిక్రమ్య) కింపురుష విషయః.
   మహాభారత (మాదాయ) (ఆరభ్య) సంస్కృత సాహిత్యమ్.
5. అలమర్థయోగము:— అలమ్ (భుక్త్వా) - అలమ్ (పఠిత్వా.)

### కృత్వా — భూత్వా.

1. కృత్వా: అయమ్ బాల ఇతి (కృత్వా) ఉపేక్షితః హేతువు.
2. భూత్వా:— కాన్తాంతికో నామ (భూత్వా) పరిణామము

---

## 2. భావ్యర్థకము

భవిష్యత్కాలికమగు అసమాప్తార్థమును బోధించునది. దీనికే తుమునంతమని నామాంతరము.

ఉ। వయమ్ గురుమ్ (ప్రష్టుమ్) యాస్యామః
మమ సహాధ్యాయ్ (ప్రష్టు) మిచ్ఛతి. ఇత్యాది.

ఇది ఉపసర్గపూర్వకమైనను మార్పుచెందదు.

ఉ। చోరః గృహా (దపక్రమితుమ్) దిశో విలోకయతి.

ఇవియును వ్యతిరేకమునందును పౌనః పున్యార్థమునను ప్రయుక్తమగుచుండును.

ఉ। కర్మా (ణ్యాచర్తుమ్) తేషామ్ ఫలా (న్యనుభవితుమ్)
చ నకోపి శక్నుయా ల్లోకే. ఇత్యాది

---

## భావ్యర్థకము – కర్తృకర్మాది ప్రయోగములు.

కర్తృకర్మాదులైన నాలుగర్థములును భూతార్థకమునకువలె దీనికిని గలవు రెంటియందు పాటింపవలసిన నియమములు సమానములే.

ఉ। సర్వే ద్రవ్యమ్ (సంపాదయితుమ్) యత్నం కుర్వంతి
సర్వైర్ద్రవ్యమ్ ,, యత్నః క్రియతే.

ఉ పురుషః సర్పమ్ (హంతుమ్) దండమానయత్,
పురుషేణ సర్పమ్ ,, దండః ఆనీయత.
పితా పురుషేణ ,, ఘాతయితుమ్ దండమానాయయత్
పిత్రా ,, ,, ,, దండః ఆనాయ్యత ఇత్యాది.

---

## భావ్యర్థకము – విశేషప్రయోగములు.

1. కాలసంబంధము:— మమ (భోక్తుమ్) కాలః – సమయః – అవసరః వేళా.

2. అనుమత్యర్థము:— గురుః మామ్ (భోక్తుమ్) దదాతి.
3. అస్త్యర్థము— మిత్రస్య (భోక్తుమ్) కిమప్యస్తి - విద్యతే.
4. ఇచ్ఛార్థము:— మాతా బాలకమ్ (భోక్తు) మిచ్ఛతి.
గురుర్మామ్ (పఠితు) మిచ్ఛతి.

పయి నాల్గింటియందును సమాపకాసమాపకములు భిన్నకర్తృకములు.

1. లాభార్థము:— రామః (పాతుమ్) లభతే.
2. ఆరంభార్థము:— అంగనా (గాతు) మారభతే.
3. శక్త్యర్థము:— అహమ్ (స్థాతుమ్) నశక్నోమి.
త్వయా (శ్రోతుమ్) శక్యతే.
4. యుక్తార్థము:— తస్యైతత (త్కర్తుమ్) యుజ్యతే.
5. అర్హార్థము:— శిష్యః ఆచార్యస్య పరిచర్యాం (కర్తు)మర్హతి.
6. జ్ఞానార్థము:— అయమ్ (శిక్షితుమ్) జానాతి - వేత్తి,
,, (భాషితుం) న ,, ,,
7. ఇచ్ఛార్థము:— వయమ్ (జేతు) మిచ్ఛామః (జిగీషామః,)
బాలానామ్ (క్రీడితు) మభిలాషః —
ఉత్సాహః.
8. కామ - మనస్సంబంధము :— అహమ్ (గంతుకామో) స్మి.
9. సామర్థ్యార్థము:— — ,, (గంతుమనాః) ఇత్యాది.

వృద్ధో యాతు మలమ్ - అర్జునః యోద్ధుం నిపుణః
పటుః - ప్రవీణః - కుశలః - చతురః. ఇత్యాది.

ఇది

క్రియా ప్రయోగము

# 4. విశేషణ ప్రయోగము,

## Use of Adjectives.

విశేషణములన్నియు వాక్యములందు రెండువిధములుగా ప్రయోగింపఁబడుచున్నవి.

1. సామాన్య ప్రయోగము. (Attributive)  2. విధేయ ప్రయోగము. (Predicative.)

ఆ యా కారకముల లక్షణములను తెలుపుటకుమాత్రము ప్రయుక్తములగునవి సామాన్యములు, కారకలక్షణములను విధానించుటకేగాక సమాపకక్రియలకు మాఱుగా ప్రయుక్తములయి వాక్యార్థమును సమాప్తి నొందించునవి విధేయములు. సామాన్యములు వాని విశేష్యములనుబట్టి అన్ని విభక్తులందును ప్రయుక్తములగును. విధేయము లొక్క ప్రథమా విభక్తియందే వర్తించును.

| సామాన్యము. | విధేయము. |
|---|---|
| ప్ర. ఉత్తమః రాజా | ఉత్తమః రాజా |
| ద్వి. ఉత్తమమ్ రాజానమ్ | |
| తృ. ఉత్తమేన రాజ్ఞా | |
| చ. ఉత్తమాయ రాజ్ఞే | |
| పం. ఉత్తమాత్ రాజ్ఞః | |
| స. ఉత్తమే రాజ్ఞి - రాజని | |

## ధాతుజ విశేషణ ప్రయోగము.

విశేషణములన్నిటియందును తక్కిన విశేషణము లొక్క ఎత్తు. ధాతుజములుమాత్ర మొకఎత్తు. తక్కినవానికివలె వీనికిని సామాన్య విధేయములు అను రెండువిధముల ప్రయోగములు గలవు. ఇదిగాక వీని కింకొక విశేషార్థ ప్రయోగమును గలదు. అదే అసమాపకార్థ ప్రయోగము. కనుక ధాతుజ విశేషణములకు మూడు రకములైన అర్థములందు ప్రయోగములు గలవని తాత్పర్యము. ఇవి వర్తమాన భూతభావి విధ్యర్థములను నాల్గింటియందును కర్తృకర్మాదులను నాల్గురూపములకును ప్రాప్తించును. కాని ఇందు వర్తమాన భవిష్యద్విశేషణములకు విధేయ ప్రయోగము సంభవింపదు. మఱి విధ్యర్థకమున కర్మార్థరూపములకే ప్రయోగములుండును గాని కర్త్రర్థరూపములకేర్పడవు. ఇవి రెండును అపవాదములని గ్రహించునది. మఱియును ధాతుజ విశేషణములందు కేవలము విశేషణత్వమే గాక క్రియాత్వము సైత మిమిడియుండుటచేత వీనికిని కారకములతోడి సంసర్గముగలదు. క్రింది ప్రయోగములు పరిశీలించునది.

### వర్తమానము.

| | | |
|---|---|---|
| కర్తృ:— | పుస్తకమ్ (పఠన్) రామః | పుస్తకము చదువుచున్న<br>,, చదువుచు – |
| కర్మ:— | రామేణ (పఠ్యమానమ్) పుస్తకమ్ | చదువఁబడుచున్న పుస్తకము<br>పుస్తకము చదువఁబడుచు – |
| ప్రే. కర్తృ:— | శిష్యమ్ (పాఠయన్) గురుః | చదివించుచున్న గురువు<br>శిష్యుని చదివించుచు. |

ప్రే. కర్మ:— గురుణా (పాఠ్యమానః) శిష్యః } చదివింపఁబడుచున్న శిష్యుఁడు. / శిష్యుఁడు చదివింపఁబడుచు.

పయి వాక్యములందు ప్రక్కనే సామాన్యాసమాపకార్థములు రెండును ఉదాహరింపఁబడినవి. ఇట్లు భవిష్యత్కాలికమునకును ఊహింపవచ్చును. మఱియును వీనియందు ప్రథమాంతరూపములు మాత్రమే పేర్కొనబడినవి. తక్కిన ద్వితీయాదుల రూపములుకూడ గ్రహింపవలెను.

ఉ॥ పుస్తకమ్ పఠన్ రామః — ప్రథమ.
,, పఠన్తమ్ రామమ్— ద్వితీయ.
,, పఠతా రామేణ — తృతీయ మొ॥

ఇట్లు తక్కిన "శతృశానాదులకు" ప్రథమ మొదలు సప్తమివఱకు ప్రయోగముల నూహించునది.

## భూతము.

1. కర్తరి:— పుస్తకమ్ (పఠితవాన్) బాలః } చదివిన బాలుఁడు. / బాలుఁడు చదివిన వాఁడయి / బాలుఁడు చదివినాఁడు
2. కర్మణి:— బాలేన (పఠితమ్) పుస్తకమ్ } చదువఁబడిన పుస్తకము / బాలునిచే చదువబడినదై / బాలునిచే చదువఁబడినది.
3. ప్రే.కర్తరి:- బాలమ్ (పాఠితవాన్) గురుః } చదివించిన గురువు / బాలుని చదివించిన వాఁడై / బాలుని చదివించినవాఁడు
4. ప్రే. కర్మణి:— గురుణా (పాఠితో) బాలః } చదివింపఁబడిన బాలుఁడు / గురునిచే చదివింపఁబడిన వాఁడై / ,, చదివింపఁబడినాఁడు.

ఇట్లు తక్కిన విభక్తులందును ఊహింపవలెను.

ఉ॥ పుస్తకమ్ పఠితవాన్ బాలః — ప్రథమ
,, పఠితవంతమ్ బాలమ్ — ద్వితీయ
,, పఠితవతా బాలేన — తృతీయ మొ॥

ఇట్లు 'పఠిత' మొ॥ వానికి రూపము లూహించునది,

## విధ్యర్థము.

1. కర్మ:— బాలకేన (పఠితవ్యమ్) (పఠనీయమ్) (పాఠ్యమ్) } పుస్తకమ్ { చదువఁబడవలసిన / చదువఁబడవలసినదై / చదువఁబడవలసినది. మొ॥

ప్రే. కర్మ:— గురుణా పాఠయితవ్యః / పాఠనీయః } బాలః { చదివింపఁబడవలసిన / చదివింపఁబడవలసినవాఁడై / చదివింపఁబడవలసినవాఁడు

దీనికిని అన్ని విభక్తులందును ప్రయోగము లూహించునది,

ఉ॥ బాలేన పఠితవ్యమ్ పుస్తకమ్ — ప్రథమ
,, ,, ,, — ద్వితీయ
,, పఠితవ్యేన పుస్తకేన — తృతీయ మొ॥

ఇట్లు ప్రే. కర్మార్థమునకును నూహించునది.

---

## అసమాపకార్థము — 'సత్' సుబంధము,

ధాతుజముల కన్నిటికిని అసమాపకార్థ ప్రయోగము లందు 'సత్' అనునది ఒకటి వైకల్పికముగా అను ప్రయుక్త మగుచుండును. ఇది 'అస్' అను ధాతువునుండి జనించిన మాట

యొక్క ధాతుజ విశేషణము. దీనికి పుంలింగమున 'సన్' స్త్రీలింగమున -'సతీ' నపుంసకమున 'సత్' అనియును ప్రథమాంత రూపములు. తక్కిన విభక్త్యంత రూపములు వాని అంతిమాక్షరములను బట్టి గ్రహింపనచ్చును.

ఉదా॥ 1. వర్తమానము:— పఠన్ — పఠన్ సన్ — చదువుచున్నవాఁడగుచు
2. భూతము:— పఠితవాన్ — పఠితవాన్ సన్ — చదివినవాఁడగుచు
3. భవిష్యత్తు;— పఠిష్యన్ — పఠిష్యన్ సన్ — చదువఁగలవాఁడగుచు.
4 విధి:- పఠితవ్యమ్ — పఠితవ్యమ్ సత్ — చదవఁబడవలసినదగుచు

ఇట్లు అన్ని లింగములందును రూపములను ఎఱుంగునది.
స్త్రీ — పఠంతీ — సతీ — నపుం - పఠత్ — సత్. మొ॥
కర్మార్థములందును రూపముల నూహించునది.
వర్తమానమ్ సత్ — పఠితమ్ సత్.
పఠిష్యమాణమ్ సత్ — ఇత్యాదులు.

---

## ధాతుజములు — సంస్కృతాంధ్ర విసంవాదము.

ధా. విశేషణములు సంస్కృతమునందునవలె ఆంధ్రమునను గలవు. కాని ఆంధ్రమునందు వీని ప్రయోగము సంస్కృతమందున్నంత యుక్తి సహజముగ లేదు. సంస్కృతమందు ధాతుజములు కర్త్రాద్యర్థములందు వాడఁబడినప్పుడు వేనికవి విలక్షణముగా నుండును. ఒకదాని అర్థమందు వేఱొకటి ప్రయోగింపఁబడదు. ఒక్క భూతకాలిక కర్మార్థరూపమును మాత్రము కొంత

నఱకు అపవాదముగ భావింపవచ్చును. అది కర్తృ కర్మార్థము లందు రెండిటను వాడఁబడుచుండును.

ఉ॥ రామః వనమ్ (గతవాన్) —గతః -(స్థితవాన్) - స్థితః.

ఇట్లు గత, స్థిత, చలిత, మిళిత, భుక్త, పీత, మొ॥ వానిని కొన్నింటినిమాత్రము గ్రహింపవచ్చును. ఇంతకుఁదప్ప పయిసూత్రమునకు సంస్కృతమఁదెచ్చటఁగాని అపవాదములు కానరావు. ఇఁక తెలుఁగునందట్లుగాదు, అన్ని ధా. విశేషణ ములకును కర్త్రర్థ రూపములు కేవలము వానిని నిరూపించుట కే గాక కర్మార్థ ములందును యథేచ్ఛముగా వాడఁబడుచున్నవి. అది ఈ భాషకు సంప్రదాయమగుటవలన యుక్త యుక్తముగా కున్నను స్వీకార్యమగుచున్నది. కాని ఇట్టి వైలక్షణ్యము దీని యందుండుటవలన సంస్కృతాంధ్రి పరివర్తనమునందు కొన్ని పొరబాట్లు సంభవింపవచ్చును. అందుచే తెలుఁగునుండి సంస్కృ తమునకు వీనిని మార్చునపుడు మొదట కర్త్రర్థముగా ప్రయు క్తములైన కర్మార్థములనన్నింటిని తెలుఁగులోనే కర్మార్థ ము లుగ చేసికొని తరువాత సంస్కృతీకరించుట మంచిది.

ఉదా॥

1. వర్తమాన:- నేను చేయుచున్న పని / నాచే చేయబడుచున్న పని } మయా (క్రియమాణమ్) కర్మ

2. భూత:— నేను చేసిన పని / నాచే చేయఁబడిన పని } మయా (కృతమ్) కర్మ.

3. భావి:— నేను చేయఁగల పని / నాచే చేయఁబడగల ,, } మయా (కరిష్యమాణమ్) కర్మ.

4. విధి:— నేను చేయవలసిన పని / నాచే చేయబడవలసిన పని } మయా కర్తవ్యమ్ కర్మ.

ఇట్లు ప్రేరణార్థమునందును కర్తృకర్మ వ్యత్యయమును సరిచూచుకొనునది.

ఉ॥ గురువు చదివించిన / గురువుచే చదివింపబడిన } గురుణా (పాఠితః.) ఇత్యాదులు

---

## విశేషణములు — అపేక్షాభావ ప్రయోగములు.

సామాన్య - సార్వనామిక ధాతుజములనియెడు మూడు జాతుల విశేషణములకును మఱియొక విలక్షణార్థమునందు ప్రయోగములు గలవు. దానికి నిర్ధారణమని తారతమ్యమని, అపేక్షాభావమని వ్యవహారములు. గుణాధిక్యముచేత ఒక పదార్థమును తక్కినవానినుండి పృథక్కరించి చూపుటయే అపేక్ష. ఇది సాధారణముగా తక్కిన అన్నిజాతుల విశేషణములకంటె సామాన్యములకే హెచ్చుగా ఏర్పడుచుండును. ఇందు మూడు దశలు గలవు.

1) ప్రాథమికావస్థ: (Positive) ఇందు విశేషణ రూపమునకుగాని వాక్యమందు తక్కిన శబ్దములకుగాని మార్పులేదు.

2) మాధ్యమికావస్థ: (Comparative) రెండింటియందు ఒకదాని కాధిక్యమును ప్రతిపాదించునది. దీనియందు విశేష

పదమునకు 'తర - ఈయస్' అను ప్రత్యయములును, దేని కంటె ఆధిక్యము అపేక్షితమో దానికి పంచమీ విభక్తియు వచ్చును.

3) ఉత్తమావస్థ: (Superlative) అనేకములందొక్క దానిని నిర్ధారణము చేయునది. ఇందు విశేషణమునకు 'తమ - ఇష్ఠ' అను ప్రత్యయములును, దేనినుండి నిర్ధారణము జరుగునో దానికి షష్ఠీ సప్తములందొకటియు ప్రాప్తించును.

ప్రయోగములు.

1. ప్రథమః— రామః (గురుః)
2. మధ్యమః— రామః (లక్ష్మణాత్) (గురుతరః) — (గరీయాన్).
2. ఉత్తమః— రామః (సర్వేషాం) (భ్రాతౄణాం), (గురుతమః) — (గరిష్ఠః) మొ॥

ప్రశ్నార్థమున- ఇవి కతరః — కతమః } ఇట్లే గ్రహింపవలెను.
సంఖ్యాదులందు- ఏకతరః — ఏకతమః }

---

## విశేషణములు - కర్తృకర్మాది ప్రయోగములు.

విశేషణములు వాక్యమందే యే అర్థ విశేషములందు ప్రయోగింపబడుచున్నను, కారకములైన నామముల లక్షణములనే తెల్పుచుండును. కాబట్టి ఇవి ఎప్పుడును తమ తమ కారకములనే అనుసరించియుండును. కర్తృకర్మాది ప్రయోగములందు కారకము లెట్టిమార్పులు పొందుచుండునో వాని విశేషణము

లును అట్టివానికే లోనగుచుండును. అందును కర్తృకర్మవాచకములగు కారకములకు, దాని విశేషణములకే ఈ పరిణామము నియతమైయుండునని తాత్పర్యము.

సామా. 1. (గుణవాన్) (పురుషః) (అసత్యమ్) (వాక్యమ్) నవదతి (కర్తృ)
2. (గుణవతా) (పురుషేణ) ,, ,, నఉచ్యతే (కర్మ) ఇత్యాదులు.

ఉదా:—

ధాతు. 1 మార్గే గచ్ఛన్ రామః మార్జాల మపశ్యత్ (కర్తృ)
2. మార్గే గచ్ఛతా రామేణ మార్జాలః అదృశ్యత (కర్మ)

కాని ధాతుజములందొక వైశిష్ట్యము గలదు. వీనికి కర్త్రర్థరూపములేకాక కర్మాదులైన మూఁడర్థములందును ప్రత్యేకముగా రూపములు గలవు. వానికిని ఈ కర్తృకర్మాది ప్రయోగములకును సంబంధములేదు. అవి ధాతుజముల రూపములందుమాత్రమే కలుగు మార్పులు. ఇవి వాక్యమంతటికిని సంబంధించిన లక్షణములు. కాఁబట్టి ఆ రూపములను ప్రయోగించినప్పుడుకూడ మరల వాక్యమునకు కర్తృకర్మాది ప్రయోగములు కలుగవచ్చునని గ్రహించునది,

ఉదా:—

1. గురుణా (తాడితః) బాలకః రోదితి — కర్తృ.
2. ,, (తాడితేన) బాలకేన రుద్యతే — కర్మ. ఇత్యాది

కాని విధేయప్రయోగమున ధాతుజములే సమాపకములకు బదులు వచ్చి వాక్యమును ముగించుచున్నవి. కాబట్టి అచ్చట విశేషణములకు వచ్చు కర్తృకర్మాది రూపముల చేతనే వాక్యమునకు కర్తృకర్మాదులందు ప్రయోగము సిద్ధించుచున్నది.

ఉ. గురుః బాలకమ్ (తాడితవాన్) — కర్తృ.
గురుణా బాలక (స్తాడితః) — కర్మ ఇత్యాదులు.

---

ఇది
విశేషణ ప్రయోగము

## 5. అవ్యయ ప్రయోగము.

### Use of Adverbs Etc.

నామములకువలె లింగ విభక్తి వచనములును, క్రియలకు వలె పురుషవచన కాలాదికమును లేకుండుటవలన స్వరూప వ్యయమును చెందనివి అవ్యయములు. వీనికి క్రియా విశేష ణములని నామాంతరము. వాక్యమునందివి సాధారణముగా క్రియాపదముల విశేషములను తెలుపుటకై ఉపయుక్తములగుట వలన నీనికీపేరు సార్థకమగుచున్నది.

ఉ॥ అశ్వః (శీఘ్రమ్) ధావతి – పవనః (మందమ్) వాతి మొ॥

సాధారణముగాననుటచే ఒకప్పుడొక కొన్ని అవ్యయ ములు క్రియాపదములుగాక నితర శబ్దములతోనే ఎక్కువ సంబంధించియుండునని గ్రహించునది.

ఉ॥ రామమ్ (వినా) లక్ష్మణేన (సార్థమ్)

ఇత్యాదులు.

ఇట్లు నామములతోనే ఎక్కువగ సంబంధించియుండు నవ్యయములకు వాక్యమునందు స్థాననియమము పాటింప వలెను. మఱి క్రియలకు సాక్షాద్విశేషణములైన వాని విషయ మందంతటి నియమ మనావశ్యకము.

ఉ॥ లక్ష్మణః రామమ్ వినా.

ఇంక 'వినా' యనునది ఒకవేళ కొంత మాఱినను 'రామమ్' అను రూపమునకు ముందుండనగునేమో కాని 'లక్ష్మణ' శబ్దమునకు ముందువచ్చుటకు వీలులేదు.

(వినాలక్ష్మణం రామమ్ మొ॥)

ఇట్లు:— 'రామ (ఇతి) జానంతి' — చంద్ర (ఇవ) ముఖమ్.

ఇత్యాదుల నెఱుంగునది. మఱి క్రియావిశేషణములకట్టి నియమము కానరాదు.

ఉ॥ అగ్రే పశ్యామి తేజః } తేజః పశ్యామ్యగ్రే
పశ్యామ్యగ్రే తేజః } తేజోఽగ్రే పశ్యామి

(ఇత్యాదులు.)

అవ్యయములందు కేవలావ్యయములేగాక అనేకములైన నామములు విశేషణములును జేరియున్నవి. అనఁగా కొన్ని నామ విశేషణపదములకు అవ్యయత్వమును కలదని భావము.

ఉ॥ నా మ ము.

సీతాయా (స్సుఖమ్) నాథవత్ హనుమాన్ (సుఖ) మలంఘయత్ సాగరమ్

వి శేష ణ ము. అ వ్య య ము.

బాలకః (మధురమ్) ఫలమ్ భక్షయతి } సః (మధురమ్) భాషతే.

ప్రస్తుతము కొన్ని ప్రసిద్ధములైన అవ్యయములను తత్తద్విశేష వ్యాఖ్యాన సహితముగా ప్రయోగముల నుదాహరించెదను. పరికించునది.

---

## 1. లా క్ష ణి క ము లు.

1. వత్:— 'వలె' అను అర్థమందు ప్రయుక్తమగును. కాని దీనిని క్రియాసామ్యమునందె కాని గుణాదిసామ్యమున ప్రయోగింపరాదు.

ఉ॥ తాతాచార్యః అప్పలాచార్య (వత్) పండితః ప్రతిభాతి.

2. తసిల్:— ఇది పంచమీ విభక్త్యర్థమందు పంచమికి మారుగా ప్రయుక్తమగును.

ఉ॥ (నగరతః) అరణ్యాని గచ్ఛంతి సాధవః.

3. సాత్:— పొలగుట లేదా 'పరిణమించుట' అను నర్థమందిది ఉపయుక్తమగును.

ఉ॥ త్ర్యంబకః కామమ్ (భస్మసాత్) చకార.

4. అవ్యయీభావ సమాసములు:— సమాసరూపమున అవ్యయములు.

ఉ। వయమ్ (యథాశక్తి) ప్రయతిష్యామహే
పురుషేణ (యావదాయుః) కర్మాణి కర్తవ్యాని.
లంకాయామ్ (ప్రతిగృహమ్) రాక్షసీనా మార్తనాదః
(ఆకీటమాకైటభవైరి) సర్వేప్రాణినః కర్మవశే తిష్ఠంతి.
మొ॥

5. అనిశ్చయార్థములు:— 'చిత్' 'చన' 'అపి'

ఉ॥ (కుత్రచిత్) -(కుత్రచన) - (కుత్రాపి గచ్ఛతుభవాన్, మొ॥

6. అత్యంతానిశ్చయబోధకములు:—

(యదాకదాచి) దహమ్ కాశీమ్ గంతు ముత్సహిష్యే.

ఇత్యాదులు.

---

## 2. ప్రతిపదోక్తములు.

1. చః— సముచ్చయార్థమునందన్ని శబ్దములకును కడపట ప్రయోగింపఁబడును.

ఉ॥ రామః (లక్ష్మణశ్చ) వన మగచ్ఛతామ్

దీనిని ప్రయోగించునపుడు క్రియాపదము అనేక కర్తృక మైనను ఏకవచనాంతము కావచ్చును.

ఉ॥ రామో లక్ష్మణశ్చ వన (మగచ్ఛత్)

2. అపిః— ఇదియును సముచ్చయార్థ మంటె వచ్చును.

ఉ॥ (కాఽపి) దృష్టిమ్ లభతే.

ఇవి వాక్యారంభమున ప్రయుక్తమైనయెడల వాక్యము ప్రశ్నార్థముగ మాఱును.

ఉ॥ (అపి) తే కుశలమ్ ?

3. తుః— పాక్షికమైన అర్థమును బోధించుట కుపయోగించును.

ఉ॥ (రామస్తు) నకరిష్యతి — (అయమ్‌తు) నగమిష్యతి.

4. వాః— వైకల్పికార్థమును బోధించుటకు.

ఉ॥ (గురుర్వా) (శిష్యోవా) పఠతి —

5. ఉత:— ఇదియును వికల్పార్థమును బోధించును. కాని వాక్యము ప్రశ్నార్థకముండె వర్తింపవలయు.

ఉ॥ కిమయకు గచ్ఛతి – (ఉత) తిష్ఠతి.

6. కచ్చిత్:— ఇది యోగక్షేమాదులను ప్రశ్నించునపు డుపయుక్తమగును.

ఉ॥ కచ్చిత్త్వమాతా కుశలినీ –

7. కిమ్:— ఇది ప్రశ్నార్థకము. ఏమి అను అర్థమును బోధించును.

ఉ॥ కింకరః కిమ్ కరోతి ? మొ॥

8. మా:— ఇది వ్యతిరేక నిషేధముల రెండింటిని బోధించును.

ఉ। త్వమ్ (మాగచ్ఛసి) – (వ్యతి). (మాగచ్ఛ) (నిషే)

9. న. నో:— ఇవియును పయి రెండర్థములయందును ప్రయుక్తములగుచున్నవి.

ఉ॥ సావిలంబమ్ (న) కరోతి (వ్యతి)
హేనిశం౯ని విలంబమ్ నకురు (నిషే)

0. ఇతి:— 'ఇది' 'అని' అను రెండర్థములందును.

ఉ రామః (ఇతి) రాజా బభూవ.
రామః అరణ్యమ్ ప్రవిష్టః (ఇతి)భరతః అజానాత్. మొ॥

ఇది హేత్వర్థమును సూచించుటకును ప్రయుక్తమగును.

ఉ। అర్జునః అశ్వత్థామానమ్ గురోః పుత్రః (ఇతి) అముంచత్.

పూర్వోక్తమగు నర్థమును పరామర్శించునపుడును దీని నుపయోగించెదరు.

ఉ॥ (ఇతి) శబ్ద పరిచ్ఛేదః — ఇతి వాక్య పరిచ్ఛేదః — ఇత్యాది.

11. నామ:— ఇదియును 'అని' అనిమొదు అర్థమునే బోధించును. కాని ఇది ఒక్క నామముల ప్రక్కనే వాడఁబడును.

ఉ॥ రామో నామ) రాజా బభూవ.
రఘువంశమ్ (నామ) రమణీయమ్ కావ్యమ్ వర్తతే మొ॥

మఱియును ఈ శబ్దము అనాదరార్థమును సూచించును. అప్పుడిది క్రియాపదము కిడపట చేరును.

ఉ॥ గచ్ఛతు (నామ) సపరాకః — తిష్ఠంతు (నామ) తేపండితాః.

12 ఇవ:— ఇదియును లౌకికావ్యయమైన 'వత్' వలెనే సామ్యమును బోధించును. కాని దానివలె నిది క్రియా సాదృశ్యమునేగాక పదార్థ సామ్యమునుకూడ బోధించును.

ఉ॥ కమలమివ ముఖమ్.

దీనిని ప్రయోగించునపుడు పోలికగల రెండు నామములకును విభక్తి వచనములు సమానములై యుండవలెను.

ఉ కమలమివ వదనమ్ — కమలస్యేవ వదనస్య
కమలానీవ వదనాని — కమలానామివ వదనానామ్.

ఇది ఒకప్పుడు కొంత సందేహాస్పదమగు నర్థమందును ప్రయుక్తమగును.

ఉ॥ వ్యాఘ్ర (ఇవ) దృశ్యతే — సర్ప (ఇవ) ప్రతిభాతి.
పశ్యామోమ్ పుష్పె రహస (శివ)

13. అథ - అథో:— తరువాత అను అర్థమందు.

ఉ॥ అథ విశ్వామిత్రో౽బ్రవీత్.

మఱి అను నర్థమందు.

ఉ॥ అథకిమ్ — మఱియేమి.

నియమార్థమందు,

ఉ॥ (అథ త్వమ్ నగచ్ఛసి (యది)

14. సహ, సార్థమ్, మొ॥ ఇవి 'కూడ' అను అర్థమందు వర్తించును. వీనిని ప్రయోగించునపుడు నామమునకు తృతీయ వచ్చును.

ఉ॥ రాజా సైన్యేన (సహ) ౽గచ్ఛతి. ఇత్యాది.

15. వినా:— 'లేకుండ' తప్ప అను నర్థములను బోధించును. దీని ప్రయోగమందు నామమునకు ద్వితీయా తృతీయా పంచములందేదియైన రానచ్చును.

ఉ॥ వాల్మీకిమ్ వినా — వాల్మీకినా వినా — వాల్మీకేర్వినా.
నాన్యః కవిర్విద్యతే. ఇత్యాది.
తృతీయమ్ లోచనమ్ వినా౽యమ్ శంకరః.
ఏతద్వినా సర్వమహమ్ కర్తుమలమ్ — ఇత్యాది.

16. అంతరేణ - అంతరా:— ఇవి వినార్థమందును కూర్చి అను నర్థమునందును ప్రయుక్తములగును. నామమున కపుడు ద్వితీయ నచ్చును.

ఉ॥ క్షమామంతరేణ జిగిమిషతి భవాన్. ఇత్యాది.

17. ప్రతి ఉద్దిశ్య:— మొ॥ నవి గురించి అను నర్థమున వాడఁబడును. అప్పుడు వీని నామములకు ద్వితీయ వచ్చును.

ఉ. వాలినమ్ ప్రతి — ఉద్దిశ్య రామః బాణమ్ వ్యసృజత్.

18. పృథక్:— వేఱుగా అని యర్థము. నామమునకు పంచమి.

ఉ. సూర్యాత్పృథక్ తేజః నస్యాత్.

19. ధిక్:— ఆక్షేప నిందాభర్త్సనాదులందు. నామమునకు ద్వితీయ.

ఉ ధిక్ రావణమ్,

20. అద్య:— నేఁడు ఇప్పుడు అను అర్థములందు.

(అద్య) గోపాలస్య వివాహః — (అద్యా) సి అయమ్‌నాయాతి.

21. అలమ్ - కృతమ్:— చాలు — వలదు.

ఉ. (అలమ్) — కృతమ్ వా అతివిస్తరేణ.

నామమునకు తృతీయ — సామర్థ్యార్థమునకూడ. నామమున కపుడు చతుర్థి.

ఉ. శత్రూణామ్ ఘాతనాయాలమ్ ఇత్యాది.

తగునట్లు — చక్కగా అను నర్థమునకూడ — అప్పుడు నామమునకు విభక్తి నియమము కానరాదు.

ఉ. వయమేతత్కార్యమలమ్ కరిష్యామః

సామర్థ్యార్థమందును విభక్తి నియమమొకప్పుడు కానరాదు.

ఉ. రామః రాక్షసాన్ హంతుమలమ్ - మాండూక్య మేకమేవాలమ్.

22. ఆరభ్య - ఆదాయ:- 'అది మొదలుకొని' అను నర్థమున, నామమునకు ద్వితీయ.

ఉ. బాల్యాదారభ్య - ఆదాయ మొ.

23. ప్రభృతి:- ఇదియును పూర్వోద్దిష్టార్థమునందే. కాని నామమునకు పంచమి.

మూషక బిలాత్ప్రభృతి.

ఒకప్పుడు 'ఆరభ్య' కును వచ్చును.

ఏలాదారభ్య. మొ.

24. అపేక్ష్య . అపేక్షయా:- తారతమ్యార్థకములు. మొదటి దాని నామమునకు ద్వితీయ రెండవదాని నామమునకు షష్ఠి.

ఉ. బాలక మపేక్ష్య - బాలకస్యా పేక్షయా బాలికైవ బుద్ధిమతీ.

25. స్థానే - ఉచితము - యుక్తము.

స్థానే భవా నేక నరాధిపస్సణ్ అకించనత్వమ్ మఖజమ్ వ్యనక్తి.

26. వరమ్:- తారతమ్యమున 'మేలు' అను నర్థమున.

ఉ (వర) మద్య కపోతశ్శ్వ మయూరాత్ - యాచ్ఞా మోఘా (వర) మధి గుణేనాథమెలబ్ధకామా.

ఇది ఒక్క వాక్యమందె అయినచో హీనార్థక నామమునకు పంచమియు, భిన్నవాక్యములందైన రెంటికిని ప్రథమయు వచ్చును. పై యుదాహరణములందు స్పష్టము.

## సంశ్లిష్ట ప్రతిపదోక్తములు.

1. నహి / నైవ } కానేకాదు / కాదుగదా { నహి / నైవ } ప్రాణినః శాశ్వతీవితుమ్ ప్రభవంతి.

2) నచేత్ నోచేత్:–

ఉ॥ బాలకత్వమ్ సమ్యక్పఠ - నోచేదుత్తీర్ణో న భవిష్యసి.

3) పరంతు. అపితు, కింతు:– భిన్నవాక్యతానియమము.

ఉ॥ దుర్యోధనః మానధన ఏవ - కింతు అధార్మికః అభూత్,

4) ప్రత్యుత– భిన్నవాక్యతా నియమము.

ఉ॥ అంతికాదాగతమ్ శత్రుమపి నావమన్యేత - ప్రత్యుత తస్యోపకర్తుమేవ చింతయేత్.

5) కిముత. కింపునః:– భిన్నవాక్య విషయమే.

ఉ॥ ఉదార చరితానామ్ హరిశ్చంద్ర రామచంద్రా దీనామేవ తాదృశీ కష్టపరంపరా దైవాదాపతితా – కిముత, కింపునః (కిమువక్తవ్యమ్ - కాగణనా - కాకథా) అస్మాకమతి స్వల్ప బుద్ధీనామ్ అనాత్మజ్ఞానామ్చ.

6) అపిచ. కించ –

ఉ। భరతః రాజ్యే బుద్ధిమ్న చకార కించ రామమ్ వనాదానేతుమ్ ప్రయత్నమాస్థితః.

7) తథాహి –

ఉ. పరదారాపహరణమ్ మహాంతమనర్థ మాపాదయేత్.
తథాహి పూర్వమేవమ్ కుర్వాణః రావణో నిధన మయాసీత్.

8) అపిచేత్ –

అపిచేత్సు దురాచారః సకృద్గంగాస్నానాన్ముక్తిమ్ లభతే.

9) అపినాము -

అపి నాహమ్ పునర్వత్సస్య దర్శన సుఖమ్
అనుభవిష్యామి ఇతి ... సల్యా అమన్యత.

10) నూనామ -

నూనమ పాపినఃపురాయు శిక్ష వేయుః.

11) కిమితి -

కిమితి త్వమ్ న్యుగ్ర విష దేహమ్.
ఇది హేత్వర్థమందును:- కిమితి రామః వాలినమ్
వ్యాపాదయత్.

12) అధికమ్ -

కిమ్ త్వమ్ సురామసిః -అధికమ్.

13) అథవా. యద్వా -

అథవా నాహమ్ గమిష్యామి. మొ.

తక్కిన అవ్యయములకు ప్రయోగములను గ్రంథముల గ్రహించునది.

ఇది

అ వ్య య ప్ర యో గ ము

---

# 6. భావార్థక ప్రయోగము.

## Use of the Abstract or Gerund.

నామములు మూర్తములను, అమూర్తములను రెండింటిని బోధించుచుండును. అందు అమూర్తార్థములను బోధించు నామములకే భావార్థకములని పేరు. ఇవియును నామములె గావున వీనికిని తక్కిన అన్ని నామములకువలెనే సప్తవిధములైన కారకములందును ప్రయోగములు సిద్ధించును. కాని వీనినట్లు వాక్యములందు ప్రయోగించునపుడు కొన్ని విశేషము లేర్పడు చుండును. కాబట్టి వానిని సావధానముగా గ్రహింపవలసి యున్నది.

భావార్థకములు 'పఠన'-'గమన' మొ॥ కేవల ధాతుజన్యములు గలవు. పఠితత్వ - పఠ్యమానత్వ మొ॥ ధాతుజ విశేషణజన్యములు గలవు. మధురత్వ మధురతా, మనుష్యత్వ - మనుష్యతా మొ॥ సామాన్య విశేషణ నామజన్యములుంగలవు ఇట్లు మూడు తెఱంగులగు భావవాచకములను వాక్యములందుపయోగించునపుడు వానికి సన్నిహితముగా సంబంధించియుండు నామమునకు *సాధారణముగా షష్ఠీ విభక్తి వచ్చుచుండును.

---

* దీని కొకప్పుడు తృతీయయు రావచ్చును. క్రింది ప్రయోగముల దెలియవచ్చును.

ఉ॥ రామస్య పఠనమ్ – రాముఁడు చదువుట.
పుస్తకస్య పఠితత్వమ్ – పుస్తకము చదువఁబడుట.
ఫలస్య మధురతా – పండు యొక్క తీయఁదనము. మొ.

ఇందు కేవల ధాతుజన్యములగు భావార్థములతో దాని నామము కర్తృరూపమునను కర్మరూపమునను సంబంధించి యుండును.

ఉ॥ రామస్య పఠనమ్ – (కర్తృ)
పుస్తకస్య పఠనమ్ – (కర్మ)

ఇది వాక్యమందు కర్తృకర్మములను పర్యాయమున ప్రయోగించునప్పటిమాట. అట్లుగాక రెండింటికి నొకసారె సమావేశమేర్పడెనేని కర్తృవాచకమునకు తృతీయయు, కర్మ వాచకమునకే షష్ఠియు ప్రాప్తించును.

ఉ॥ రావణేన సీతాయాః హరణమ్. ఇత్యాది.

మఱి ధాతుజ విశేషణజన్యములైన భావార్థకములకు కర్తృకర్మాదులగు నాలుగింటను ప్రత్యేకముగ రూపములు గలవు గావున కర్త్రర్థరూపములను వాడినపుడు వానికి సంబంధించియుండు కర్తృవాచకమునకుమాత్రమే షష్ఠియు, కర్మార్థ రూపములను వాడినపుడు కర్మకు షష్ఠి, కర్తకు తృతీయయు నేర్పడుచుండును.

ఉ॥ రామస్య లిఖితవత్వమ్ – కర్తృ
రామేణ పత్త్రస్య లిఖితత్వమ్ – కర్మ

ఇఁక నామవిశేషణాది జన్యములకెల్ల నామములు ఆధారాధేయాది సామాన్యరూపముననే సంబంధించి యుండుటవలన

వాని కన్నిటికిని సామాన్య సంబంధకారకమును బోధించు షష్ఠీ విభక్తియె రావలసియున్నది.

ఉ॥ విభీషణస్య సుజనత్వమ్
రావణస్య రాక్షసత్వమ్, ఇత్యాది

ఇట్లు భావార్థక ప్రయోగములందెల్ల తత్సంబంధి నామములకు తఱుచుగా షష్ఠీ విభక్తియె వచ్చుచున్నది. ఇట్టి సంప్రదాయము కేవలమొకటి సంస్కృతమునందెగాక తత్సోదరీకా ప్రాయములైన ఆంగ్లము హిందీ మొ॥ భాషలం దిప్పటికిని చూడవచ్చును.

మై కమింగ్, హిజ్ గోయింగ్ (ఆంగ్లము)
మేరా ఆనా – ఉస్ కా జానా (హిందీ.)

కాని తెలుగునందు మాత్రమిట్టి సంప్రదాయము చూపట్టుటలేదు. ఇందు భావార్థకముతోడ సంబంధించియుండు నామములకు కర్త్రర్థమున ప్రథమయు, కర్మార్థమున ద్వితీయయు వచ్చునేగాని షష్ఠి రానేరదు.

ఉ। రాముడు వచ్చుట – కర్త.
రావణుని చంపుట – కర్మ.

మఱి భావార్థక శబ్దము కర్మార్థమునందుండెనేని కర్మ వాచక నామమునకును ప్రథమయే వచ్చును.

ఉ రావణుడు చంపబడుట – ఇత్యాది.

ప్రాచీనాంధ్రమునందు మాత్రము షష్ఠ్యంత ప్రయోగములు కొన్ని లేకపోలేదు.

నా వచ్చుట — వాని కోరుట. మొ।

ఇవి సంస్కృత ప్రభావముచేత తెలుగున సంక్రమించి యుండును. ఇప్పటి తెలుగున మాత్రమివి కానరావు. మఱియును తెలుగునందిట్టి షష్ఠ్యంతత్వము లేకుండుట ధాతు, ధాతుజ విశేషణాజన్య విషయమునందె. తక్కిన భావార్థముల ప్రయోగ మందుమాత్రము తెలుగునందుకూడ సంస్కృత మర్యాదయే కానఁబడుచున్నది.

ఉ॥ ఫలము (యొక్క) తీయఁదనము.
జలము (యొక్క) వెచ్చదనము. ఇత్యాదులు.

కాని మొదటి రెండు తావులందు మాత్రమిట్టి షష్ఠ్యంత సంప్రదాయము లేకుండుటచేత తెలుగు వాక్యములను సంస్కృత మునకు మార్చునపుడు భావార్థక నిర్మాణమున కొంత క్లేశము వాటిల్లును. దానిని విద్యార్థులు ప్రయత్నపూర్వకముగా నివా రించుకొననలయు. ప్రస్తుతము కొన్ని భావార్థకముల పరివర్తన మార్గములను ప్రదర్శించెదను. పరిశీలించుఁడి.

| | తెలుగు | సంస్కృతము. |
|---|---|---|
| 1) | రాముఁడు వచ్చుట | రామస్య ఆగమనమ్ |
| 2) | రాముడు వచ్చినవాడగుట | రామస్య ఆగతత్వమ్ |
| 3) | పుస్తకము చదువుట | పుస్తకస్య పఠనమ్ |
| 4) | పుస్తకము చదువబడుట | పుస్తకస్య పఠితత్వమ్ |
| 5) | రాముడు పుస్తకము చదువుట | రామేణ పుస్తకస్య పఠనమ్ |

| | | |
|---|---|---|
| 6) | రామునిచే చదువఁబడుట | రామేణ పుస్తకస్య పఠితత్వమ్ |
| 7) | రాముడు పూజ్యుడగుట | రామస్య పూజ్యత్వమ్ |
| 8) | ఇది నేనుచేయవలసినదగుట | అస్య మయా కర్తవ్యతా |
| 9) | నీవు నాకు చెప్పియుండుట | త్వయా మమాభి హితత్వమ్ |
| 10) | గురువు బాలుని కఱ్ఱతో కొట్టుట | గురుణా బాలకస్య దండేన తాడితత్వమ్. |

పయి వాక్యములందెల్ల భావార్థకముల ప్రయోగ వైచిత్రిని చూడవచ్చును. అంతియకాదు. ధాతుజ విశేషణ రూప పరివర్తనమునందుకూడ సంస్కృతాంధ్ర విసంవాదమును గుర్తింపవచ్చును.

భావార్థక ప్రయోగములనెల్ల శబ్ద సామాన్యములుగాఁ గాక (words) వాక్యైక దేశములుగ (Phrases) భావింప వచ్చును

ఉ॥ పుత్రః (పితురాగమనేన) తుష్యతి.
(కింకరేణ నియోగస్య అకృతత్వాత్) స్వామీ
కుప్యతి — మొ॥

భావార్థక నిర్మాణము సాధారణముగ సంస్కృతమున రెండర్థములందు కానవచ్చును. అవి శాస్త్రాది గ్రంథముల దత్యంత ప్రసిద్ధములు.

1. హేతువు:— ఇందు భావార్థమునకు తృతీయా పంచములు ప్రాప్తించును.

ఉ॥ అస్యవచనస్య ప్రామాణికత్వేన – ప్రామాణికత్వాత్.

2. ప్రకారము:— ఇందు దీనికి తృతీయయే వచ్చును.

అస్యవచనస్య (ప్రామాణికత్వేన) గృహీతత్వాత్.

లేదా

ఇదకువచనమ్ (ప్రామాణికత్వేన) ఉపచర్యతే.

ఇత్యాది,

ఇది

భావార్థక ప్రయోగము.



# 7. భావలక్షణ ప్రయోగము.

## Use of the Absolute.

---

ధాతుజ విశేషణములకన్నిటికి సంస్కృతమునందొక విలక్షణమైన ప్రయోగముగలదు. దానికే భావలక్షణమని పేరు. ఒక వాక్యము రెండు వ్యాపారములను బోధించుచు అందొకటి మఱియొకదాని నాశ్రయించి యుండెనేని అట్లాశ్రయించియుండు వాక్యఖండమునకు భావలక్షణమని వ్యవహారము. దీని ప్రయోగించునపుడు గమనింపవలసిన ముఖ్యాంశముల పేర్కొనియెదను-పరిశీలింపుడు —

1. వాక్యము అభిన్నముగా నుండవలయును.
2. అందు పరస్పరాశ్రయములగు వ్యాపారములను రెంటిని ప్రతిపాదింపవలెను.
3. వానిలో లక్షణ భూతమైన అప్రధాన వ్యాపారమును భావలక్షణము చేయవలెను.
4. అట్టి భావలక్షణ ఖండమందు సమాపకక్రియ వాడరాదు. ధాతుజ విశేషణమునే ప్రయోగింపవలెను.
5. దానికిని ప్రధాన వాక్యభాగమునందలి సమాపక క్రియకును ఉద్దేశ్యపదము (కర్తృ కర్మభావములు) వేర్వేఱుగ నుండవలెను.

6. ధా. విశేషణము - దాని ఉద్దేశ్యము - దానికిఁగల ఇతర విశేషణములు మాత్రము సప్తమీ విభక్తియందుండవలెను.

* 7 'సత్' అను 'అస్' ధాతుజ విశేషణరూపమును ధా. విశేషణమునకు కొన్నిచోట్ల వైకల్పికముగా చేర్పవచ్చును.

8. 'అస్' ధాతుజ విశేషణము భావలక్షణమందు ప్రయుక్తమైనయెడల దానికి మరల 'సత్' రూపమును చేర్పరాదు.

ప్రయోగములు.

1. రామే గృహమ్ గచ్ఛతి (సతి) వర్షః అపతత్.
   రాముఁడింటికిఁబోవుచుండగా వర్షము పడెను.
2. బాలకేషు చిత్రమ్ పశ్యత్సు (సత్సు) గురవః కుప్యంతి.
3. ప్రవహంత్యామ్ (సత్యామ్) నద్యామ్ వయమ్ నౌభి స్తరామః
4. మహిళాసు ఆగతాసు (సతీషు) సభాయామ్ కలకలః ఉదతిష్ఠత్.
5. బాలికాయామ్ పఠంత్యామ్ (సత్యామ్) బాలకస్తూష్ణీమ్ తిష్ఠతి
6. రామే సతి కిమ్ భయమస్మాకమ్. ఇత్యాది

తెలుఁగున పోవుచుండగా, పోవగా, పోయిన మొ॥ భావములను వ్యక్తముచేయునట్టి తావులందు సంస్కృతమున నీభావలక్షణము నుపయోగింతురని గ్రహింపవలెను.

భావలక్షణము తఱచుగా నాలుగు అర్థవిశేషములందు ప్రయుక్తమగుచుండును.

---

* ఇచ్చట 'సత్' అనునది మూలరూపము. ఉద్దేశ్య పదమును బట్టి దీనికిని లింగ విభక్తి వచనము లేర్పడును.

1. యౌగపద్యము:— రెండు క్రియావ్యాపారములును ఒక్కసారి జరుగుట.

ఉ॥ వర్షే పతతి (సతి) బాలకః బహిస్సచ్ఛతి.

2. ఆనంతర్యము:—ఒకటి జరిగినతరువాత వేఱొకటి జరుగుట

ఉ॥ భాస్కరేఽస్తంగతే (సతి) వయం గ్రామాంతర మగచ్ఛామ.

3. హేత్వర్థము:— కార్యకారణ భావమును నిరూపించుట.

ఉ॥ మేఘే వర్షతి బహిర్న గచ్ఛామః.

4. నియమార్థము:— షరతును ప్రతిపాదించుట.

ఉ॥ త్వయ్యాగతే అహమ్ గమిష్యామి. మొ॥

భావలక్షణ ఖండము కర్త్రర్థమునందువలె కర్మార్థమందును వర్తింపవచ్చును. అప్పుడు ప్రధాన వాక్యభాగముకూడ నట్లే మార్పుచెందవలెనను నియమములేదు.

ఉ॥ బాలకే జనకేన(తాడ్యమానే సతి) మాతా దుఃఖేనరోదితి.

మొ॥

మఱియును భావార్థకమునలెనే భావలక్షణప్రయోగము కూడ వాక్యమునందేకదేశముగ (Phrase) నేర్పడియున్నదని గ్రహింపవలెను.

ఉ॥ (ధూమస్య కాలిమ్నా ఆచ్ఛాదితేషు తరూణామ్ శిఖరేషు.)
దుష్యంతః ఋషీణా మాశ్రమాణా నికటస్థానమన్వత.
(అర్జునేనైకేన నిరంతర బాణధారాభిః ప్రవృష్య
సర్వస్మిన్నపి కౌరవ బలేఽపయము పనీతే) పాండవాః
మహాంతమానంద మవాప్నువణ.

ఇత్యాది.

మఱియును భావలక్షణమునందు ముఖ్యములైన శబ్దము లకు సప్తమీ విభక్తియె వచ్చుటవలన దీనికి 'సతి సప్తమీ' ప్రయోగమనియు నామాంతరముగలదు. కాని కొన్నిచోట్ల సప్తమికి బదులు షష్ఠియును ప్రయోగింపఁబడుచుండును. ప్రాచీనులు దీని ననాదర షష్ఠియని వ్యవహరించిరి. అనాదర భావము చూపు తావులందే దీనిని వాడవలెనని వారి యుద్దేశము.

ఉ. పశ్యతః పశ్యతః ధనమపాహరత్.

కాని లక్ష్యానుబోధకముగా చూచినయెడల దీనికీ యనాదరార్థమందే కాని సప్తమికివలె నన్నియర్థములందును ప్రయోగములున్నట్లు తోచుచున్నవి.

ఉ. సీతాయాః పృచ్ఛంత్యాః (సత్యాః) రామస్సర్వ మదర్శయత్. ఇత్యాది.

ఇచ్చట సత్ అను దానికిని, ఉద్దేశ్యపదమునకును దాని విశేషణమునకును అన్నింటికిని సప్తమిగాక షష్ఠి రావలెనని గ్రహించునది.

ఇట్టి షష్ఠీ ప్రయోగములందు వాక్యికముగా సప్తమికిని తావుగలదనియు గుర్తించునది.

సీతాయాః పృచ్ఛంత్యాః } షష్ఠి } ఇత్యాది.
సీతాయామ్ పృచ్ఛంత్యామ్ } సప్తమి }

ఇది

భావలక్షణ ప్రయోగము

# 8. సంబంధార్థక శబ్దప్రయోగము.

## Use of the relatives.

---

అవ్యయ ప్రకరణమునందు కొన్ని జంట శబ్దము లుదాహరింపఁబడినవి. వీనికి సంబంధార్థకములని పేరు. వీనియందున్న శబ్దములెల్ల తఱుచుగా అవ్యయములే అయినను, సర్వనామములును కొన్ని కలిసియున్నవి. సంబంధార్థకము లనిన మాత్రాన అవి యెప్పుడును అవినాభూతములై యుండవలెనని భ్రమింపరాదు. వానిలో మొదటిదైన యచ్ఛబ్దార్థము పరాశ్రయమై యుండును గాని తచ్ఛబ్దార్థక మట్లుగాదు. దానికి స్వతంత్ర ప్రయోగమును గలదు.

ఉ. తదైవ కరిష్యామి — తత్కిమస్తి — తావదహమ్యాస్యామి

కాని యచ్ఛబ్ద సాహచర్యమందు ప్రయుక్తమైయున్నపుడు మాత్రము రెంటికిని అవినాభావరూప సంబంధముగలదు. వీని రెంటిని ప్రయోగించునెడ గుర్తింపవలసిన ప్రధానాంశములు పేర్కొనియెదను. పరిశీలించునది.

♦ 1 యదర్థకవాక్యము — తదర్థకవాక్యము రెండును చేరి ఒకేఒక సంశ్లిష్టవాక్యముగ నేర్పడును.

---

♦ ఆంగ్ల పరిభాషను బట్టి ఇందు మొదటిదానిని 'Subordinate clause' అని రెండవదానిని Principal clause అని పేర్కొనవచ్చును.

2 రెండింటియందును కర్తృకర్మ క్రియాపదములు వేర్వేఱుగ నుండును.

3 ఒకప్పుడు తదర్థక వాక్యము లోపింపవచ్చును గాని యదర్థకవాక్యము లోపింపదు.

4 యత్తదర్థక శబ్దములు సర్వనామములైనయెడల వానికి విభక్తి సామ్యము లేకున్నను లింగవచన సామ్యము మాత్రము నియతముగా నుండవలెను

5 యత్తదర్థక వాక్యముల పౌర్వాపర్యము మాఱవచ్చును.

6 ఉపోద్ఘాత ప్రకరణమున నిర్దేశించిన ఇతరాంశములను కూడ ఇచ్చట ననుసంధానము గావించుకోవలెను.

---

## సంబంధార్థములు — సర్వనామములు.

### 1. యత్ - తత్.

1. యః కాశీమ్ గచ్ఛతి — సః విశ్వేశ్వరమ్ ప్రణమతి.
2. యస్య విత్తే స్పృహా — స సర్వథా వినశ్యతి.

### 2. యావత్ - తావత్.

1. యావత్తవ బుద్ధిబలమ్ తావదేవ గృహీతుమ్ శక్నోషి.
2. యావానర్థ ఉదపానే తావానే వయోఽస్మింసారే.

---

## సంబంధార్థములు — అవ్యయములు.

### 1. యత్ — తత్.

1. తదహమ్ జానామి యత్త్వమ్ కురుక్షేత్రమ్ గతః.
2. రామః కథయతి యన్మమ పితా ఆగమిష్యతి.

3. యదహమ్‌త్వామ్ పృచ్ఛామి తత్కేవలం త్వత్ప్రేమసాధనార్థమ్.
4. ఖర్వాటోమృతః యత్తస్య శిరసి తాళఫల మపతత్.
5. యదేతద్వృత్తమ్ తదతీవానర్థకారి
6. పుస్తకమ్ యదహమన్విష్యామి.
7. సర్పోయదహమ్ బిభేమి.
8. ధన్యో యద్భక్తిర్భగవతి మనుష్యాణామ్. ఇత్యాది.

ఇవి అన్నియు నొకదానికే ఉదాహరణములు. అన్నిటియందు ప్రయుక్తములైన వాక్య యత్తత్పదములే అయినను అనేకార్థములందు వాడఁబడినవి. ఇట్లు తరువాతి ప్రయోగములందన్నింట నెఱుంగునది. ప్రకరణాదులనుబట్టి తత్తదర్థముల నూహింపవలయును.

## 2. యావత్ – తావత్.

1. యావదహ మాగచ్ఛేయమ్ తావత్త్వమత్రైవ వస.
2. తిష్ఠ యావదహమ్ నివర్తిష్యే
3. యావదహమాగత స్తావదసౌ ప్రణష్టః –
4. హరిద్వారమ్ యావన్మమ ప్రయాణమ్.
5. నైతద్వక్తవ్యమ్ పునః యావతాయమర్థః ప్రాగేవసిద్ధః.
6. సందర్భః గ్రంథః పుస్తకమితి యావత్.

## 3. యథా — తథా.

1. యథా రామస్తథా భరతోఽపిమే ప్రియః.
2. యథా ఽంతరాయో నభవతి తథా దేవో మా మనుగృహ్ణాతు.
3. గచ్ఛయథా విలంబోనస్యాత్.
4. సర్వేజానంతి యథాపూర్వమ్ యుధిష్ఠిరః దురోదర వ్యసనేన దాయాదైరపహృత సర్వస్వః భ్రాతృభిర్జాయయా చ సార్థమ్ అరణ్యాన్య శిశ్రియత్.

5. [illegible] వివర్తముల్లక్ష్యతే తథా నియత మసౌ తత్ర సభా [illegible] పరాభవమ్ ప్రాప్తవానేవ
6. [illegible] భగవాన్ వల్మీకజన్మా.
7. [illegible] వక్ష్యతి – యథాహి (తథాహి) పూర్వమ్ [illegible] శ్యకుంతలా యాః ప్రస్తవే.
8. రామస్తథా లక్ష్మణః వనమగచ్ఛత్.

## 4. యదా – తదా

1. యదాయమ్ గతః తదాత్ర నకశ్చిదాసీత్.
2. యదా [illegible] దేవమస్తి తదాకః కిమ్కుర్యాత్
3. యదాత్వమ్ పుస్తక మేవనవిలోకసే కథమివ పరీక్షా ముత్తరిష్యసి.
4. కథ[illegible]వ సుఖమ్ యదా సదైవమే దారిద్ర్యమ్ వర్తతే.
5. కోపేత్తి యదాయమ్ పలాయితః

## 5. యత్ర – తత్ర.

1. యత్ర రామస్తత్ర హనుమాన్.
2. గచ్ఛామి యత్ర మే బంధుజనః.
3. కథము వ్రజతి మాతా యత్ర శిశుః రోదితి.
4. కథమివనిత్యాః అర్థాః యత్ర తేషామవస్థానమేవ నదృశ్యతే క్షణమపి.
5. యత్ర పావకోఽ[illegible] భూత్ తస్యామ్ సీతాయాః అపి లోకాప వాద ఇతి చిత్రా జగతః ప్రవృత్తయః.

## 6. యతః – తతః.

1. యతో దృష్టిః ప్రవిశ్యాప్యతే తతో విషాదః ప్రాణినామప్యవలోక్యతే.

* ఇది 'తథా' అనుదానికి వ్యస్త ప్రయోగము. సముచ్చయమును బోధింపను.

2. యత స్త్వమా యాత స్తతో హామపి.
3. యస్మాచ్ఛిష్యః అవినయమకరోత్ తతః గురుస్తమ్ దండయతి.
4. చంద్రో౾యమ్ యతోరాత్రౌ ప్రకాశతే.
5. నజ్ఞాయతే యత ఇదముత్పన్నమ్.

## 7. యది (చేత్) — తర్హి (తదా)

1. యదిత్వమ్ గచ్ఛసి (చేత్) తర్హ్యహమపి.
2. కరిష్యతి యద్యయమ్ గమిష్యతి.
3. యదిగతస్యాత్ తర్హి అగత ఏవస్యాత్.
4. అహమ్ పృచ్ఛామి యద్యయమ్ గృహమాగతః.
5. అన్విష్యామి యది పుస్తకమ్ దృశ్యేత.
6. యదినామాయమ్ గమిష్యతి తదావరమ్

## 8. యద్యపి — తథాపి (ఏవమపి)

1. యద్యపి కస్యచిద్వ్యయ మపకారమ్ నకుర్యాస్తథాపి. దుష్టేభ్యోభయ మవశ్యమ్ శంక్యేత.

## 9. నకేవలమ్ — కింతు — పరంతు — అపితు.

1 (నకేవలమ్) కీచకః (కింతు) తదర్థ మ్తస్యభ్రాతరః ఉపకీచకా అపిభీమేన నిషూదితాః.

ఇట్లు కొన్ని ప్రసిద్ధములైన ప్రయోగములుమాత్రము చూపఁబడినవి. ఇంకను గ్రంథములనుబట్టి విచిత్రములైన ప్రయోగములనెల్ల విద్యార్థులు సేకరింపవలయును.

ఇది

సంబంధార్థక శబ్ద ప్రయోగము.

# 9. పరివర్తనము.

## Transformation of Sentences.

---

కడచిన ఏడధ్యాయములందును నామక్రియాద్యులైన శబ్దములను వానికి సంబంధించిన భావార్థకాది శబ్దవిశేషములను వరుసగా నుపయోగించుచు వాక్యములను నిర్మించు విధానములు సోదాహరణముగా నిరూపింపఁబడినవి. ప్రస్తుతమట్లు నిర్మింపఁబడిన వాక్యములకు సంభవించెడు పరివర్తనమార్గములు ప్రదర్శింపఁబడును. దీనిమూలమున సంస్కృతమునందొక అభిప్రాయము నెట్లు వ్యక్తము చేయవలెననియేగాక ఎన్ని ప్రకారములుగా వ్యక్తీకరింపవచ్చునను రహస్యముకూడ గ్రహించుటకు శక్యమగును. ఇట్టి వాక్య పరివర్తన ప్రకారములను ముఖ్యములైనవానిని గొన్నింటిని మాత్రము నిర్దేశించెదను. శేషవానిని లక్ష్యములనుబట్టి గ్రహించునది.

### 1. భావ వ్యతిరేకాదికము.

భావ : బాలకః క్షీరమ్ పిబతి

వ్యతి : బాలకః క్షీరమ్ నపిబతి

విధి : బాలక క్షీరమ్ పిబ

వ్యతి. ద్వాయ : న బాలకః క్షీరమ్ నపిబతి.

## 2. కర్తృ కర్మాదికము.

కర్తృ : భృత్యః నియోగమ్ కరోతి
కర్మ : భృత్యేన నియోగః క్రియతే
ప్రే. కర్తృ : స్వామీ భృత్యేన నియోగమ్ కారయతి
ప్రే. కర్మ : స్వామినాభృత్యః నియోగమ్ కార్యతే

## 3. తారతమ్యాదికము.

ప్రథమ : స్వర్ణమివ నోజ్జ్వల మన్యత్
మధ్యమ : అన్యస్మాత్స్వర్ణమే వోజ్జ్వలతరమ్
ఉత్తమ : సర్వేషామ్ మధ్యే స్వర్ణమేవోజ్జ్వల తమమ్.

## 4. సమాపక - విశేషణములు.

సమా : రామస్య పరాక్రమః విద్యతే
విశే : రామః పరాక్రమవాన్.

## 5. సమాపక -ధాతుజములు.

సమా : రావణ స్సీతా మపాహరత్
ధాతుజ : రావణ స్సీతా మపహృతవాన్
సమా : త్వమ్ గ్రామమ్ గచ్ఛేః
ధాతుజ : త్వయా గ్రామమ్ గంతవ్యమ్

## 6. అసమాపక - ధాతుజములు.

అసమా : బాలకః అన్నమ్ భుక్త్వా విద్యాగృహాయ గచ్ఛత్

ధాతుజ : అన్నమ్ భుక్త్వా బాలకః విద్యాగ్రహ
మగచ్ఛత్

అసమా : వృక్షాత్ ఫలమ్ పతిత్వా ఖర్వాటస్య
మస్తకమఘట్

ధాతుజ : వృక్షాత్ పతితేన ఫలేన ఖర్వాటస్య మస్తక
మపలత్

అసమా : గంగాయామ్ స్నాత్వా శుద్ధో భవతి

ధాతుజ : గంగాయామ్ స్నాతః శుద్ధో భవతి

7. అసమాపక – సమాసములు.

అసమా : రామః రాజ్యమ్ త్యక్త్వా వనమ్ గతః

సమాస : రామః త్యక్తరాజ్యో వనమ్ గతః

8. అసమాపక – భావార్థములు.

అసమా : హనుమాన్ సీతామ్ ద్రష్టుమ్ వారిధి
మలంఘయత్

భావ : హనుమాన్ సీతాయాః దర్శనాయ వారిధి
మలంఘయత్

9. భావలక్షణ – ధాతుజములు.

భావలక్షణ : చోరే ధనమపహృత్యధావతి (సతి)
తమను ధావంతి రాజపురుషాః

ధాతుజ : చోరమ్ ధనముపహృత్య ధావంతమ్
అను ధావంతి రాజపురుషాః
భావల : శిశౌ మృతే బాంధవా శ్శోచంతి
ధాతుజ : మృతమ్ శిశు మను శోచంతి బాంధవాః.

10 భావలక్షణ — సమాపములు.

భావల : సూర్యేణ తప్యమానే శరీరే మహతీ
మమ వ్యథాఽభవత్
ధాతుజ : సూర్యేణ తప్యమాన శరీరస్య మమమహతీ
వ్యథాఽభవత్

11. భావలక్షణ — అసమాపకములు.

భావల . శ్రీశైలస్య శిఖరే దృష్టే ముక్తిర్భవతి
అసమా : శ్రీశైలస్య శిఖరమ్ దృష్ట్వా ముక్తిర్భవతి
భావల : లోకానుభవే ప్రాప్తే జాగరూకో భవతి జనః
అసమా : లోకానుభవమ్ ప్రాప్య జాగరూకో భవతి జనః

12. ధాతుజ — భావార్థకములు.

ధాతుజ : రామో దృష్టః
భావ : రామస్య దర్శనమ్ కృతమ్
ధాతుజ : బాంధవాః ఆగతాః
భావ : బాంధవానా మాగమనమ్ సంజాతమ్

...శుజ : పుత్రేణ దృష్టేన మాతుస్సుఖమ్ సంపద్యతే.
...వ : పుత్రస్య దర్శనేన మాతుస్సుఖమ్ సంపద్యతే.

## 13. సంబంధా — సంబంధార్థకములు.

...ం : జానామి యదయమ్ గుణవాన్
...సం : అయమ్ గుణవాన్ ఇతిజానామి
...ం : యో(త్రాగతః సరామః
...సం : అత్రాగతో రామః
...ం : యథారాజావర్తతే తథాప్రజాః అపివర్తంతే
...సం : రాజా ఇవ ప్రజావర్తంతే
...ల : యన్మమసఖా ఆనయత్ తదహమ్ పఠామి
...సం : మమసఖ్యా ఆనీత మహమ్ పఠామి
...ం : యత్రాలోకః తత్రైవచ్ఛాయా
...సం : ఆలోకేన సహైవచ్ఛాయా
...ం : యత్ర పురాపర్ణగృహమ్ తత్ర
అధునారక్షసామ్ నివాసః.
...సం : పర్ణగృహస్య స్థానే అధునా రక్షసామ్ నివాసః
...ః : యదావర్షః అపతత్ తదాసస్యాని అవర్ధంత
...సం : వర్షేపతితే సస్యాన్య వర్ధంత
...ం : యదాగురు శ్శిష్యమపశ్యత్ తదైవ తమ్
దండేన అతాడయత్
...సం : శిష్యమ్ దృష్ట్వైవ (దృష్టమాత్రమ్ — పశ్యన్నేవ)
గురుస్తమ్ దండేన అతాడయత్

సం : యతో రామః జగదపాలయత్ తతఏవ
ఈతయః నాభవన్

అసం : రామే జగత్పాలయతి ఈతయః నాభవన్.

సం : యతో రామో దృష్టః తతస్తుష్టా మహర్షయః

అసం : రామస్యదర్శనేన (దర్శనాత్) తుష్టా మహర్షయః

సం : యది పుస్తకాని పఠ్యంతే శ్రద్ధయా
తదాత్వమ్ సఫలో భవిష్యసి

అసం : పుస్తకేషు శ్రద్ధయా పఠ్యమానేష్వేవ
త్వమ్ సఫలో భవిష్యసి

సం : యదికాశీమ్ గచ్ఛంతి తర్హి ముక్తిమ్ లభంతే

అసం : కాశీమ్ గత్వా (గతాః) జనాః ముక్తిమ్ లభంతే.

సం : యదివర్షః పతతి తర్హి సస్యానామ్ ప్రరోహః

అసం : వర్ష పాతాదేవ –వర్షపతత్వేన సస్యానామ్ ప్రరోహః

సం : యది పితా నయాతి తదా సుతోఽపి

అసం : పితరమ్ వినాసుతో నయాతి

సం : యద్యాచార్యోగచ్ఛతి తదా ఛాత్రా అపి

అసం : గచ్ఛంత మాచార్య మనుగచ్ఛంతి ఛాత్రాః

సం : యస్మాత్స పండితస్తస్మాన్మితమ్ భాషతే

అసం : పండితత్వా దేవ సః మితమ్ భాషతే

సం : యావదహమ్ ప్రత్యాగచ్ఛామి తావదత్రైవవస

అసం : మమాగమనమ్ యావత్ – మమా
గమనపర్యంతమ్ – త్వమత్రైవవస

### 14. అనేకములు — ఏకములు.

అనేక : ఆచార్యః గృహమగచ్ఛత్ స్నానమకరోత్

ఏక : ఆచార్యః గృహమ్ గత్వా (గతః) స్నానమకరోత్

అనేక : పితా గ్రామాంతరాత్ ప్రతినివృత్తః
తస్మాద్బాలకః గృహమ్ గతః

ఏక : గ్రామాంతరాత్ప్రతినివృత్తమ్.
పితరమ్ ద్రష్టుమ్ బాలకోగృహమ్ గతః

అనేక : సర్వేజనాః సుప్తాః
చోరః శనైః గృహమ్ ప్రావిశత్
ధనమపాహరత్
పశ్చాత్ అతశ్శీఘ్రమ్ పలాయితః
తమ్ రాజభటాః అన్వధావన్

ఏక : సర్వేషు జనేషు సుప్తేషుచోరః
శనైః గృహమ్ ప్రవిశ్య (ప్రవిష్టః)
ధన మపహృత్య పశ్చాత్ యావత్
శీఘ్రమ్ పలాయితః తావత్ రాజ
పురుషాః తమన్వధావన్

అనేక : గజః వృక్షమపాతయత్
తస్యఫలాని సర్వతః ప్రకీర్ణాని

ఏక : గజేన పాతితస్య వృక్షస్య ఫలాని
సర్వతః ప్రకీర్ణాని.

అనేక : రావణేనాపహృతా జానకీ

ఏతాన్ వార్తాన్ రాఘవః అశృణోత్
సః దైవాత్ సుగ్రీవేణ సంగతః
తస్య సాహాయ్యేన తమ్ రాక్షస మజయత్
మైథిలీమ్ చ అయోధ్యామానయత్

ఏక : రావణేనాపహృతా జానకీ ఇతి
వార్తామ్ శ్రుత్వా రాఘవః దైవాత్
సుగ్రీవేణ సంగతః తస్యసాహాయ్యేన
తమ్ రాక్షసమ్ జిత్వా మైథిలీ
మయోధ్యా మానయత్.

అనేక : బాలికాయాః కరతలాజ్జనన్యా
క్రీడనకమ్ అపహృతమ్
అతస్సా భృశమ్ రోదితి

ఏక : బాలికా కరతలాజ్జనన్యా
అపహృతే క్రీడనకే భృశమరోదీత్.

అనేక : అహమ్ తవైకమ్ పుస్తకమదామ్
తన్మే అధునా ప్రత్యర్పయ

ఏక : యదహమ్ పుస్తకమ్ తవాదామ్ తన్మేప్రత్యర్పయ
మయా తే దత్తమ్ పుస్తకమ్ మహ్యమ్ ప్రత్యర్పయ.

అనేక : దుశ్శాసనః ద్రౌపదీమ్ పరాబభూవ
ఏతామ్ కథామ్ సర్వేజానంతి

ఏక : దుశ్శాసనః ద్రౌపదీమ్ పరాబభూవ
ఇతి కథామ్ సర్వేజానంతి

సర్వేజానంతి యద్దుశ్శాసనః ద్రౌపదీమ్ పరాబభూవ

అనేక : వర్షః అవశ్యమ్ పతేత్
అన్యథా నాపైతి దుర్భిక్షదోషః

ఏక : వర్షశ్చేన్న పతేన్నాపైతి దుర్భిక్షదోషః
అపతితేవర్షే నాపైతి దుర్భిక్షదోషః

అనేక : మధుకరైః మకరందరసః పీతః
అతఃపుష్పాణి రిక్తాని సంవృత్తాని

ఏక : మధుకరైర్మకరంద రసస్యపీత
త్వాత్ పుష్పాణిరిక్తాని సంవృత్తాని
మధుకరైఃపీతే మకరందరసే
పుష్పాణి రిక్తాని సంవృత్తాని
మధుకరైర్మకరందరసః పీతో
యస్మాత్తస్మా త్పుష్పాణి రిక్తాని సంవృత్తాని
మధుకరైర్మకరందరసః పీత ఇత్యత
ఏవ పుష్పాణి రిక్తాని సంవృత్తాని
పుష్పాణి రిక్తాని సంవృత్తాని యేన
(యతః – యస్మాత్) మదుకరైః
మకరందరసః పీతః.

ఇత్యాది.

అనేక : ఈశ్వరః కామమ్ భస్మసాచ్చకార

తతస్స స్త్రీణాం సన్నికర్షమ్ పరిహర్తు మైచ్ఛత్
సద్యః అంతర్ధానమకరోత్
అథపార్వతీ తత్సర్వమ్ వ్యలోకయత్
ఆత్మనః సౌందర్యమ్ నిరర్థక మమన్యత
తపసా ఈశ్వరస్యపాణిమ్ గ్రహీతు మియేష
స్వాభిప్రాయమ్ జనన్యై న్యవేదయత్
సా బహుధా న్యవారయత్
కింతు సా మాతుర్వచనమ్ నా కర్ణయత్.
తపశ్చరితుమ్ వనమ్ జగాహే.

ఏక : ఈశ్వరేణ కామమ్ భస్మసాత్
కృత్వా స్త్రీణామ్ సన్నికర్షమ్ పరి
హర్తు మిచ్ఛతా సద్యః కృతే అంత
ర్ధానే తత్సర్వమ్ విలోకితవతీ
పార్వతీ ఆత్మన స్సౌందర్యమ్
నిరర్థక మితిమత్వా తపసా
తస్యపాణిమ్ గ్రహీతుమ్
మిచ్ఛంతీ యదా స్వాభిప్రాయమ్
జనన్యై న్యవేదయత్ తదాతయా
బహుధా నివార్యమాణా సతీ
తద్వచన మనాకర్ణ్య తపశ్చ
రితు మేవ వనమ్ జగాహే.

ఇత్యాది.

## 15. ఏకములు – అనేకములు.

వీనిని ప్రత్యేకముగా పేర్కొనఁబనిలేదు. ఏకీభూతములైన వాక్యములను మరల యథాపూర్వముగ పరివర్తితము గావించితిమేని అవి వీని కుదాహరణ ప్రాయములగుచున్నవి. పాఠకులు వానిని స్వయముగా సాధింపవచ్చును. ఇట్లు ఈవిధములైన వాక్యపరివర్తనములకు యథావకాశముగా నుదాహరణము లీయఁబడినవి ఇంకను విశేషములుండెనేని వానినన్నిఁటిని లక్ష్యప్రపంచమునుబట్టి యూహించునది.

ఇది
వాక్య పరివర్తనము

---

# 10. సింహావలోకనము.

## Conclusion.

---

ఇప్పటికి శబ్దప్రయోగ విధానమును, వాక్యపరివర్తన ప్రకారమును సమాప్తములైనవి. కాని యీయెల్ల అనేక విధములైన విశేషాంశములతో నా యా ప్రకరణములందు విప్రకీర్ణముగా నిరూపితములయియున్నవి, వానినన్నిటిని పరిశీలించుటకుగాని తదంతర్లీనములైయున్న ప్రధానాంశములను చక్కగా గుర్తించుటకుగాని ఆరంభకులగు విద్యార్థులకంత నైపుణ్యము చాలక పోవచ్చునని నాకుఁగొంత యనుమానము పొడముచున్నది. కాఁబట్టి ఆయా ప్రకరణములందు నేను వరుసగా ప్రతిపాదించుచు వచ్చిన ముఖ్యాంశములను మాత్రము క్రోడీకరించి ఒక్కచోట కనఁబఱిచెదను. పాఠకులు గుఱుతించునది—

విధేయము.

పఠతి

ఉద్దేశ్య విధేయములు.

బాలకః పఠతి.

కారకములు.

కర్త:— బాలకః పఠతి.

కర్మ:— బాలకః పుస్తకమ్ పఠతి.

కరణః— బాలకః శ్రద్ధయా పుస్తకమ్ పఠతి.

సంప్రదానః:- బాలకః జ్ఞానాయ శ్రద్ధయా పుస్తకమ్ పఠతి.

అపాదానః:- బాలకః భయాత్ జ్ఞానాయ శ్రద్ధయా పుస్తకమ్ పఠతి.

శేషః:- బాలకః పితుర్భయాత్ జ్ఞానాయ శ్రద్ధయా పుస్తకమ్ పఠతి.

అధికరణః:- బాలకః గృహేపితుర్భయాత్ జ్ఞానాయ శ్రద్ధయా పుస్తకమ్ పఠతి.

క్రియలు.

వర్తమానః:- బాలకః పఠతి.

భూత.- బాలకః అపఠత్ - అపాఠీత్ - పపాఠ

భవిష్యత్:- బాలకః పఠిష్యతి - పఠితా

విధిః:- బాలకః పఠతు

విధి.- బాలకః పఠేత్

ఆశీస్సు.- బాలకః పఠ్యాత్

హేతుహేతుమత్తు:- బాలకః అపఠిష్యత్.

కర్తృకర్మార్థములు.

కర్త్రర్థము:- బాలకః పుస్తకమ్ పఠతి.

కర్మార్థము:- బాలకేన పుస్తకమ్ పఠ్యతే. ఇత్యాది.

అసమాపకములు.

(భూత)

కర్తృః- బాలకః పుస్తకమ్ పఠిత్వా గృహమ్ గచ్ఛతి

కర్మః:- బాలకేన పుస్తకమ్ పఠిత్వాగృహమ్ గమ్యతే

( బావి )

కర్తృ:- బాలకః పుస్తకమ్ పఠితుమ్ గృహమ్ గచ్ఛతి
కర్మ:- బాలకేన పుస్తకమ్ పఠితుమ్ గృహమ్ గమ్యతే.

ధాతుజ విశేషణములు.

కర్తృ:- బాలకః పుస్తకమ్ పఠన్ గృహమ్ గచ్ఛతి
కర్మ:- బాలకేన పుస్తకమ్ పఠతా గృహమ్ గమ్యతే.

భావలక్షణము (సతి)

కర్తృ:- బాలకే పుస్తకమ్ పఠతి బాలికా గృహమ్ గచ్ఛతి
కర్మ:- బాలకేన పుస్తకే పఠ్యమానే బాలికయా గృహమ్ గమ్యతే.
కర్తృ కర్మ:- బాలకే పుస్తకమ్ పఠతి బాలికయా గృహమ్ గమ్యతే
కర్మ కర్తృ:- బాలకేన పుస్తకే పఠ్యమానే బాలికా గృహమ్ గచ్ఛతి.
ఇత్యాది.

భావార్థకము.

బాలకేన పుస్తకస్య పఠనాత్
బాలకేన పుస్తకస్య పఠ్యమానత్వాత్ - పఠితత్వాత్
} గురుః నకుప్యతి. గురుణా నకుప్యతే. ఇత్యాది.

సంబంధార్థములు.

కర్తృ:- యతః బాలకః పుస్తకమ్ పఠతి తతః గురుః నకుప్యతి

కర్మః. యత్ర బాలకేన పుస్తకమ్ పఠ్యతే తత్ర గురుణా న కుప్యతే
ఇత్యాది.

సంకీర్ణ సమన్వయము.

క్రియా కారకములు.

బాలకః పుస్తకమ్ పఠతి.

అసమాపకములు.

బాలకః పుస్తకమ్ పఠిత్వా గృహమ్ గచ్ఛతి.

బాలకః పుస్తకమ్ పఠిత్వా గృహమ్ గంతుమ్ యత్నమ్
కరోతి.

ధాతుజములు.

బాలకః పుస్తకమ్ పఠిత్వా గృహమ్ గంతుమ్ యత్నమ్
కుర్వాణః బిభేతి.

భావలక్షణము.

బాలకః పుస్తకమ్ పఠిత్వా గృహమ్ గంతుమ్ యత్నమ్
కుర్వాణః అంధకారే జాతే బిభేతి.

భావార్థకము.

బాలకః పుస్తకమ్ పఠిత్వా గృహమ్ గంతుమ్ యత్నమ్
కుర్వాణః అంధకారే జాతే మార్గే గంతుమ్
మశక్యత్వాత్ బిభేతి.

సంబంధార్థములు.

బాలకః పుస్తకమ్ పఠిత్వా గృహమ్ గంతుమ్ యత్నమ్

కుర్వాణః అంధకారే జాతే మార్గం గంతు మశక్యత్వాత్
యదా బిభేతి తదా గురుస్తమ్ శనైర్గృహమ్
ప్రాపయతి.

కర్మార్థము:— బాలకేన పుస్తకమ్ పరిత్యాజ్యగృహమ్
గంతుమ్ యత్నమ్ కుర్వాణేన అంధకారే జాతేమార్గే
గంతు మశక్యత్వాత్ యదా బిభ్యతే తదా గురుణా
స శనైర్గృహమ్ ప్రాప్యతే.

ఇత్యాదు లన్నింటిని పాఠకులు మెలకువతో గ్రహింప వలయును. చాలవఱకును వాక్యరచనా రహస్యములనెల్ల వెల్లడిచేసితిని. ఇవిగాక యింకను చిత్రవిచిత్రములైన పోకడలు భాషయందచ్చటచ్చట కనుపట్టవచ్చును. పైకి వీనిరంబె నవి భిన్నముగా కానవచ్చినను లోనారసిచూచిన వీని కవి ప్రకారాంతర ప్రతిపాదనములేయని ప్రస్ఫుటము కాఁగలదు. ఇంతకును ఎవరెన్నివిధముల నూహించి వ్రాసినను సంస్కృత భాషలో అన్నివిధములైన వాక్యములను సిద్ధించుటకును ప్రాణ స్థానీయములైన కీలకము లారు గలవు.

1. కారకములు
2. అసమాపకములు
3. ధాతుజ విశేషణములు
4. భావలక్షణము
5. భావార్థకము
6. సంబంధార్థకములు.

వీని అన్నింటి లక్షణమును, ప్రయోగమును, అందలి విశేషాంశములను ఎవ్వరు సావధానముగా గ్రహింపగలుగుదురో

[illegible]రికి వివిధరూపములనుండు సంస్కృత వాక్యనిర్మాణము [illegible]కరతలామలకమై యుండుననుట ఆరంభకులైన విద్యార్థు[illegible]లెన్నటికిని మఱువరాని సుభాషితము. ఇది మహాజనులకందఱకు [illegible]నుభవసిద్ధము. ఈ రహస్యమును నిపుణముగా గ్రహించి [illegible]విద్యార్థులు సంస్కృతమునందు నిష్కృష్టమైన పాండిత్య [illegible]సంపదను బడయుదురుగాక.

ఇది వాక్యసమన్వయ ప్రకరణము.

వాక్య పరిచ్ఛేదము సమాప్తము.

సమాప్తశ్చాయమ్ సంస్కృత బాషాబోధినీ
నామా సందర్భః.

శ్లో॥ సంస్కృతాఖ్య మహాసౌధ
మారోఢుమ్ యస్సమీహతే
తస్యనిశ్రేణికేవైషా
భాషాయా బోధినీభవేత్॥

---



# ముద్రారాక్షసములు.

## శబ్దపరిచ్ఛేదము.



| పుట. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 4 | వట్టై | పట్టి |
| 8 | ఛాత్ర | ఛాత్రి |
| 24 | పూష్ణ | పూష్ణః |
| 42 | ఏక | • ఏక |
| 48 | విభక్త్యత | విభక్త్యంత |
| 52 | యున్నవి | యున్నది |
| 58 | శబ్దములను | శబ్దములును |
| 56 | డామయత్ | • డామయప్ |
| | డామయిష్యత్ | • డామయిష్యత్ |
| 65 | అలిఖష్యామః | అతిఖష్యామ |
| 68 | రూపమును | రూపములను |
| 70 | లెనవి | లైనవి |
| 72 | క్త్వా-తుమ్ అనువానికి | క్త్వా అనుదానికి |
| 73 | క్త్వా - తుమ్ అనువానికి | తుమ్ అనుదానికి ష్టుమ్, క్తుమ్, ఢుమ్ గ్ధుమ్ మొ॥ ద్రష్టుమ్. భోక్తుమ్ రోద్ధుమ్ దగ్ధుమ్ మొ॥ |
| 77 | ఏకథా | ఏకదా |
| 82 | అజసమ్ | అజస్రమ్ |
| | ఆయి | అయి |
| 84 | అద్యపి | అథాపి |

| పుట. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 94 | యశస్వ్వినీ | యశస్వినీ |
| | భాగశాలి | భాగ్యశాలి |
| | ద్ర్వయసచ్ | ద్వయసచ్ |
| 95 | సస్తము | సమస్తము |
| 97–99 | సాధ్య శబ్దములు | సమాసములు |
| 98 | అన్యయ | అవ్యయ |
| | ద్వంద్నము | ద్వంద్వము |
| | కూపంచ | కూపశ్చ |
| | పితేషామ్ | ఏతేషామ్ |
| 101 | ఏఓ + ఐఔ | ఏఓ ఐఔ |
| 103 | పుంగవ | పుంగవః |
| | ట్న | ట్వ |
| 104 | జగవ | జగ |
| | అపైత్స్యమ్ | అప్యైత్యమ్ |
| | మ్ఽం | మ్, ం |
| | మితర్ధా | మిత్రిర్ధా |
| 105 | అరో | అర్థో |
| 106 | ప్లీకతే | ప్టీకతే |
| | తథప | తధస |

## వాక్య పరిచ్ఛేదము.

| పుట. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 6 | అటి | అట్టి |
| 9 | వచనల నే | వచనముల నే |
| 10 | సజ్ఞ్యంతే | సజ్యంతే |
| 19 | మన్నది | మయినది |
| 21 | పార్ధమ్ - నమమ్ | సార్థమ్ - సమమ్ |
| 22 | వికారార్ణము | వికారార్థము |
| 24 | మనోకి | మనో |
| | భీమకీచకాత్ | భీమః కీచకాత్ |

| పుట. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- |
| 25 | ముక్తస్వమ్ | ముక్తస్త్వమ్ |
| 26 | హారితి | హాంతి |
| 27 | నివేదయతి | నివేదయతి |
| | షష్టిసప్తములు | షష్టిసప్తములు |
| 30 | రెండిటనీ | రెండటనే |
| 31 | అంతకంటే | అంతకంటె |
| 33 | గచ్ఛనాస్త | గచ్ఛన్నాస్త |
| 41 | భవతితి | భవతి |
| 42 | హాతతి | హారతి |
| 43 | వ్యాహహారతి | వ్యాహరతి |
| | భగనాణ | భగవాణ |
| 48 | క్రాంతి అభజత్ | క్రాంతి మభజత్ |
| 52 | కరుమ్ | కర్తుమ్ |
| | అరుజనః | అర్జునః |
| 58 | కర్థోర్థ | కర్త్రోర్థ |
| | కర్థోర్త | కర్త్రోర్థ |
| 68 | పితా — రహాస | లతా — రపహాస |
| 72 | భవిష్యః | భవిష్యసి |
| 82 | (శాద్యమానే | శాస్యమానే |
| 83 | రోథకముగా | రోధముగా |
| | యనాదార్థము | యనాదరార్థము |
| | పృచ్ఛంతాః | పృచ్ఛంత్యాః |
| | దా విశేషణ | దాని విశేషణ |
| | కావతె | రావతె |
| 85 | యాావావర్థ | యాావానర్థ |
| 87 | కథమీవ | కథమివ |
| | కథమ | కథమ్ |
| | భూాత్ | అభూాత్ |
| | అపి | మపి |
| | ప్రక్ష్యాప్యతే | ప్రక్ష్యతే |
| 88 | తథ్యాపి | తథాపి. |

